# మాఘ మాహాత్మ్యము

వడ్లపూడి పెద్దయ కవి ప్రణీతము

సంపాదకుడు

**సూర్యదేవర రవికుమార్**

తోడ్పాటు

**మిక్కిలినేని రామకోటేశ్వరరావు**

ప్రచురణ

**రావి మోహనరావు కృష్ణకుమారి దంపతులు**

చీరాల, ప్రకాశం జిల్లా

**మాఘమాహాత్మ్యము**

ప్రాచీనాంధ్ర ప్రబంధము

**వడ్లపూడి పెద్దయకవి ప్రణీతము**

**ISBN 978-81-900357-8-1**

సంపాదకుడు :
**సూర్యదేవర రవికుమార్**

తోడ్పాటు :
**మిక్కిలినేని రామకోటేశ్వరరావు**

ప్రథమ ముద్రణ :
డిసెంబరు, 2016

ప్రతులు : 500

వెల : రూ. 150/–

ప్రతులకు :

1. **రావి మోహనరావు**
   404, జంజానం కాంప్లెక్స్
   1వ పోలీస్ స్టేషన్ ఎదురు
   చీరాల – 523 155

2. **సూర్యదేవర స్వరూపరాణి**
   S4, పరమేశ్వరి టవర్స్
   4వ లైను, లక్ష్మీపురం
   గుంటూరు – 522 007

ముద్రణ :
**కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**
హైదరాబాద్

**MAAGHA MAHAATMYAMU**

OLD TELUGU CLASSIC

By

**Vadlapudi Peddaiah Poet**

Editor :
**Suryadevara Ravi Kumar**

Assistance :
**M. Ramakoteswara Rao**

First Edition :
December, 2016

No. of copies : 500

Price : Rs. 150/-

For Copies :

1. **Ravi Mohana Rao**
   404, Janjanam Complex
   Opp. 1 Town Police Station
   CHIRALA - 523 155

2. **Suryadevara Swarupa Rani**
   S4, Parameswari Towers
   4th Line, Lakshmipuram
   GUNTUR - 522 007

Printed at :
**Karshak Art Printers**
Hyderabad

# విన్నపము

*అముద్రితములుగా ఉన్న ప్రాచీన కావ్యములను వెలుగులోనికి తీసుకురావటం ఈనాడు ఒక మహాయజ్ఞమే. శ్రీ సూర్యదేవర రవికుమార్‌గారు 16వ శతాబ్దపు అముద్రిత కావ్యం 'మాఘమాహాత్మ్యము'ను వెలుగులోనికి తేవాలని సంకల్పించటం హర్షణీయం. ఇది వాయుపురాణమునకు సంబంధించిన రచన. ఇంతవరకు తెలుగులో వాయుపురాణ పద్యరచనలు వెలువడలేదు. దీని తాళపత్ర ప్రతి కాపీని మాకందించి సహకరించిన మిత్రులు తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయ విద్వాంసులు డా. వేంకటేశ్వరరెడ్డి గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని తెలుగు భాషాభిమానులందరూ ఆదరించవలసినదిగా విన్నవించుకొంటున్నాను.*

**–రావి మోహనరావు**

# ప్రశంస

అతడు శోభన రావి వంశాబ్ధిచంద్రు
డమలచిత్తుడు  కృతపుణ్యు డాప్తజనుడు
సంస్కృతాంధ్రసరస్వతీ సతిసుతుండు
పేరు మోహనరావు గంభీరగుణుడు.

ఒక వావిళ్ళకు సాటిగ
ప్రకటించెను  సంస్కృతాంధ్రభాషాకృతులన్
ఒకరిని యాచింపక పూ
నికతో లక్షలు వ్యయించి నిరుపమదీక్షన్.

అసమానపాండితీనిధు
ల సమాదరణమ్మొనర్చి లఘుటీకలతో
ఖుసిమీర గృతులు తేగా
రసవత్కవితామృతము గ్రోలి రంజిలిరి బుధుల్.

పంచవ్యాఖ్యలతో ప్రక
టించెనుగా మేఘదూత మెల్లరు పొగడన్
కాంచనము పద్మరాగం
బంచితయుతి నొప్పునటుల నది యొప్పారెన్.

ఘన జీయాలజిశాస్త్ర బోధకుడిగా కాలేజిలో పాఠముల్
అనయంబున్ బ్రవచించునాత డిపు డాహా! యాంధ్ర గీర్వాణ కా
వ్యనికాయంబుల వెల్వరించు ఘనుడై యాచంద్రతారార్క కీ
ర్తిని గాంచెన్ తన ధర్మపత్నియుతుడై శ్రీ రావి మోహన్ భళీ !

ఇట్టి మహానుభావుని నహీనయశోధను నార్యమిత్రు ని
ప్పట్టున తెన్గుసీమ కవిపండితకోటి కెలంకులందు గ
న్పట్టు సురద్రుమంబు బ్రతిభాఢ్యుని నద్యత నాంధ్రభోజ స
మ్రాట్టుని రావి మోహనుని ప్రస్తుతి సేయ దరంబె యేరికిన్.

–రవికుమార్

శ్రీః

# పీఠిక

భారతీయుల ఆధ్యాత్మిక ధార్మికచింతనకు మూలాలు వేదాలు. వారి జీవన విధానానికి, ఆచార వ్యవహారాలకు మార్గదర్శకాలు పురాణాలు. విశ్వానికి సృష్టి స్థితి లయ కారకుడైన ఒక పరతత్త్వాన్ని తెరవెనుకకు నెట్టి బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే త్రిమూర్తులను తత్కర్తలుగా ఏర్పరచుకొన్నాక వారి వారి తత్త్వాలను మహత్వాలను విస్తరించి వివరించేందుకు రచించబడినవే పురాణ గ్రంథాలు. ఆ త్రిమూర్తుల తత్త్వ వ్యాప్తికై ఒకొకరికి ఆరేసి పురాణాల చొప్పున మొత్తము 18 పురాణాలు రచించబడ్డాయి. కాలక్రమంలో ఈ పురాణాలకు ఉపపురాణాలు సుమారు యాభైవరకు సృష్టించబడ్డాయి. ఈ పురాణాలలో భౌగోళిక, చారిత్రక, జ్యోతిష, మంత్ర, వాస్తు, వంటి అనేక శాస్త్రవిషయాలు చొప్పించబడి అవి ఒక విజ్ఞాన సర్వస్వాలుగా రూపొందించబడ్డాయి. ఈ 18 పురాణాలలో మొత్తం నాలుగులక్షల శ్లోకాలున్నట్లు ఇవి క్రీ.శ. పదవ శతాబ్దినాటికి ప్రచారంలో ఉన్నట్లు పరిశోధకులు ప్రకటించారు. వీటి ప్రధాన ధ్యేయం మానవులను సన్మార్గంలో నడిపించటమే. ప్రాచీనమైనదైనా ఆధునికమైనదే అనే అర్థంలో 'పురాఅపి నవం' అన్న వ్యుత్పత్తితో పురాణ శబ్దం ప్రసిద్ధిచెందింది. ఈ పురాణాల పేర్లు భాగవత పురాణంలో ఇలా చెప్పబడ్డాయి.

బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం లైంగంచ గారుడమ్
నారదీయం భాగవతం ఆగ్నేయం స్కాందసంజ్ఞికమ్
భవిష్యం బ్రహ్మవైవర్తం మార్కండేయంచ వామనమ్
వారాహం మత్స్య కౌర్మాణి బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్.

వీటిలో బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన పురాణాలు బ్రహ్మపురాణాలుగా; విష్ణు, నారద, భాగవత, గరుడ, పద్మ, వరాహ పురాణాలు విష్ణుపురాణాలుగా; మత్స్య, కూర్మ,లింగ. శివ, స్కంద, అగ్ని పురాణాలు శివపురాణాలుగా ప్రసిద్ధిచెందాయి. బ్రహ్మపురాణాలు రాజసతత్త్వానికి, విష్ణు

పురాణాలు సాత్వికతత్త్వానికి, శివపురాణాలు తామసతత్త్వానికి ప్రతీకలుగా కొందరు భావిస్తున్నారు. ఇప్పుడు ప్రచారంలో ఉన్న వాయు భవిష్యోత్తర పురాణాలు ఈ 18 పురాణాలలో కన్పించవు. భవిష్యోత్తరపురాణానికి బదులు భవిష్య పురాణము కన్పిస్తుంది. వాయుపురాణ విషయానికివస్తే కొందరు బ్రహ్మాండ పురాణమే వాయుపురాణమన్నారు. మరికొందరు శివపురాణమే వాయుపురాణ మన్నారు. అంతర్జాతీయ గీతా సంస్థ వాయుపురాణాన్ని గ్రహించి బ్రహ్మవైవర్త పురాణాన్ని విడిచిపెట్టింది. వాయుపురాణాన్ని విడిచిపెట్టిన వారందరూ శివ పురాణాన్ని గ్రహించారు. మోతీలాల్ బనార్సీదాస్‌వారు పురాణాలకు ఆంగ్లాను వాదాలను ప్రకటిస్తూ మొత్తం 22 పురాణాలను గ్రహించారు. వీటిలో శివ వాయు పురాణాలతో పాటు దేవీభాగవతం, కాళికాపురాణం, విష్ణుధర్మోత్తర పురాణాలు ఉన్నాయి.

తెనుగు కవులు 13 వ శతాబ్దినుండే సంస్కృత పురాణాలను అనువదించటం ప్రారంభించారు. ఇప్పుడు లభిస్తున్న తెలుగు పురాణాలలో మార్కండేయ పురాణమే మొదటిది. ప్రాచీన తెలుగు కవులు ఎవరెవరు ఏయే పురాణాలను అనువదించారో గమనిద్దాం.

1. బ్రహ్మ పురాణము - చక్కిలేటి రాజగోపాలం 18-19శ

2. పద్మ పురాణము - కమలనాభామాత్యుడు (శ్రీనాథుని తాత)
మడికి సింగన (15శ. 5ఆ.)
కామినేని మల్లారెడ్డి (16-17శ. ము. 1923)
త్రిపురాన తమ్మయ్యదొర

3. మత్స్య పురాణము - హరిభట్టు (16శ.)
లింగమకుంట రామకవి (16-17శ.)
కాణాదము పెద్దన సోమయాజి (18శ.)
మండ కామేశ్వరకవి(19శ.)
అడవి సాంబశివకవి (19శ.)

| | | |
|---|---|---|
| 4. కూర్మ పురాణము | - | రాజలింగకవి (5 ఆ.) |
| | | మండ కామేశ్వరకవి ( 19శ. 8 ఆ.) |
| | | తిమ్మరాజు లక్ష్మణరావు (19శ.) |
| 5. మార్కండేయ పురాణము | - | మారన (13శ. 8 ఆ. ము.) |
| | | ఎల్లకరి నరసింహకవి (16శ. ద్వి.) |
| | | తిమ్మరాజు లక్ష్మణరావు (19శ.) |
| | | పొన్నతోట ఔబళకవి |
| | | మండ కామేశ్వరకవి (19శ. 8ఆ.) |
| | | పర్వతమంత్రి లింగన్న |
| 6. బ్రహ్మవైవర్త పురాణము | - | గోపీనాథము వెంకటకవి (19శ.) |
| | | చిలకపాటి వెంకటరామానుజ శర్మ(19శ. వ) |
| 7. స్కాంద పురాణము | - | లింగారెడ్డి |
| | | కాశీఖండము - శ్రీనాథుడు(15శ. ము.) |
| | | కార్తీక మాహాత్మ్యము - మేరంగి వెంకటయ్య |
| | | బ్రహ్మోత్తరఖండము-పిడపర్తి బసవయ్య(15 శ.) |
| | | పట్టమెట్ట సోమనాథసోమయాజి (16 శ.) |
| | | శ్రీధరమల్లె వెంకటరామకవి (18శ. 5 ఆ.ము) |
| | | పాతకోట మల్లయ్య |
| | | చిలకమర్తి రామానుజ శర్మ (19 శ.) |
| 8. లింగ పురాణము | - | తెనాలి రామలింగకవి (16 శ.) |
| 9. గరుడ పురాణము | - | పింగళి సూరన (16 శ.) |
| | | మండ కామేశ్వరకవి (19 శ.) |
| 10. వాయు పురాణము | - | మాఘమాహాత్మ్యము - |
| | | పిల్లలమఱ్ఱి పినవీరన (15 శ.) |
| | | వడ్లపూడి పెద్దయ (17 శ. 5 ఆ.) |

11. వామన పురాణము - లింగమకుంట రామకవి (16 శ.)
పొన్నతోట ఔబళకవి (16 శ. 10 ఆ.)

12. విష్ణు పురాణము - పశుపతి నాగనాథుడు (14 శ.)
వెన్నెలకంటి సూరన
కలిదిండి భావనారాయణ (16 శ. 4 అం. ము.)
పిడపర్తి సోమనాథుడు (16 శ.)
వెణుతురుపల్లి వెంకటకవి (16 శ.)
దిట్టకవి వెంకటకవి (17 శ.)
తుపాకుల అనంతభూపాలుడు (17 శ.వ. ము.)
పొందూరు అచ్యుతామాత్యుడు(19 శ. 6 ఆ)
కళ్ళేపల్లి నరసింహస్వామి (19 శ.)
ముడుంబి అప్పయ్యదీక్షితులు
తాడేపల్లి సీతారామస్వామి

13. వరాహ పురాణము - నంది మల్లయ, ఘంట సింగయ (15 శ. 12 ఆ. ము.)
హరిభట్టు (17 శ.ము.)
మండ కామేశ్వరకవి (19 శ.)

14. భవిష్యోత్తర పురాణము

15. భాగవత పురాణము - పోతనామాత్యుడు (15 శ. 12 స్కం. ము)
దోనూరి కోనేరునాథుడు (16 శ.)
జంపల్లి కొండపార్యుడు (17 శ. ద్వి.)
ఇంకా జంటకవులు -
బొప్పరాజు గంగన, హరిభట్టు
శ్రీరామనరసింహమూర్తి కవులు వంటివారు
కొన్ని కొన్ని స్కంధాలను అనువదించారు.

16. నారదీయ పురాణము - అల్లాడ నరసింహకవి (8 ఆ.ము)

17. అగ్ని పురాణము

18. బ్రహ్మాండ పురాణము - కావూరి ఎల్లన (5 ఆ.)

పై వివరాలను గమనిస్తే ప్రాచీన తెలుగు కవులు 16 పురాణాలను పూర్తిగానో పాక్షికంగానో అనువదించినట్లు కన్పిస్తుంది. అత్యధిక కవులు విష్ణుపురాణాన్ని అనువదించటం గమనించవచ్చు. అలాగే ఈ 18 పురాణాలలో చేరని నృసింహ పురాణాన్ని అనేకులు అనువదించారు. వారి పేర్లివి. వేములవాడ భీమకవి, ఎఱ్ఱాప్రెగడ, హరిభట్టు, ప్రోలుగంటి చెన్నమంత్రి, బారిగడుపుల ధర్మయ్య, దామెర్ల వెంకట్రాయుడు, కొటికలపూడి కోదండరామకవి, ముత్యాల లక్ష్మీనరసయ్య. ఇంకా పురాణమన్న పేరుతో రచించబడిన గ్రంథాలనేకమున్నాయి. వాటిలో కొన్ని కులపురాణాలు, కొన్ని స్థలపురాణాలు, మరికొన్ని వివిధ మత పురాణాలు. ఆ వివరాలూ చూద్దాం.

1. అరుణాచల పురాణము – పెదపాటి సోమనాథుడు
2. ఆదిత్య పురాణము – ఎలకూచి ఆదిత్యుడు (బాలసరస్వతి తమ్ముడు) 8 ఆ.
3. ఆది పురాణము – సర్వదేవుడు అనే పొన్నకవి, తెనాలి రామలింగడు
4. కన్యకా పురాణము – ఇటుకల తిరుమలశెట్టి; కొండమడుగు పుల్లయ్య (ద్వి.)
5. గౌడ పురాణము – మల్లికార్జున సిద్ధయోగి
6. చెన్నబసవ పురాణము – అత్తలూరి పాపకవి (18 శ.)
7. దేవాంగ పురాణము – భద్రకవి లింగకవి
8. పర్వత పురాణము – పోతమరాజు
9. బసవ పురాణము – పాల్కురికి సోమనాథుడు (ము) పిడపర్తి సోమనాథుడు
10. భార్గవ పురాణము – బహిరీ రామనాయకుడు (ము), కాండూరి వెంకటదాసు
11. భీమేశ్వర పురాణము – శ్రీనాథుడు (ము)

12. మనువంశ పురాణము - పోచిరాజు వీరన

13. మణిబసవ పురాణము - బచ్చు సిద్ధుడు

14. మల్లు పురాణము - నుదురుపాటి వెంకన్న

15. మాత పురాణము - బడబాగ్ని రామచంద్రుడు

16. విశ్వకర్మ పురాణము - ముమ్మకవి, వేంకటాచార్యుడు (ము. 10ఆ.)

17. వైశ్య పురాణము - భాస్కరాచార్యులు

18. శ్రీపర్వత పురాణము - నాగులూరి శేషనారాధ్యుడు (ము)

ఇటువంటివి మరికొన్ని ఉండవచ్చును. అష్టాదశ పురాణాలలోని పద్మ, స్కాంద, వాయుపురాణాలలో గల మాఘమాహాత్మ్యాన్ని వర్ణించే భాగాలను ఈ క్రింది కవులు తెనిగించారు.

పింగళి సూరన

వడ్లపూడి పెద్దయ - వాయు పురాణము

విజయరంగ చొక్కనాథుడు

ములుగు బుచ్చయ్య

వేదాంతం శేషాచార్యులు - పద్మ పురాణము

వడ్డేపాటి నిరంజనశాస్త్రి

పోతరాజు లక్ష్మీనరసింహకవి - స్కాంద పురాణము

సుబ్బరాజు - పద్మపురాణము

పైవాటిలో వాయుపురాణాంతర్గతమైన మాఘమాహాత్మ్యమునకు అనువాదమే ప్రస్తుత గ్రంథము.

వాయుపురాణము క్రీ.శ. 7వ శతాబ్దినాటికే ప్రసిద్ధముగా ఉన్నట్లు బాణుని హర్షచరిత్ర 3వ అధ్యాయాన్నిబట్టి తెలుస్తున్నది. 112 అధ్యాయాలు గల ఈ పురాణాన్ని మొట్టమొదట క్రీ.శ. 1880, 1888 లలో రెండు భాగాలుగా కలకత్తా లోని ఏషియాటిక్ సొసైటీవారు ప్రకటించారు. ఆ తర్వాత అది 1895 లో

బొంబాయిలోను, 1910 లో పూనాలోను ప్రకటించబడింది. దీని ఆంగ్లాను వాదాన్ని మోతీలాల్ బనార్సీదాస్ వారు 1897లో ప్రకటించారు. తిరిగి ఇది ఇప్పుడు పునర్ముద్రణ పొందింది. తెలుగు లిపిలో ఈ పురాణం పూర్తిగా ముద్రితమైనదో లేదో తెలియదు. 1920 లో వావిళ్ల సంస్థవారు సంస్కృత శ్లోకాలు, తెలుగు తాత్పర్యంతో ఒక మాఘమాహాత్మ్యమును ముద్రించినట్లు ఆంధ్రవాఙ్మయ సూచిక తెలుపుతున్నది. ఆ ప్రతి నాకు లభించలేదు. అది ఏ పురాణభాగమో తెలియదు. 1994 లో చెన్నైలోని శ్రీమధ్వసమాజంవారు కన్నడ భాషానువాదంతో 30 అధ్యాయాలు గల వాయుపురాణాంతర్గత మాఘమాహాత్మ్య మును ప్రకటించినట్లు తెలుస్తున్నది. అందులోని కథాంశాలు ప్రస్తుత గ్రంథంలోని కథాంశాలతో సరిపోలుతున్నాయి.

కాళిదాస మహాకవి తన కుమారసంభవ కావ్యంలో (10-43) కృత్తికలు మాఘమాసంలో సూర్యోదయ సమయంలో సురాపగలో పుణ్యస్నానం చేశారని తెలిపాడు. దీనిని బట్టి ఆకాలానికే మాఘస్నానాలు ప్రసిద్ధిలో ఉన్నాయని గ్రహించవచ్చు. అయితే ఈ విషయాన్ని నన్నెచోడుడు సూచించలేదు.

మాఘమాహాత్మ్యము అను ఈ తెలుగు పద్య గ్రంథమునకు కర్త ఒడ్డేపూడి పెద్దయకవిగా ఇప్పటివరకు చెప్పబడింది. శ్రీ కందుకూరి వీరేశలింగం గారు (తె.క.చ. మూడవ భాగము), వారి ననుసరించి శ్రీ ఆరుద్ర గారు (స.ఆ.సా.6-337) ఇలాగే చెప్పారు. ఈ అముద్రిత ప్రతిని గురించి వ్రాసిన శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు (పాములపాటి బుచ్చినాయుడు స్మారక సంచిక త్రివేణి పుట 46) కూడా ఇలాగే ప్రస్తావించారు. అయితే కవి తనను గురించి ఈ గ్రంథంలో తాను చెప్పుకొనిన 1-18 పద్యంలోని నాల్గవ పాదం ఈ తాళపత్ర ప్రతిలో ఇలా ఉన్నది.

**నునిచిన వొడ్డపూడి పురనాథుని పెద్దకవీంద్రచంద్రునిన్**

ఈ తాళపత్ర ప్రతిని వాఙ్మయప్రపంచానికి మొదట పరిచయం చేసిన మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారము వారు తమ 'ట్రయన్నియల్

కేటలాగు'లో ఆర్. 409 సంఖ్య క్రింద దీనిని వివరిస్తూ పై పద్య పాదాన్ని ఇలా ఉదాహరించారు.

**ననిచిన యొడ్డెపూఁడి పురనాథునిఁ బెద్దకవీంద్రచంద్రునిన్**

తాళపత్ర ప్రతి పాఠములోని యతి దోషాన్ని సవరించటానికి అందులోని 'నునిచిన' ను 'ననిచిన' గా సవరిస్తూ 'వొడ్డపూడి' ని 'యొడ్డెపూఁడి' గా మార్చారు అక్కడి అప్పటి పండితులు. శ్రీ వీరేశలింగంగారి కవుల చరిత్రలో ఈ పాదం ఇలా వ్రాయబడింది.

**నను బిన యొడ్డెపూడి పురనాథుని పెద్దకవీంద్రచంద్రునిన్**

శ్రీ వీరేశలింగంగారి వద్ద గల తాళపత్ర ప్రతిలో ఈ పాఠమే ఉండి ఉంటుంది. దీని ననుసరించే కాబోలు శ్రీ ఆరుద్రగారు 'చిన యొడ్డెపూడి' అని చెప్పారు. అయితే వారెవరూ ఈ గ్రామం ఎక్కడిదో ప్రస్తావించలేదు. చిన లేదా పిన ఒడ్డెపూడి అనే గ్రామం తెలుగుదేశంలోని గ్రామ నామాలలో కన్పించదు.

పై తాళపత్ర ప్రతిలో ఆశ్వాసాంత గద్యలలో కవి ఇంటి పేరు ఇలా వ్రాయబడింది.

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము | వొడ్డపూడి |
| ద్వితీయాశ్వాసము | వొడ్డపూడి |
| తృతీయాశ్వాసము | వొడ్లపూడి |
| చతుర్థాశ్వాసము | వొడ్డపూడి |

పైవాటిలో రెండవ అక్షరం 'డ్డె' గా ఎక్కడా లేదు. పైగా తృతీయాశ్వాసములో అది వొడ్లపూడి గా ఉన్నది. వొ(వ) డ్లపూడి పేరుతో చిన, పెద భేదాలతో రెండు గ్రామాలు గుంటూరు జిల్లా మంగళగిరి సమీపంలో ఉన్నాయి. గ్రామ నామ విజ్ఞానశాస్త్ర నిష్ణాతులైన డా. యార్లగడ్డ బాలగంగాధరరావుగారు ఈ కవి నివాసం ఈ వడ్లపూడి కావచ్చునని ఒడ్డెపూడి అన్నపేరున ఏ గ్రామము లేదని చెప్పారు. 'చిన' అన్న పదం ఆశ్వాసాంత గద్యలలో కన్పించదు. కవి తనను ఆ పురనాథునిగా చెప్పుకొన్నాడు. దీనినిబట్టి పెద్దయకవి గుంటూరు జిల్లాలోని చినవడ్లపూడి నివాసి

అని, పెదవడ్లపూడి గ్రామానికి ఆనాటి గ్రామాధికారి అని స్పష్టమౌతున్నది. ఇతడి ఇంటిపేరు ఒడ్డేపూడి కాదని వడ్లపూడి అని సుష్పష్టము. ఈ వడ్లపూడి పేరే ఈ గ్రంథంలో గ్రహించబడినది. చిన, పెద వడ్లపూడి గ్రామాలు సమీప గ్రామాలే.

పై కేటలాగులో కన్పించే 'ననిచిన' అన్న పాఠం అర్థవంతమైనదే. ననుచు అన్న క్రియాపదానికి పూచు, చిగురించు, ఇంపు, అతిశయించు వంటి అర్థాలున్నాయి. ననిచిన అంటే అతిశయించిన అని ఇక్కడ చెప్పుకొనవచ్చును కాని కృతిపతి గంగన కవిని ప్రశంసిస్తూ చెప్పిన 1-21 పద్యములో 'చిన' అన్న విశేషణం కనిపిస్తున్నందున పై 1-18 పద్యంలోని చివరి పాదం 'ననుఁ జినవడ్లపూడి' ఇత్యాదిగానే కవి చెప్పినట్లు భావిస్తున్నాను.

మాఘమాహాత్మ్యములోని ఆశ్వాసాంత గద్యలలో పెద్దయకవి తాను 'శ్రీమద్వరాహగిరిలక్ష్మీనృసింహవరప్రసాదలబ్ధ సారస్వతవిచిత్రు'డనని చెప్పుకొన్నాడు. కృత్యాది పద్యంలో శోభనాచల నృసింహుడు తన కృతిభర్తకు ఐశ్వర్యాదులు ప్రసాదించాలని ప్రార్థించాడు. పెద్దయ పేర్కొన్న వరాహగిరి ఎక్కడున్నదో తెలియదు. ఆ పేరున తెలుగునాట ఏ పర్వతము లేదు. వరాహగిరిని పందిమల అని అచ్చతెనుగులో కూడా చెప్పాడు కవి. ఆపేరనైనా తెలుగునాట ఒక పర్వతమున్నట్లు కన్పించదు. అయితే వరాహగిరి అన్న ఇంటిపేరు గలవారు ఉన్నారు. వారిలో ప్రసిద్ధులు మనకు రాష్ట్రపతిగా పనిచేసిన శ్రీ వరాహగిరి వెంకటగిరి గారు. ఇంత ప్రసిద్ధి గల పేరున ఉన్న గిరి ఎక్కడున్నదో! తమిళనాట సేలం దగ్గర ఒక వరాహగిరి ఉన్నట్లు తెలుస్తున్నది కాని అక్కడ నృసింహాలయం లేదు.

ఇక శోభనాచలమన్నది కృష్ణాజిల్లాలోని విజయవాడ-నూజివీడు మార్గంలో గల ఆగిరిపల్లె దగ్గరి కొండకు పేరు. అక్కడ నృసింహాలయమున్నది. ఆ స్థల పురాణము ఆగిరిపల్లి గ్రామ కైఫీయత్ (కృష్ణాజిల్లా గ్రామ కైఫీయతులు ఆంధ్రప్రదేశ్ రాజ్య అభిలేఖాలయం, తార్నాక, హైదరాబాద్ వారి ప్రచురణ1990) లో ఇలా ఉన్నది.

"కృతయుగమంద్దున శుభకృతుడు అనే రాజు శ్రీ మహావిష్ణువును గూర్చి అనేకకాలము తపస్సు చేసెను. ఈ పర్వతాకారంగా (ఉన్న) నాయందున లక్ష్మీసమేతులయి తమరు వుండవలెనని ప్రార్థన చేస్తే నేను మాత్రము రావటము వల్లకాదు శ్రీ సాంబమూర్తిని గూడ ప్రార్థన చేయుమని చెప్పిన మీదట ఆ రాజు ఉభయులను ప్రార్థన చేస్తే (ఈ) చోటుకి శివకేశవులు (వచ్చి) ఈ పర్వత నివాసం చేసివున్నారు. శుభవ్రతుడు అనే రాజు ఈ పర్వత స్వరూపుడు అయివున్నాడు గనుక ఈ పర్వతానికి పేరు శోభనాద్రి అని చెలగినది. ఈ పర్వతానికి పశ్చిమంగా సమీపములో వున్న సరస్సు శ్రీ స్వామివారు వరాహరూపం యెత్తి తవ్వినారు గనుక వరాహ పుష్కరిణి అను నామము గలిగినది. ఈ పర్వతానికి పావు కోసు దూరాన ... పూర్వమందున తొ(ఆ)గిరి పల్లె అనే నామము కల్గి ఊరు ఉన్నది. ఇటు తరువాత పర్వతానికి సమీపంగా ఊరు ఉండవలయునని విచారించుకొని మిరాశీదార్లు కొత్తఆగిరిపల్లి రెండువందల సంవత్సరములు అయ్నిది కట్టించినారు. శ్రీ స్వామివారు కిరి రూపము అయి దంష్ట్రముల చేత పుష్కరిణి మొదలయినవి తవ్వినారు గనుక ఈ గ్రామం పేరు ఆగిరిపల్లి అయినది. కిరి అనగా వరాహానకు పేరు."

కైఫీయతులోని పై వివరణను బట్టి ఇప్పటి ఆగిరిపల్లి నూతన గ్రామమని, దీనికి సమీపంలో గల చినఆగిరిపల్లి ప్రాచీన గ్రామమనీ తెలుస్తున్నది. దీనికి తొలి పేరు ఆకిరిపల్లి అనే భావించాలి. ఈ కొండకు శోభనాచలమనే పేరే వినవస్తున్నది కాని వరాహగిరి అని విన్పించదు.

నాకు చూడగా ఈ శోభనాచలమునే పెద్దయకవి వరాహగిరిగా చెప్పినట్లు అనిపిస్తున్నది. ఆ కొండ సమీపాన గల పుష్కరిణికి వరాహ పుష్కరిణి అని పేరున్నది గదా! పెద్దయకవి కాలంనాటికి ఇక్కడి వరాహ పుష్కరిణి బాగా ప్రసిద్ధిలో ఉండి ఆ కొండ వరాహగిరిగా కూడా ప్రసిద్ధమై ఉండవచ్చును. పెద్దయ దీనిని 'పందిమల' అని ఇక్కడి స్వామిని 'తెఱనోటిసామి' అని అచ్చతెనుగులో కూడా పేర్కొన్నాడు. ఇంకా ఈ కొండను శుభాచలమనీ, శుభధరణీధరమనీ, శోభనాచలమనీ పేర్కొన్నాడు. అలాగే తన కృతిభర్త గంగన కూడా ఈ స్వామి భక్తుడే అని

'వరతరశుభధరణీధర నరహరి ఘనదివ్య చరణ నళినద్వయ బంభరచారుమూర్తి'గా వర్ణించాడు. ఇలా ఈ కృతికర్త, కృతిభర్తలు ఇరువురూ ఇక్కడ వెలసిన శ్రీనృసింహ స్వామివారి భక్తులే కావటం విశేషం. పైగా కృతిభర్త గంగన తన రెండవ కుమారునికి సొబ్బినీడు అని ఈ కొండపేరునే పెట్టుకొన్నాడు. శ్రీ ఆరుద్ర ఈ కవిని 'సింహాచల నరసింహస్వామి భక్తుడు' అని వ్రాయటం పొరపాటు. (స.ఆ.సా. 6-337)

ఈనాటి ఆగిరిపల్లెలో రెండు నృసింహాలయాలు ఉన్నాయి. ఒకటి కొండ క్రింద గల లక్ష్మీనృసింహాలయము. రెండవది కొండ పైన గల శ్రీ వ్యాఘ్ర లక్ష్మీనృసింహాలయము. పెద్దయకవి లక్ష్మీనృసింహునే కాని వ్యాఘ్రలక్ష్మీ నృసింహుని స్మరించలేదు. ఈ కవి కాలానికి ఈ వ్యాఘ్రలక్ష్మీనృసింహాలయం ప్రఖ్యాతిలోనికి వచ్చి ఉండకపోవచ్చును. ఈ వ్యాఘ్రలక్ష్మీనృసింహుని గుఱించి ఒక కథ ప్రచారంలో ఉన్నది.

ఆగిరిపల్లి సమీప గ్రామస్థుడైన గోపయాచార్యులకు నరసింహస్వామి కలలో కనబడి తాను శోభనాచలంపై వెలసియున్నానని, తనను కనుగొని పూజాదులు నిర్వహించవలసినదని ఆజ్ఞాపించారట. గోపయాచార్యులు గ్రామస్థులను వెంట బెట్టుకొని వెళ్ళి కొండమీద వెదకుచుండగా వారికి ఎదురుగా ఒక పెద్దపులి వచ్చి క్రమంగా ఒక గుహలోనికి వెళ్ళి మాయమైనదట. గోపయాచార్యులు ధైర్యంగా దాని త్రోవనే నడిచి ఆ గుహలోనికి వెళ్ళి చూడగా అక్కడ వ్యాఘ్రముఖం గల నరసింహస్వామి లక్ష్మీసమేతుడై వెలసియుండటం చూచి సంతోషించి నిత్య పూజాదులు నిర్వహించారట. వారి తరువాత వారి కుమారులు శోభనాచార్యులు నిజాం నవాబును ఆశ్రయించి స్వామి మహిమను నిరూపించి ఆగిరిపల్లిని అగ్రహారంగా పొంది స్వామివారి ఆలయాన్ని పునర్నిర్మించారట. అయితే ఈ స్వామివారిని కనుగొన్నది దేవులపల్లి అచ్యుతభాగవతులవారని మరొక కథనం వినిపిస్తున్నది. వీరు, వీరి సోదరులు అనంతభాగవతులవారు 'శ్రీ శోభనాచల స్వామివారి కొనరించు ఉత్సవాదులను చూచి సంతసిల్లి' కొండపల్లి ఫిర్కా ముజుందారు ఇందుపూడి లక్ష్మీనారాయణరావు ఈ గ్రామాన్ని అగ్రహారంగా

చేసి వారికి దానమిచ్చినట్లు గల క్రీ.శ. 1628 నాటి తామ్రశాసనం వలన తెలుస్తున్నదని, అచ్యుతభాగవతులవారే గుడి నిర్మించారని శ్రీ ఇవటూరి విశ్వేశ్వరరావుగారు 1951 లో ప్రచురించిన 'శ్రీశోభనాద్రీశ్వరచరితము'లో వ్రాశారు. ఏమైనప్పటికి కొండమీది ఆలయము 17 వ శతాబ్దిలో వెలుగులోనికి వచ్చి క్రీ.శ. 1870 ప్రాంతంలో అప్పటి నూజివీడు జమీందారు శ్రీ రాజా నారయ్యప్పారావుగారు కొండమీదకు 750 మెట్లు కట్టించిన తరువాత ప్రసిద్ధిలోనికి వచ్చినట్లు భావించవచ్చును. కనుక పెద్దయకవి కాలంనాటికి కొండమీది వ్యాఘ్ర లక్ష్మీనరసింహస్వామివారు ప్రఖ్యాతులు కానందువలననే కొండ క్రింది లక్ష్మీనరసింహస్వామివారినే కవి పేర్కొన్నట్లు స్పష్టమౌతున్నది. క్రీ.శ. 15 వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో ఈ ఆలయం ప్రస్తావించబడినదని, క్రీ.శ. 1516 లో ఒక భక్తుడు ఈ ఆలయానికి ఒక భోగమంటపాన్ని, ఉద్యానవనాన్ని ఏర్పాటుచేశాడని ఒకరు వ్రాశారు గాని ఆ వివరాలు నాకు లభించలేదు. ఈ స్వామివారికి అంకితముగా 19వ శతాబ్దానికి చెందిన మాడభూషి నరసింహాచార్యులు రచించిన 'వల్లవీ పల్లవోల్లాసము' కావ్యాన్ని 2015 లో శ్రీ ఉన్నం జ్యోతివాసు సంపాదకత్వంలో శ్రీ రావి మోహనరావుగారు ప్రచురించారు. మాడభూషి కవి ఈ స్వామిని 'శుభగిరి శిఖరమునకు సిరులఁజెందు లక్ష్మీనరసింహ విభుడు' అనే పేర్కొన్నారు కాని వ్యాఘ్రనృసింహునిగా చెప్పలేదు. 20వ శతాబ్దానికి చెందిన నూజివీడు సంస్థానాధీశులు రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దురు గారు శోభనాచల మాహాత్మ్యము అనే కావ్యాన్ని రచించినట్లుగా డా. తూమాటి దొణప్ప గారు తమ 'ఆంధ్ర సంస్థానములు–సాహిత్య పోషణ' అనే గ్రంథంలో పేర్కొన్నారు (పుట 209). ఈ స్వామివారి మీద ఒక ప్రాచీన అజ్ఞాత కవి వ్రాసిన 3 పదకవితలను శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు కృష్ణాతీరం గ్రంథంలో ఉదాహరించారు (పుట 370).

ఇక, ఈ కృతి రచనా కాలాన్ని గురించి పరిశీలిద్దాం. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ 'ఆంధ్రకవుల చరిత్రము'లో ఈ కవిని గురించి ఇలా వ్రాశారు. "అప్పకవి ఈ పురాణము నుండి పద్యముల నుదాహరించి

యుండకపోవుట మొదలయిన కొన్ని హేతువులను బట్టి హరిభట్టుకవి కాలము వలెనే ఈ కవి కాలమును 1660 వ సంవత్సర ప్రాంతమని యూహింప దగి యున్నది". శ్రీ ఆరుద్ర గారు సమగ్రాంధ్రసాహిత్య సంపుటాలలో (6-336) ఈ కవి క్రీ.శ. 1550 ప్రాంతమువాడని వ్రాశారు. శ్రీ కొత్త భావయ్యచౌదరిగారు 'కమ్మవారి చరిత్రము' రెండవ సంపుటములో దాసరి చినగంగనను గురించి వ్రాస్తూ "దాసరివారికి నారపనేడను నతడు మూలపురుషుడు. ఈయనకు తిమ్మానేఁడను కుమారుడు జన్మించెను. ఈ తిమ్మానేఁడు క్రీ.శ. 1579 వ సంవత్సర ప్రాంతీయ వీరశిఖామణిగాఁ బేరొందెను. ఈయన వెలుగోటి కస్తూరి రంగప నాయనికిఁ బ్రత్యర్థిగా నుండి యాతనితో జరిగిన యుద్ధమునఁ బారిపోయినట్లు వెలుగోటివారి వంశావళిలోని 'దాసరేంద్రుని తిమ్మనిఁ దఱిమి తఱిమి" అన్న పంక్తుల నుదాహరించారు. ఇంకా ఈ తిమ్మానేడు మాఘమాహాత్మ్య కృతిపతి దాసరి చినగంగనకు ముత్తాత గనుక 'చౌదరీ పదవులు మొగలు ప్రభుత్వములో క్రీ.శ. 1632 వ సం. తర్వాత నేర్పడినట్లు కనబడుట వల్లను యీతఁడా తర్వాతి వాడనియే నిశ్చయింపవచ్చును' అని శ్రీ వీరేశలింగంగారు చెప్పిన కాలాన్ని సమర్థించారు. ఇలా ఈ కవి కాల నిర్ణయములలో నూరు సంవత్సరముల అంతరము కన్పిస్తున్నది.

ఈ గ్రంథ రచనా కాలం నిర్ణయించటానికి 16వ శతాబ్దపు కొండపల్లి చరిత్రను పరిశీలించవలసి ఉంది. క్రీ.శ. 1509 లో శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్య అధిపతి అయిన తరువాత అప్పటికి గజపతుల అధీనంలో గల కొండపల్లిని 1516 లో జయించాడు. అక్కడినుండి రాయలసేనల దండయాత్ర కటకందాకా సాగింది. అయితే రాయలు కొండపల్లి నుండి కటకం వరకు గల రాజ్యాన్ని గజపతులకే అప్పగించాడు. కొండపల్లి అప్పటి గజపతి సామ్రాజ్యానికి దక్షిణపు సరిహద్దు. 1523-24 లో గోల్కొండ సుల్తాన్ కులీ కుతుబ్‌షా కొండపల్లిపై దండెత్తి అక్కడి గజపతుల ప్రతినిధిని ఓడించి దానిని జయించాడు. ప్రతాపరుద్రగజపతి క్రీ.శ. 1525 లో స్వయంగా దండెత్తివచ్చి కొండపల్లిని తన అధీనంలోనికి తెచ్చుకొన్నాడు. తన ప్రతినిధిని అధిపతిగా చేశాడు. కృష్ణరాయల

మరణానంతరం గోల్కొండ సేనలు మళ్ళీ కొండపల్లిపై దాడిచేసి దానిని వశపరచుకొన్నాయి. అక్కడ సేనాధిపతిగా ఉన్నవానిని బందీ చేశాయి. ఇలా బందీ అయినవాడు గజపతి విజయనాథదేవ్ కుమారుడు రామచంద్రుడని కృష్ణా గెజిటీర్‌లో వ్రాయబడింది (పుట 30). కాని ఈ రామచంద్రుడు ప్రతాపరుద్రుని కుమారునిగా చరిత్రకారులు చెప్పారు ('హిస్టరీ ఆఫ్ ఒరిస్సా' పుట 248). ఇక అక్కడ బందీకాబడింది గజపతుల సేనాని హరిశ్చంద్రుడని, బందీ చేసింది కులీకుతుబ్‌షా కొడుకు హైదరుఖాన్ అని 'తపతీసంవరణము' అనే కావ్యంలో అద్దంకి గంగాధర కవి ఇలా చెప్పాడు.

> ఠీవిన్ హైదరుఖానుఁ డుద్దవిడి యొడ్డీలన్ విభాళించుచో
> నావేళన్ బెద కొండపల్లికడ జన్యక్షోణి దీప్తారి ర
> క్షావైయాత్యుడు వాహినీపతి హరిశ్చంద్రుండు మార్కొన్నచో
> జీవగ్రాహముగాఁగ బట్టుకొనె నక్షీణప్రభావోన్నతిన్. (1-28).

కొండపల్లి సుల్తానుల వశంకావటం సహించని గజపతుల ప్రధాన సేనాని గోవిందవిద్యాధరుడు కటకం నుండి వచ్చి మళ్ళీ కొండపల్లిని స్వాధీనం చేసుకున్నాడు. కొండపల్లి మళ్ళీ గజపతుల పాలనలోకి వచ్చింది. 1533లో ప్రతాపరుద్ర గజపతి రాజకీయ సన్యాసం చేయటంతో (మరణించటంతో అని కొందరు) గోవిందవిద్యాధరుడు కటకాధిపతి అయ్యాడు. 1538-39 ప్రాంతంలో గోల్కొండ నవాబు ఖమ్మంమెట్టును జయించి కొండపల్లి పైకి వచ్చాడు. అప్పుడు ఖమ్మంమెట్టులో ఉన్న గజపతుల మరొక సేనాని చితాబుఖాన్ కొండపల్లికి వచ్చి అక్కడ ఉన్న హరిశ్చంద్రుడనే మరొక సేనానితో కలిసి సుల్తాన్ సేనలతో యుద్ధం చేశాడు. ఈ యుద్ధంలో గోవిందవిద్యాదరుడు కూడా పాల్గొన్నట్లు తెలుస్తున్నది. సుల్తాన్ సేనలు కొండపల్లిని జయించి గజపతుల సేనలను రాజమహేంద్రంవరకు తరిమినట్లు, విద్యాధరుడు సుల్తానుతో సంధి చేసుకొని గోదావరిని రెండు రాజ్యాలకు సరిహద్దుగా నిర్ణయించుకొన్నట్లు చరిత్రకారులు వ్రాశారు. ఈ విషయాలను గంగాధరకవి ఇలా చెప్పాడు.

'ప్రథమదిక్కున యెద్దె పాత్రసామంతుల
ఘట్టించి కంబము మెట్టుఁ గొనియె'
'కటకేశ్వరునిఁ దోలి కైవశంబుగఁ జేసెఁ
గొండంత జయముతోఁ గొండపల్లిఁ
గంపమంది చితాబుఖానుఁడు గౌతమీ
తటిని లంఘించి పోఁ బుటము వెట్టె
సాగర గౌతమీసంగమ స్థలమున
నడిదంబుఁ గడిగెఁ బ్రఖ్యాతిగాగ' (1-24,25)

ఇది 1540 ప్రాంత సంఘటన. అప్పటి నుండి 1557 వరకు కొండపల్లి గోల్కొండ సుల్తానుల అధీనంలోనే ఉంది. ఈ కాలంలో గోల్కొండలో 1543లో రాజైన కులీకుతుబ్‌షాను అతడి రెండవ కొడుకు జంషీద్ చంపి తాను రాజవటం, పెద్దకొడుకు హైదర్‌ఖాన్ జంషీద్‌చే బందీ చేయబడటం, మరొక కొడుకు ఇబ్రహీం విజయనగరం పారిపోయి అళియరామరాయల రక్షణలో ఉండటం, 1550 లో జంషీద్ మరణించగా ఇబ్రహీం గోల్కొండకు రాజు కావటం జరిగాయి. ఇబ్రహీంకు (ఇతడే తెలుగుకవుల మల్కిభరాముడు) చాలా ఏండ్లు తోటి బహమనీ రాజులతో యుద్ధాలతోనే సరిపోయింది. తరువాత అందరూ కలిసి 1565 నాటి తళ్ళికోట యుద్ధానికి సన్నద్ధులుకావటం జరిగింది. ఈలోగా 1557 లో అళియ రామరాయల ప్రేరణతో కొండవీటి పాలకుడైన శివరాజు తిమ్మరాజు కొండపల్లిపై దండెత్తి అక్కడి కుతుబ్‌షా సేనలను తరిమి మచిలీపట్టణం వరకు జైత్రయాత్ర చేశాడు. కొండపల్లి మళ్ళీ విజయనగర రాజ్యభాగమైంది. 1577 లో ఇది మళ్లీ కుతుబ్‌షాహీల వశమైంది. హుసేన్‌ఖాన్ అనే సేనాని కొండపల్లికి అధిపతిగా నియమింపబడ్డాడు. 1599 లో గోల్కొండ సేనలు అమీన్‌ముల్క్ నాయకత్వంలో కొండపల్లి మీదుగా సాగి శ్రీకూర్మం వరకు జైత్రయాత్ర చేశాయి. ముకుందబాహు బలేంద్రుని కటకం వరకు తరిమాయి.

ఈ చారిత్రక నేపథ్యంలో పెద్దయకవి తన కృతిని చినగంగనకు ఎప్పుడు అంకితమిచ్చినాడో ఊహించవలసి ఉంది.

తన కృతిపతిని గౌరవించిన హరిశ్చంద్రుని పెద్దయ రెండు పద్యాలలో పేర్కొన్నాడు.

సాంద్రయశోధనుండు హరిశౌర్యుఁడు బాహుబలేంద్రుఁడా హరి
శ్చంద్రమహీతలేశుఁడు..... (1-35)

శ్రీసార్వహరిశ్చంద్ర మ
హీసుత్రామప్రకృష్టహృదయాదరణో
ద్భాసితవిభవ! ముకుంద స
దాసేవితహృత్తరంగ! దాసరిగంగా! (2-1)

పై పద్యాలలో హరిశ్చంద్రుడు బాహుబలేంద్రుడని, సార్వహరిశ్చంద్రుడని చెప్పబడ్డాడు. బాహుబలేంద్రుడు అన్నది బిరుదనామము. ఈనాటికీ ఒరిస్సాలోని కొన్ని ప్రాంతాలలో ఈ నామధారులున్నారు. ఈ హరిశ్చంద్రుడు ముకుంద బాహుబలేంద్రుని సోదరుడని శ్రీ షేర్వాణీగారు వ్రాశారు (కులీకుతుబ్‌షా పుట 112). పెద్దయకవి ఇతడిని 'సార్వహరిశ్చంద్రు'డని కూడా చెప్పాడు. ఈ సార్వ శబ్దం అతడి తండ్రి పేరును సూచిస్తుందని అనవచ్చును. కాని సార్వ అని ప్రారంభమయే వ్యక్తి పేరు ఆనాటి రాజవంశీయులలో కన్పించదు. యలమంచిలి చాళుక్యులలో ఆకాలంలో సర్వరాజు అని ఒక రాజున్నాడు. ఇతడి శాసన మొకటి 1525 నాటిది శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు తమ గ్రంథం 'ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ మైనర్ డైనాస్టీస్ ఆఫ్ ఈస్టర్న్ చాళుక్యాస్' లో చూపించారు. ఈ సర్వరాజు కుమారుడు హరినరేంద్రుడు. అతడి 1538 నాటి శాసనం కూడా పై గ్రంథంలో ఉంది. నవంబరు 1979 భారతి సంచికలో శ్రీ సూర్యనారాయణగారు హరినరేంద్రుడిని సర్వరాజు తండ్రిగా చూపించారు. బహుశ తాత పేరే మనుమనికి పెట్టారేమో! తాళపత్ర ప్రతిలో సార్వ అనే ఉన్నది. దానిని సర్వ అని భావించినా గణభంగం ఉండదు. ఈ హరినరేంద్రునే హరిశ్చంద్రునిగా పెద్దయ భావించాడేమో నని సందేహము. సార్వ పదానికి వివరణ సులభగ్రాహ్యంగా లేదు. సమకాలికుడు కవి అలా భావించడు. భావయ్యచౌదరిగారు ఈ హరిశ్చంద్రుడు శా.శ. 1518 నాటి పాలకొల్లు శాసనములో చెప్పబడిన శంకరహరిశ్చంద్రరాజు కావచ్చునేమో

అని భావించారు. కాని పెద్దయకవి సార్వహరిశ్చంద్రుడని స్పష్టంగ పేర్కొన్నందున ఇరువురు భిన్న వ్యక్తులే.

కనుక ఇద్దరు తెలుగు కవులు ప్రస్తావించిన హరిశ్చంద్రుడు 16 వ శతాబ్ది పూర్వార్ధంలో గజపతుల సేనానిగా కొండపల్లిలో ఉండి మహమ్మదీయ సేనలతో పోరాడి వారికి బందీయై విడువబడి మళ్లీ ఆ ప్రాంత ప్రతినిధిగా వ్యవహరించినట్లు భావించవచ్చును. ఇతడు ముకుందబాహుబలేంద్రుని సోదరునిగానే నేను భావిస్తున్నాను. ఇతడికి కుడిభుజంగా నిలిచినందువలననే చినగంగన అనేక బహుమానాలను అందుకొన్నాడు. కనుక మాఘమాహాత్మ్య కృతి 16 వ శతాబ్ది రచనే కాని శ్రీ వీరేశలింగం గారు శ్రీ భావయ్యచౌదరిగారు భావించినట్లు 17వ శతాబ్ది రచన కాజాలదు.

మాఘమాహాత్మ్యమును అంకితం పొందేనాటికి గంగనకు చేతికందివచ్చిన నలుగురు కొడుకులున్నారు. అంటే అప్పటికి అతడి వయసు కనీసం 55 సంవత్సరాలుగా భావించవచ్చును. ఈ కృతిలో సుల్తానుల ప్రసక్తి కన్పించదు కాని వారు ప్రవేశపెట్టిన 'చౌదరి' పదం కన్పిస్తుంది. ఈ పదం కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతాలలో పుట్టినదని, దీని తొలి రూపాలు సవధరి, సౌధరి అని క్రీ.శ. 1128 నాటి పశ్చిమచాళుక్యరాజు 3వ సోమేశ్వరుని శాసనంలో ఈ రూపాలు కన్పిస్తున్నాయని, ఒక గ్రామానికి గాని, పరగణాకు గాని పెత్తందారిగా ఉంటూ ఆ ప్రాంతంలో పన్నులు వసూలుచేసే అధికారిని ఈ పదం సూచిస్తుందని, ఇది పరిపాలనకు సంబంధించిన పదవీ సూచకమే కాని కులవాచకం కాదని చరిత్రకారులు వ్రాశారు. (చూ. ఆం.ప్ర. హిస్టరీ కాంగ్రెస్ ప్రొసీడింగ్స్ 2003 పుట 52). తెలుగుదేశంలో ఈ పదం భావయ్యచౌదరిగారు చెప్పినట్లు క్రీ. శ. 17వ శతాబ్దంలో కాక 16 వ శతాబ్దంలోనే నవాబుల పరిపాలనా కాలంలో ప్రవేశపెట్టబడింది. బహుశ కులీకుతుబ్‌షా కాలంలోనే ఇది ప్రవేశపెట్టబడి ఉండవచ్చును. కులీకుతుబ్‌షా హిందూసేనానాయకులను నమ్మి అనేక పదవులను ఇచ్చినట్లు చరిత్రకారులు వ్రాశారు. (స.ఆ.సా.6-3). కనుక సుల్తానులతో స్నేహంగా మెలిగే హిందూసేనాని అధీనంలోనే కొండపల్లి ఉన్నట్లు భావించవచ్చు.

ఇభరాముని కొలువులో 'ఆంధ్రభామిని వీణియ నాలపించె'ననీ, 'గజపతి నరపతి క్ష్మాభర్తలంపిన యొడికంపు రాయబార్లొక్కవంక'ఉన్నారని అన్న గంగాధరకవి వాక్యాలు (తపతీ. 1-13, 14) ఈ సఖ్యతకు నిదర్శనాలు. కనుక గంగన ఈ కృతిని 1540-1557 మధ్యకాలంలో స్వీకరించియుండవచ్చును. కృతిలో గజపతుల సేనానుల ప్రస్తావనే ఉన్నది కనుక ఈకాలంలోనే కృతి రచించబడిన దనటం సమంజసమే. ఇది శ్రీ ఆరుద్ర గారు ఊహించిన కాలానికి సరిపోతున్నది.

మాఘమాహాత్మ్యములోని 'కరవీర మాకంద ఘనమంజరీకుంద...' ఇత్యాదిగా సాగే కథా ప్రారంభ పద్యం వసుచరిత్రలోని 'లలనాజనాపాంగ వలనావసదనంగ..' అని సాగే సుప్రసిద్ధ పద్యశైలి ననుసరిస్తున్నది కనుక ఈ అంతర్గత సాక్ష్యాన్ని బట్టి ఈ కృతి వసుచరిత్ర తరువాతి రచనే అనవలసి ఉంటుంది. వసుచరిత్ర 1570 ప్రాంతంలో అంకితమీయబడింది. మాఘమాహాత్మ్యము ఆ తర్వాతి రచన అనటానికి అప్పటి కొండపల్లి ప్రాంత పరిస్థితులు అంత అనుకూలంగా లేవు. రాజకీయ కారణాల వలన వసుచరిత్ర 1570 ప్రాంతంలో అంకితమీయబడినా దాని రచన తళ్ళికోట యుద్ధానికి ఎంతో ముందే జరిగిందని అందులోని ప్రసిద్ధ పద్యాలు సాహితీలోకంలో ప్రచారంలో ఉండేవని విద్వాంసులు వ్రాశారు. (చూ. తపతీ. పీఠిక). లలనాజనాపాంగ ఇత్యాది పద్యాలు 1550 ప్రాంతానికే ప్రచారంలో ఉండేవని భావించవచ్చు. కనుక పెద్దయకవి ఈ కృతిని చినగంగనకు 1540-1557 మధ్యకాలంలోనే అంకితమిచ్చినట్లు భావించవచ్చును.

కృతిపతి చినగంగన ఇంటి పేరు దాసరి. ఇతడు కమ్మ కులస్థుడుగా పెద్దయకవి చెప్పాడు. కమ్మవారిలో దాసరి ఇంటి పేరుగా గలవారికి గల గోత్రాలు ఇవి. చంద్రాళ్ళ, జమ్మిళ్ళ, దేవల, దేసట్ల, పమిడిపాళ్ళ, నిట్టుల, పెరుమాళ్ళ, పోగునూళ్ళ, మారుట్ల, రేచర్ల, వల్లుట్ల, వసిష్ఠ, హరిత. (చూ. కమ్మవారి ఇంటిపేర్లు – గోత్రాలు. శ్రీ యలమంచి చిరంజీవిరావుగారి ప్రచురణ.) ఇన్ని గోత్రాలవారికి ఇంటి పేరుగా 'దాసరి' ఏర్పడటానికి కారణం వారందరు 'దాసరి' గ్రామస్థులు కావటమే కావచ్చు. "తరముల్ నాల్గయి దెందునెందునగు దత్తద్గ్రామనామంబులన్ వరలున్ వంశము" అని పింగళి సూరనకవి ఆకాలపు జనులకు తమ తమ నివాస

గ్రామ నామాలు ఇంటిపేర్లుగా ఏర్పడటాన్ని చెప్పాడు. దాసరి అనే పేరు గల గ్రామం ఆంధ్రదేశంలో ఎక్కడ ఉన్నదో తెలియదు. చిత్తూరు జిల్లాలో దాసరి గంగిశెట్టిపల్లె అనే గ్రామం ఉంది. దాసరి శబ్దం వైష్ణవమత సంబంధంగా కూడా ప్రచారంలో ఉంది. ఆ ప్రభావంతోగూడా పై గోత్రాలలోని కొందరికి ఈ ఇంటిపేరు ఏర్పడి ఉండవచ్చు. కమ్మవారిలోనే కాక రెడ్డి, కాపు, బోయ, వైశ్య, పద్మశాలి, గౌడ, పెరిక, కళావంతులు, హరిజనులలో కూడా ఈ ఇంటిపేరు గలవారు కన్పిస్తారు.

పెద్దయకవి గ్రంథాన్ని అంకితం పుచ్చుకొన్న దాసరి చినగంగన మారుట్ల గోత్రీకుడు. ఇతడి వంశవృక్షం ఈ గ్రంథంలో ఇలా ఇవ్వబడింది.




గంగన నృసింహస్వామి భక్తుడు. పురాణ నాటక కావ్య లక్షణాలు ఛందో జ్యోతిష సంగీత రహస్యాలు, ధర్మశాస్త్రాలు తెలిసినవాడని పెద్దయకవి తెలిపాడు. మద్దాలి తిరుమలాచార్యుని శిష్యుడైన ఇతడు దానశీలి. కమ్మవారిని గురించి రచించిన ఒక సీసమాలికలో 'దానధర్మవివేక తారతమ్యము గన దాసరి గంగన్న ధర్మశాలి' అని ప్రశంసించబడ్డాడు. (చూ. సూర్యదేవర రాఘవయ్యచౌదరి గారి కమ్మవారి చరిత్రము). ఇంతటి వీరుడు, పండితుడు, ధార్మికుడు, దానశీలి అయిన వ్యక్తి ఒక కవిని ఆదరించి కావ్యాన్ని కూడా అంకితం పొందటం ప్రశంసనీయం.

గంగనను గురించి పెద్దయకవి చెప్పిన విషయాలనుబట్టి ఇతడు సప్త సంతానాలలో అయిదింటిని సాధించినవాడని గ్రహించగలము. ప్రాచీనులైన కమ్మవారిలో 'సకలజీవసంజీవనము' అన్న కృతిని రచించిన సాయపనేని వేంకటాద్రినాయడు ఒకడే తెలుగులో కవితా రచన చేసినవాడు. కవులను ఆదరించి కావ్యాలు వ్రాయించినవారు, కావ్యరచనకు కవులకు ప్రేరకులైనవారు కొందరే కన్పిస్తారు. వారి వివరాలివి.

| | | |
|---|---|---|
| కాకతి గన్నమనాయకుడు (13 శ.) | - | మారన మార్కండేయపురాణ కృతిపతి |
| గోళ్ళ పెదరామ, చినరామ భూపాలురు (16 శ.) | - | పచ్చకప్పురపు తిరువేంగళకవి చొక్కనాథచరిత్రకు కృతిపతి |
| దాసరి చినగంగన (17 శ.) | - | ప్రస్తుత గ్రంథ కృతిపతి |
| అడపా నారప్ప (17 శ.) | - | బేతపూడి కృష్ణయకవి జానకీరాఘవ కృతిపతి |
| రావెళ్ళ లింగభూపాలుడు (17 శ.) | - | రత్నాకరము గోపాలరాజకవి సౌగంధికప్రసవాపహరణ కృతిపతి |
| చిరుమామిళ్ళ పాపయ (18 శ.) | - | అకలంకం కృష్ణయామాత్యకవి శకుంతలాపరిణయ కృతి ప్రేరకుడు |
| వెలిచేటి గురురాయుడు (19 శ.) | - | కాళ్ళకూరి గౌరీనాథకవి ధర్మనందనవిలాస కృతిపతి |

పైన పేర్కొన్నవారే కాక వాసిరెడ్డి వేంకటాద్రినాయనితో ప్రారంభమై వాసిరెడ్డివారనేకులు 19వ శతాబ్దంలో ఎందరో కవుల నాదరించి ఎన్నో కావ్యాలను వ్రాయించారు. ఆ వాసిరెడ్డివారి సాహిత్యసేవ ప్రత్యేకంగా పరిశీలించదగినది. పైన పేర్కొన్న కావ్యాలన్నీ గతంలో ప్రకటించబడినవి. వాటిలో సౌగంధికప్రసవాపహరణము, చొక్కనాథ చరిత్రము, శకుంతలాపరిణయము, ధర్మనందనవిలాసముల ప్రతులు ఇప్పుడు లభించవు. కమ్మవారు ముఖ్యంగా ఆయా కృతులను అంకితం పొందిన వారి వంశీయులు, ఆ కృతులకు నూతన ముద్రణ భాగ్యము గల్గించి

వారి పూర్వీకుల సాహిత్యపోషణను ముందుతరాలవారికి తెలియజేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

కవి పోషకులుగానే కాక కవులుగా కూడా కమ్మవారెందరో ప్రసిద్ధులైనారు. ఆ వివరాలను 'కవిత వ్రాసిన కమ్మవారు' పేరున మూడు సంపుటాలుగా నేను రచించాను.

పెద్దయకవి తనను గురించి ఎక్కువగా చెప్పుకొనలేదు. తాను వడ్లపూడి నివాసినని, తండ్రి పేరు వెంకటమంత్రి అని, తల్లి పేరు వీరమాంబ అని, తాను నవీనవచోనిగుంభన గలవాడననీ, నరసింహస్వామి భక్తుడననీ చెప్పుకొన్నాడు. ఇంకా తాను దానగుణాన్వితుడనని చెపుతూ తన కృతిపతి దానగుణాన్ని కూడా బహుధా ప్రశంసించాడు. ఇష్టదేవతా స్తుతిలో నృసింహునితో పాటు లక్ష్మిని, శివపార్వతులను, బ్రహ్మను, సరస్వతిని, వినాయకుని, ఆంజనేయుని స్తుతించాడు. సంస్కృత కవు లనేకులను పేర్కొన్నవాడు తెలుగు కవులలో కవిత్రయముతో పాటు 'శివసుకవి' జనులను పేర్కొనటం విశేషము. వీరందరి స్తుతికి మహాస్రగ్ధర వృత్తాన్ని ఎన్నుకోవటం మరీ విశేషము. మహాస్రగ్ధరతో పాటు తోటకము, దోదకము, లయగ్రాహి, మత్తకోకిల, ఉత్సాహము, పంచచామరము, సుగంధి, తరలము, మానిని వంటి విశేష వృత్తాలను కూడా రచించాడు. వీటిలో భ భ భ గ గ గణములు గలిగిన దోదకము అనే వృత్త ప్రయోగము అరుదైనది. వీటితో పాటు అతివిస్తారమైన దశావతార దండకమును కూడా రచించాడు. ఈ దండకముతో కలిపి ఈ రచనలో మొత్తము 1069 గద్య పద్యములున్నవి. వీటిలో నాల్గవ ఆశ్వాసములోని 8, 9 పద్యములు ప్రక్షిప్తములు కావచ్చును. సాధారణముగా ఆశ్వాసాంతమున కృతిపతిని సంబోధిస్తూ మూడు పద్యములు వ్రాయుట కావ్య సంప్రదాయము. ఈ లభించిన ప్రతిలో అయిదవ ఆశ్వాసము అసంపూర్తిగా ముగించబడినది. 1, 3, 4 ఆశ్వాసాంతములలో మూడేసి పద్యములున్నను రెండవ ఆశ్వాసాంతమున ఒక్క పద్యమే ఉన్నది. వ్రాయసకాడు మిగిలిన రెండు పద్యములను విడిచిపెట్టి ఉండవచ్చును.

పెద్దయ పద్య రచనలో సమ యతులతో పాటు గూఢ యతులు, సావర్ణ యతులు వంటి విశేష యతులు కన్పిస్తాయి. వ్రాయసకాండ్ర చేతులలో పడి నష్టమైన యతిమైత్రులను సవరించినా రెండవ ఆశ్వాసము 135 వ పద్యములోని తొలిపాదంలో గల యతి దోషము సవరించ వీలుకానందున అలాగే ఉంచబడినది. పకార ప్రాసతో సాగే మూడవ ఆశ్వాసములోని 17 వ పద్యములో 'లేఁబసరు' పదం ప్రాస స్థానములో 'లేపసరు' గా ప్రయోగించబడింది.

లక్షణయుక్తమై... కృతి పతివ్రతలా ఉండాలని ఆశించిన పెద్దయకవి (1-23) మాఘమాహాత్మ్యమును ఆవిధంగానే రచించాడు.

శ్రీ వీరేశలింగముగారు "ఈతని కవిత్వమునం దక్కడక్కడఁ గొన్ని దోషము లున్నను మొత్తముమీఁద కవిత్వము రసవంతముగానే యున్నది" అని అభిప్రాయ పడ్డారు. 'అనివార్యవచోరచనావిశారదుఁడ' నని చెప్పుకొనిన ఈ కవి ఈ కృతిని పురాణ శైలిలో చిక్కని ద్రాక్షాపాకంలో సులభసుందరంగా రచించాడనే చెప్పాలి.

కవితావైదుష్యుడు, వాక్యఫణి, వాక్కలనాజిత ఫణీశుడు అని పెద్దయకవిచే కొనియాడబడిన దాసరి చినగంగన తనకంకితమైన ఈ కావ్యం 'ఆచంద్రతారార్కమై ధరణినమరు' నని ఆశించాడు. గత 450 ఏళ్ళుగా ఈ కృతి తాళపత్ర ప్రతులకు పుత్రికలను వ్రాసి దీనిని జీవింపజేసిన వ్రాయసగాండ్ల వలన ముఖ్యంగా ఈ ముద్రిత ప్రతికి మూలమైన తాళపత్రప్రతిని వ్రాసుకొన్న శ్రీ కొనకళ్ళ సోమయాజుల పుణ్యాన శ్రీ రావి మోహనరావుగారి సౌజన్యంతో నేటికి ఇది ముద్రితమై మరి కొంతకాలం నిలబడి కృతికర్త, కృతిభర్తల ఆశను సార్థకం చేయగలదు.

తాళపత్ర ప్రతులలోని వ్రాతలలో అరసున్నలు, శకటరేఫలు సాధారణముగా కన్పించవు. ముద్రణలో అరసున్నలతో కనిపించే శబ్దాలలో కొన్ని, తాళపత్ర ప్రతులలో నిండుసున్నలతో కన్పిస్తాయి. ఉదా: వాండు, ఏంగి, నెలంతుక వంటివి. శబ్దస్వరూపాన్ని గ్రహించటానికి అరసున్నలను, శకటరేఫలను ముద్రణలో చూపించటం పరిపాటి. అలాగే ఉచ్చారణ వేగంలో పడి పరుషాక్షరాలు మొదటగా గల కొన్ని శబ్దాలు సరళాక్షరాలు మొదట గలవిగా తాళపత్ర ప్రతుల వ్రాతలలో

కూడా కన్పిస్తాయి. ద్రుతకార్యాలు ఆ వ్రాతలలో కొన్ని తావుల పూర్ణబిందువుల తోను, మరికొన్ని తావుల నిర్బిందుకాలుగాను కన్పిస్తాయి. ముద్రణ కొఱకు వీటిని తగిన విధంగా సంస్కరించటం జరిగింది.

ఎంత ప్రయత్నించినను ఈ గ్రంథంలోని ఈ క్రింది రెండు పద్యములకు సంతృప్తికరమైన పరిష్కరణ సాధ్యముకాలేదు.

యేకదంతుని మాయ యింట బట్టిన వాని
చెలియనితో బొందు చేశినాడు
తెరవొప్ప నప్పులదొర జంకి గురిగాగ
గనుపట్టు జగఝట్టి గాంచినాడు
మబ్బుసాయల యలతుక కూర్మి
నెలంతుక మానంబునిల్పి గాచినాడు
మింటబుట్టిన వాని యెసగు రట్టడి దాయ
తంద్రితోల్ బిడ్డలం దరిమినాడు
కొడుకు గెడియించి పడతుల నడవినాడు
మరిది గినిసి గర్వంబు మాన్పినాడు
కొలుచువారల బ్రోవంగ దలచి పంది
మలను తెరనోటి సామి పెంపలరినాడు. 1-24

హరిశిఖివహ్నివజ్రధరు లంతకుకాల సుచీంద్రులాసురున్
సురరిపుదండికిల్యదితిజుల్ కపుపాసినృగార్క్యజార్వ ని
ర్జరపులువాతుకొప్ప దనుజప్రభిజాగ్నిశచీపతుల్ ధనే
శ్వరధనవాశుగాద్ధిప నిశాగయమజ్జులనాంగముల్ భవున్. 5-159

పైవాటిలో మొదటి పద్యమును గూర్చి శ్రీ సుఖవాసి మల్లికార్జునరావు గారు, డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మ గారు, శ్రీ భారతం శ్రీమన్నారాయణ గారు, శ్రీ కపిలవాయి లింగమూర్తి గారు, శ్రీ మల్లాది హనుమంతరావు గారలతో జరిపిన చర్చల ఫలితంగా రూపొందిన పాఠములను గ్రహించి దానిని సంస్కరించటం జరిగింది. రెండవ పద్యమునకు శ్రీ భారతం శ్రీమన్నారాయణ గారు సూచించిన పాఠములను గ్రహించాను. పై పండితులకు నా కృతజ్ఞతాంజలులు.

ఈ రెండు పద్యములకు మెరుగైన పాఠము లూహించ గలిగిన పాఠకులు వాటిని దయతో తెలియజేయగలరు.

ఈ ముద్రిత ప్రతికి మూలమైన తాళపత్ర ప్రతి లేఖకుడు శ్రీ కొనకళ్ళ సోమయాజులు. ఇతడు ఈ గ్రంథంలోని ఏ ఆశ్వాసాన్ని ఏ ఏడు, ఏ మాసంలో, ఏ తిథికి ఎత్తివ్రాసుకొన్నాడో వివరంగా తెలిపాడు.

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసము | వ్యయ సం॥ | ఆషాఢ బ. 1 శుక్రవారము |
| ద్వితీయాశ్వాసము | ” | శ్రావణ శు. 5 బుధవారము |
| చతుర్థాశ్వాసము | ” | మార్గశిర శు. 2 స్థిరవారము |
| పంచమాశ్వాసము | సర్వజిత్తు సం॥ | చైత్ర శు. 1 శుక్రవారము |

పైన పేర్కొన్న వ్యయ, సర్వజిత్తు వత్సరాలను వెనుకకు లెక్కిస్తే అవి క్రీ.శ. 1886–87; 1826–27; 1766–67; 1706–07; 1646–47 గా గుర్తిస్తాము. వీటిలో 1886–87; 1826–27 సంవత్సరములలోని పై తిథులకు ఆయా వారములు సరిపోలుటలేదు. మిగిలిన మూడు వ్యయ, సర్వజిత్తు సంవత్సరాలకు సంబంధించిన పంచాంగ గ్రంథాలు నాకు లభించలేదు. అందువలన ఆ తిథి వారాలు పై మూడు ఆంగ్ల సంవత్సరాలలో దేనికి చెందినవో గుర్తించ వీలుకాలేదు. అయినా, ఈ తాళపత్ర ప్రతి ఇప్పటికి కనీసము 250 సంవత్సరాలకు పూర్వమే శ్రీ సోమయాజులుచే దాని మాతృక ననుసరించి ఎత్తి వ్రాయబడినదని చెప్ప వచ్చును.

ఈ మాఘమాహాత్మ్య కృతికి ఇప్పుడు పై ఒకే తాళపత్ర ప్రతి లభిస్తున్నది. శ్రీ కందుకూరి వీరేశలింగం గారు వారి ‘ఆంధ్రకవుల చరిత్రము’లో ఈ కృతిలోని 5 పద్యాలను ఉదాహరించారు. శ్రీ వీరేశలింగం గారు కవుల చరిత్రలో ఉదాహరించిన పద్యాలన్నీ తాళపత్ర ప్రతులలోనివే అని ఆ తాళపత్ర ప్రతులను వారు తగినవిధంగా జాగ్రత్తచేయకపోవటంతో అవి అంతరించిపోయాయని తెలుస్తున్నది. (చూ. ప్రబంధమణిభూషణమునకు శ్రీ నిడదవోలు వేంకటరావుగారి పీఠిక పుట. 23). ఇప్పుడు లభిస్తున్న ప్రతి ఆర్. 409 సంఖ్య గల మద్రాసు ప్రభుత్వ

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో గలది. ఇది ప్రస్తుతము తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయములో ఉన్నది. ఈ ప్రతి సమగ్రమైనదే కాని ఇందులో మధ్యభాగమున 79, 114 సంఖ్యలు గల రెండు తాటియాకులు లోపించినవి. వ్రాయసకాని వ్రాత గుండ్రముగా చక్కగా ఉన్నది. తప్పులున్నవి. కొన్నిచోట్ల వ్రాయసకాడు కొంత తబ్బిబ్బుపడి కొన్ని అక్షరాలను విడిచిపెట్టటం గాని, కొన్ని పదాలను వెనుక ముందుగా వ్రాయటము గాని జరిగింది. అనేక పద్యాలకు పద్యనిర్దేశం కూడా సరిగా లేదు. (ఉత్పలమాల–ఉ కు బదులుగా చంపకమాల–చ అని సూచించటం వంటివి). అక్షరాలు లోపించినచోట నేను పూరించినవి () గుర్తులలో చూపబడినవి. పూరించని తావులలో ... గుర్తులుంచ బడినవి. రెండవ ప్రతి లభించనందున పాఠాంతరాల ప్రసక్తి రాదుగదా. శ్రీ వీరేశలింగంగారు ఉదాహరించిన పద్యాలకు, ఈ ప్రతిలోని పద్యాలకు ఉన్న పాఠ భేదాలు విశేషమైనవి కానందున చూపలేదు.

ప్రాచీనులైన కమ్మవారికి అంకితమై సుమారు 450 సంవత్సరాలు అసూర్యం పశ్యగా ఉన్న ఈ మాఘమాహాత్మ్య పద్యకృతిని వెలుగులోకి తేవాలనే సంకల్పము గత 20 సంవత్సరాలుగా నాకున్నది కాని దీనిని ఎవరు ముద్రించగలరో తెలియక దీని పరిష్కరణకు పూనుకొనలేదు. 2015 జూలై నెలలో ఒకనాడు గుంటూరులో మిత్రులు డా॥ ఉయ్యూరు లక్ష్మీనరసింహారావు గారి ఇంటికి వచ్చిన శ్రీ రావి మోహనరావు గారిని కలిసి నా 'కవిత వ్రాసిన కమ్మవారు' రెండవ సంపుటాన్ని ఇస్తూ సంభాషణాక్రమంలో నా చిరకాల వాంఛను వినిపించగా వారు వెంటనే 'నేను ప్రకటిస్తాను మీరు గ్రంథాన్ని ఇవ్వండి' అని అన్నారు. శ్రీ మోహనరావుగారు అప్పటికే నూటికి పైగా సంస్కృతాంధ్ర గ్రంథాలను ప్రకటించియున్నారు. నేనప్పుడు 'మాఘమాహాత్మ్యము తాళపత్ర ప్రతి తిరుపతిలో ప్రాచ్యపరిశోధనాలయములో ఉంది. నేను అక్కడికి వెళ్ళి దానిని కాపీ చేసుకొని వచ్చి పరిష్కరించి ఇస్తాను' అని అన్నాను. వెంటనే వారు 'తాళపత్రప్రతి తిరుపతిలో ఉంటే దానికొరకు మీరు తిరుపతి వెళ్ళనవసరంలేదు. అక్కడ ఉన్న నా మిత్రుని ద్వారా దాని సి.డి.ని తెప్పించి మీకిస్తాను' అని అన్నారు. ఆ మాటలు పరమానందాన్ని కలిగించాయి.

అనతికాలంలోనే వారు సి.డి.ని తెప్పించటమే కాక, వారే దానికి ప్రింట్‌అవుట్‌ను కూడా తీయించి యిచ్చారు. ఫలితంగా ఈ కృతి ఈవిధంగా నేటికి వెలుగు చూస్తున్నది. ఇందుకు శ్రీ రావి మోహనరావుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను. అలాగే తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో ఉద్యోగము చేస్తున్న వారి మిత్రులు డా. వేంకటేశ్వరరెడ్డిగారికి, గుంటూరులోని మిత్రులు డా. ఉయ్యూరు లక్ష్మీనరసింహా రావు గారికి నా కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను.

ఈ కృతి ముద్రణతో ప్రాచీనులైన కమ్మవారికి అంకితమైన కావ్యాలన్నీ ముద్రణ భాగ్యాన్ని పొందినట్లయింది.

ఈ గ్రంథ పరిష్కరణలో తమ సంపూర్ణ సహకారాన్ని అందించి గ్రంథ పరిష్కరణలో మాకు కలిగిన సందేహాలను నివారించిన ప్రముఖ సంస్కృత వ్యాకరణ విద్వాంసులు, కవి 'శ్రీవ్యాసాశ్రమ కాళిదాస' బిరుదాంకితులు, బహు సంస్కృతాంధ్ర గ్రంథకర్త, ముఖ్యంగా వ్యాస భగవద్గీతకు విభిన్న ఛ్ఛందస్సులలో సంస్కృత భాషలో రూపాంతరమును రచించిన శ్రీ సుఖవాసి మల్లికార్జునరావు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. ఇంకా మా కృషికి దోహద పడిన పెద్దలు శ్రీ లంకా సూర్యనారాయణగారికి, శ్రీ భారతం శ్రీమన్నారాయణ గారికి, శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్ గారికి, మిత్రులు శ్రీ రామడుగు వేంకటేశ్వరశర్మగారికి, శ్రీ శివశంకర్ (మామిళ్ళపల్లి) గారికి మరియు ఆగిరిపల్లి లోని ఆలయ అర్చకులు శ్రీ లోకా ఉమాశంకర్ గారికి కృతజ్ఞతలు.

విద్వాంసులు, ధార్మికమార్గానువర్తులు భాషాభిమానులు ఈ గ్రంథాన్ని సమాదరింతురు గాక.

గుంటూరు **సూర్యదేవర రవికుమార్**

11-10-2016

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

శ్రీః

# మాఘమాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

ఇష్టదేవతా ప్రార్థనాదికము

శా. శ్రీలింపొందగ నాల్గు హస్తముల లక్ష్మీదేవి నుంజెక్కులన్
బాలిండ్లన్ సవినోదలీల మకరీపత్రావళుల్ వ్రాయు శా
ఖాలంకారుఁడు శోభనాచల నృసింహస్వామి సద్ధర్మ సం
శీలున్ దాసరి చిన్నగంగవిభు దాక్షిణ్యంబునన్ బ్రోవుతన్. 1

ఉ. కంతునిఁ గన్నతల్లి మురఘస్మరుపట్టపుదేవి వాహినీ
కాంతుని ముద్దు కూఁతురు జగంబులనేలెడు బోటి లేములన్
సంతమసంబు వోవఁ గరుణాంకవిరోచిక నించుసాధ్వి శ్రీ
కాంత వసించుఁగాత చినగంగగుణోత్తరు మందిరంబునన్. 2

చ. అమితవినోదకేళి మెయి నద్రిజ జూదమునందు గెల్చి య
క్కమలవిరోధిఁ బుచ్చుకొనఁగా జడ క్రొమ్ముడి విప్పఁబూని హ
స్తము లెగఁబట్టి నంతనె ముదంబునఁ దత్కుచపార్శ్వయుగ్విలా
సము గని మెచ్చు శంభుఁ డనిశంబును నీ కృతినాథుఁ బ్రోచుతన్. 3

ఉ. అంబ కదంబపుష్పలలితాలక లోలకురంగలోచనా
డంబర శంబరాంతక దృఢప్రబలోద్ధతి నిగ్రహోగ్రఫా
లాంబక వామభాగయుత హారిసుహృజ్జన హృద్విహార నె
య్యంబునఁ బ్రోచుఁగాత సుగుణాకరు దాసరి చిన్నగంగనన్. 4

చ. అమల సువర్ణవర్ణరుచిరాయతకాయుఁడు భారతీ సతీ
రమణుఁడు సర్వదేవనికరస్తవనీయనిజప్రభావుఁ డు
త్తమ మునియోగిహృద్వనజ (తర్పణ) ధామనిధిప్రకాశుఁ డ
క్కమలభవుం డొసంగుఁ జినగంగనకున్ బ్రకటాయురున్నతుల్. 5

సీ. అఖిలజగన్మయుం డైన విష్ణుఁడు మామ
కలిమిచేడియ భర్తఁగన్నతల్లి
భువననిర్మాణనైపుణ్యుఁ డాత్మేశుండు
నిగమసంఘంబులు నిజగృహములు
శాస్త్రోపనిషదర్థ సమితి సంచారమా
ర్గము చేటికలు మరుత్కంజముఖులు
బహుచిత్రవర్ణశబ్దబ్రహ్మ మాకృతి
వరలు పీఠము ప్రణవంబు గాఁగఁ

గీ. దనరు నేదేవి యాదేవి తారహార
హీరమందార కర్పూర చారువర్ణ
శారదాంబ కటాక్షవీక్షణలు నిగుడఁ
జెలఁగి మన్మానసమున వసించుఁగాత. 6

ఉ. తతధృతియై సదా తతసదాన సదాననమున్ సువర్ణసం
యుతతనువున్ బ్రలంబవిపులోదరమున్ రుచిశోభనప్రవ
ర్ధిత హరిణాంకరేఖయు మదిం దగ నిల్పినఁ గోర్కెలిచ్చు నా
నతఫలదాయకున్ ఘనవినాయకుఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. 7

సీ. అంజనావిమలగర్భాంభోధి చంద్రుండు
ప్లవగాననాంభోజ భాస్కరుండు
రావణగర్వపర్వతఘోరదంభోళి
ధరణిజా చింతాలతాలవిత్ర

మురునిశాచర యోధ కరటి పంచాస్యుండు
విశదలంకాపురీ విపినకీలి
రామ(భూప) ధరాభరణపన్నగేశుండు
సౌమిత్రిహృద్వనచైత్రమూర్తి
గీ. యాశ్రితామరభూరుహం బార్తనిచయ
వజ్రకవచంబు భువనైకవర్ణితుండు
గంధవహసూతి దాసరిగంగశౌర్య
ధనున కిష్టార్థము లొసంగి మనుచుఁగాత. 8

మహాస్రగ్ధర :
కవులన్ వర్ణింతు వల్మీకజు శుకజనకున్ గాళిదాసాఖ్యు దండిన్
భవభూతిన్ బాణుమాఘున్ బిలహణు మలహుణ్ భారవిన్ జోరుభోజున్
శివభద్రాఖ్యున్ మయూరున్ శివసుకవిజనశ్రేణి నన్నప్పఁ దిక్క
ప్రవరు శ్రీశంభుదాసప్రముఖులగు మహాభాగులన్ సంతతంబున్. 9

క. ఇనుముకతన బంగారము
ఘనపాపముకతనఁ బుణ్యకర్మము నే చె
ల్వునఁ దనరు నట్లు కుకవి క
తన సుకవి ప్రసిద్ధుఁడగును ధరణీస్థలిలో. 10

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవి స్తోత్రంబునుంజేసి యెద్దియేనియు నొక్క భవ్యకావ్యంబు నవ్యప్రబంధంబుగా రచియింపం దలంచియుండు సమయంబున. 11

సీ. తన కీర్తిచంద్రికల్ ఘనదిగీశాంగనా
కచభరసుమదామకంబు గాఁగఁ
దనకాంతి విస్ఫూర్తి జననేత్రకైరవ
ప్రకటసుధాంశుబింబంబు గాఁగఁ

దనదానగరిమ మత్యనుపమాశ్రితచాత
క ప్రావృదంబుదోత్కరము గాఁగఁ
దనప్రతాపోద్వృత్తి దర్పితారాతిదు
ర్వారకాంతార పావకుఁడు గాఁగ

గీ. వెలయు సంగ్రామపార్థుఁ డుజ్జ్వల శుభాచ
లాశ్రయనృసింహ కరుణాకటాక్షవీక్ష
ణాదికైశ్వర్యధుర్యసమగ్రశౌర్య
కలితగుణహారి దాసరి గంగశౌరి. 12

వ. వివిధవసుంధరా భాగభోగైశ్వర్యసమన్విత నగరీమతల్లి యగు కొండ పల్లికిం బ్రాగ్భాగంబున నున్నతస్థలంబున కటకసింహాసనాధీశ్వర వీరశ్రీ పురుషోత్తమగజపతి నిర్మితంబగు బ్రహ్మ క్షత్రియార్యసైరిక ప్రకట ప్రబలంబును బహుతరమహౌషధీ లతావితానదేదీప్యమానానూన నానా మణిభాసమానమానితమహీధరోపాంతంబును సమంచితకిసలయ చ్ఛదాచ్ఛాదిస్వచ్ఛతర జాలకకళికాప్రసూన శలాటఫల భరితస్ఫుటవిట పాంతర్నిరంతరనివసిత శుకబకనికర కాకలీవిరావ పరిశోభితోద్యాన వనప్రాంగణంబును విచిత్రజలపక్షిపక్ష విక్షేపకలకలనినద ప్రేంకార సంకులకోలాహలక్షుభిత మత్స్యకచ్ఛపప్రముఖనిఖిలజలచరసంచారచల దుత్తుంగాభంగతరంగ శీకరాసారసమ్మిళితపవనకంపిత కమలకల్హార పరాగవాసనావాసిత సరససుధారసోపమాన స్వాదుగంభీరాంభః సంభరిత శంభద్విశ్రంభపద్మాశ్రయయోగ్యసమంచితతటాకతీరంబును త్రిలోక విజయోత్సాహకుతూహలప్రసవశరశరాసనయోగ్య సౌభాగ్య కారనిశితాసితేక్షుదండప్రకాండ సమగ్రజాగ్రదగ్రభాగస్ఫురితంబును సమీపస్ఫార కేదారస్థితవితతశాలివ్రీహ్యాది నిఖిలసస్యపరిపూరితంబును సర్వజనాభీష్టవిశిష్టతర త్రివేళాప్రవర్షితక్షీరధారానర్గళ సర్గగోవర్గసమా కీర్ణంబును స్వకీయకులాచారసారప్రచారసమస్తవర్ణాశ్రమ జనతా కనత్ప్రకాశితంబునునై యత్యుత్తమంబగు పురుషోత్తమనామ పట్టణం

బున పరిపూర్ణకరుణాసముద్రుండును చౌదరిపట్టభద్రుండును కమ్మ
వంశ పారావారచంద్రుండును మహితగుణసాంద్రుండును బంధుమిత్ర
విధేయుండును దానకళా రాధేయుండును శ్రీమన్మారుట్లగోత్ర పవిత్రుం
డును సూరివర్ణితచరిత్రుండును మద్దాలి తిరుమలాచార్యశిష్యుండును
గవితావైదుష్యుండును పరమధర్మవిశేషుండును బ్రాహ్మణపరిరక్షణాభి
లాషుండును నగు దాసరి గంగ చినగంగనాహ్వయుండు సముచిత
వర్తనంబునం బ్రవర్తిల్లుచు నొక్కనాఁడు. 13

సీ. అతులితశాస్త్రేతిహాసజ్ఞు లొకవంక
నొకవంక దండనాయకగణంబు
తతసమన్వితవేద తత్త్వజ్ఞు లొకవంక
నొకవంక నిపుణశాబ్దికచయంబు
ప్రకటితప్రౌఢతార్కికబృంద మొకవంక
నొకవంక చతురవాక్సుకవినికర
మకలంకపౌరాణికకదంబ మొకవంక
నొకవంక జ్యోతిషప్రకరవేత్త
గీ. లొక్కచో బంధునిచయంబు లొక్కయెడ స
మగ్రసామంతవిసరము మహిమఁ గొలువఁ
గొలువు కూటంబు నందుండి కలితవచన
గారవము మీర సభికులఁ గాంచి పలికె. 14

మ. క్రమమింపొందఁ బురాణముల్ వినియు ముఖ్యగ్రంథశాస్త్రేతిహా
సములున్ నాటకకావ్యలక్షణబహుచ్ఛందంబులున్ జ్యోతిషా
గమసంగీతరహస్యముల్ స్మృతులనేకంబుల్ విమర్శించితిన్
సమబుద్ధిప్రతిభన్ రమేశ్వరపదాబ్జధ్యాన సంశీలినై. 15

గీ. అయిన సుజనులు వినుతి సేయంగ విందు
సప్తసంతానములలోఁ బ్రశస్తమగుచు
నమరు నాచంద్రతారార్కమై ధరిత్రిఁ
గృతియటంచును నది చమత్కృతిగ నిపుడు. 16

వ. కావున విష్ణుదేవుని చరిత్ర (రచియింప) నర్హులెవ్వరని సూరిజన ప్రబోధి
తుండై తత్సభామధ్యంబున నున్నవాని 17

చ. వినుత సమస్తభూభుజుని వెంకటమంత్రికి వీరమాంబకున్
దనయునిఁ బుణ్యవర్తనుని దానగుణాన్వితు నారసింహప
ద్వనరుహచంచరీకు ననివార్యవచోరచనావిశారదున్
ననుఁ జిన వడ్లపూఁడి పురనాథునిఁ బెద్దకవీంద్రచంద్రునిన్. 18

తోటకము : వినయంబునఁ గన్గొని వేడుక ని
ట్లనియెన్ సుకవీంద్ర! మురారి కథల్
వినినంత నభీష్టనవీనఫలం
బనయంబును గల్గు జనావళికిన్. 19

వ. కావున బ్రహ్మ పద్మ మత్స్య కూర్మ మార్కండేయ బ్రహ్మవైవర్త స్కాంద లింగ గారుడ వాయు వామన విష్ణు వరాహ భవిష్యోత్తర భాగవత నార దాగ్నేయ బ్రహ్మాండంబు లనియెడు అష్టాదశపురాణంబులలో వాయుపురాణ ముత్తమంబని యార్యజనంబు లెన్నుదురు. తదీయఖండ త్రయంబులలో మాఘమాహాత్మ్యఖండంబు పారావారమథనంబున నుదయంబగు సుధారసంబు పోల్కి హరిభక్తిహేతుకంబును సకలజన వర్ణితంబునునై యొప్పు నాపుణ్యకథ యాంధ్రభాషానిరూఢి నొక్క కృతి చమత్కృతిగా రచియింపుమని కర్పూరతాంబూలంబులును సుగంధ మాల్యాంబరమణిభూషణంబు లొసంగి సన్మానించి సభాసదులం గనుంగొని 20

ఉ. పంకజగర్భదార కటిభాగవిభాసితభర్మమేఖలా
కింకిణికా విరావములఁ గేరి తదీయకరాగ్రవిస్ఫుర
త్కంకణనిష్కళంకనినదంబు నగున్ జిన వడ్లపూఁడి మా
వెంకటమంత్రి పెద్దన నవీనవిలాసవచోనిగుంభనల్. 21

వ. అని బహుమానపురస్కరంబుగాఁ బల్కిన నేనుం బ్రహృష్టహృదయుండనై రచియించెదనని 22

ఉ. లక్షణయుక్తమై కనదలంకృతితో నతులార్థసంగ్రహో
దీక్షణగల్గి భర్తకు నుదీర్ఘయశంబులు గల్గఁజేయుచున్
దక్షత తోడుత న్వినిన దారితకల్మషయై పతివ్రతా
బ్జాక్షి యనంగ నొప్పవలదా కృతి సర్వసభాంతరంబులన్. 23

సీ. ఏకదంతుని మాయ యింటఁబుట్టిన వాని
చెలియలితోఁ బొందుఁ జేసినాఁడు
తెరువొప్ప నప్పులదొర జంకి గురిగాఁగఁ
గనుపట్టు జగజెట్టిఁ గాఁచినాఁడు
మబ్బు చాయల (నొప్పి మడువులనిడి) కూర్మి
నెలఁతుక మానంబు నిల్పినాఁడు
మింటఁ బుట్టినవాని మెసవు రట్టడి దాయఁ
దండ్రితో బిడ్డలం దరిమినాఁడు
గీ. కొడుకుఁ గెడియించి పడఁతుల నడిపినాఁడు
మఱఁది గినిసి(న) గర్వంబు మాన్పినాఁడు
కొలుచువారలఁ బ్రోవంగఁ దలఁచి పంది
మలను దెఱనోటి సామి పెంపలరినాఁడు. 24

వ. అని శ్రీమద్వరాహగిరి వేంకటలక్ష్మీనృసింహులం దలంచి తదనుగ్రహం బున నిరఘుండనై కృతార్థతం జెందితి నేతత్ప్రబంధకర్త యగు గంగని వంశావతారం బభివర్ణించెద 25

<u>కృతిపతి వంశ వర్ణనము</u>

చ. హరిపద సంభవుల్ బుధహితాతిశయుల్ కమలాశ్రయుల్ శుభా
చరణులు పుణ్యజీవనులు సత్పథవర్తులు లోకపావనుల్
సరసకవిప్రజాస్పదులు చారుగభీరులునై వియన్నదీ
స్థిరగతులైన వారి నుతిఁ జేసెదఁ గమ్మ కులాగ్రగణ్యులన్. 26

క. ఆ కమ్మవంశమున సుగు
ణాకరుఁడగు నారధీరుఁ డరిసముదయహృ
ద్భీకరుఁ డుదయించి ధరన్
శ్రీకాంతుని కరుణచేత సిద్ధివహించెన్. 27

చ. అతనికిఁ దిమ్మనేఁడుదయమై శుభసంయుతు నాగధన్యు శా
శ్వతయశుఁ గాంచె నా వినయశాలికి సూరమకున్ జనించి రు
న్నతమతి గంగయప్రభుఁడు నారన తిమ్మన యెఱ్ఱనాఖ్యులున్
జతుర గుణాభిరాములయి సన్నుతి కెక్కుచు వారి లోపలన్. 28

క. గంగాధరశర సుర (హయ)
పుంగవపత్రాశి పవనభు గిన నిజ యశ
స్సంగతి విలసిల్లుచు పెద
గంగన ధరఁ బ్రబలు దానగౌరవలీలన్. 29

క. భూసుర బంధుహితత్రా
ణాసక్తుఁడు ధర్మనిరతుఁ డరిధరణీభృ
ద్వాసవుఁడు ప్రాజ్ఞుఁడనఁ దగు
దాసరి పెదగంగ ఘనునిఁ దరమే పొగడన్. 30

గీ. అట్టి పెదగంగవిభుని యర్ధాంగలక్ష్మి
యక్కమకు నుదయించి పెంపలరి రవని
నాగినేఁడును చినగంగనప్రభుండు
రామకృష్ణులరీతి సుత్రామ నిభులు. 31

క. శ్రీగలిగి విదితసంతత
భోగకళారూఢిఁ దనరి భూవలయమునన్
సాగరగభీరుఁ డనఁగా
నాగన విలసిల్లు మేరునగధృతి వెలయన్. 32

వ. తదీయానుజుండు 33

సీ. సహకార పనసకేసరనింబజంబీర
(సరళాది) భూరుహోత్కరము నిల్పె
నిఖిలజీవాధార నిమ్నపుష్కరమైన
చెరువు చేయించె నచ్చెరువు గాఁగఁ
జతురదేవాగారశార్ఙ్గకోదండప్ర
తిష్ఠాసమాసక్తిఁ దేజరిల్లె
నుర్వీసురశ్రేణి కుపనయనోద్వాహ
వస్తుపదాఢ్యుఁడై వాసికెక్కె
గీ. నార్భటిని మీఱెఁ బురుషోత్తమాభిధాన
పట్టణస్థిర చౌదరి పట్టభద్రుఁ
డనుపమోదారనియతవర్తనుఁడు మాన
ధనుఁడు దాసరి చినగంగ ఘనయశుండు. 34

ఉ. సాంద్రయశోధనుండు హరిశౌర్యుఁడు బాహుబలేంద్రుఁ డా హరి
శ్చంద్రమహీతలేశుఁడు భృశంబుగ సఖ్యతతో నొసంగఁగాఁ
జంద్రసుగంధపుష్ప ఘనసంకుమదాంబర రత్నరాజి ని
స్తంద్రశుభోక్తిఁ గైకొనియె దాసరి గంగన లోకమెన్నఁగన్. 35

వ. మఱియును 36

సీ. శరశరచ్చంద్రనిర్ఝరసరిత్తుహినభూ
ధరదరద్యుతులతోఁ ద్రస్తరించి
హరిహరీశ్వరపురందరతురంగమ మరు
త్కరిగిరీశుల మహోత్కంఠ నొరసి
బలబలారికుజనిర్మలబలోద్ధదభివా
చలనలానన హయావళి జయించి
విధువిధుప్రియకరాంబుధి సుధావిబుధము
న్యధిపకాశ శ్రీల నవఘళించి

గీ. తారకావార కర్పూరతారహార
హీరపారద డిండీరదార రుచులఁ
గేరి యాచక్రవాళవిస్తారధరణి
వెలయు దాసరి చినగంగవిభుని కీర్తి. 37

చ. సరసగభీరధైర్యధనసాహసదానకళాతిశౌర్య సుం
దరఘనకీర్తివిస్ఫురణ దాసరిగంగన యొప్పగాఁ దగున్
శరనిధి శాంభవీజనకు శంకరమిత్రు శచీవరాత్మజున్
శరదు శశాంకు శంభుసుతు శౌరితనూభవు శారదాసతిన్. 38

చ. హరిచరణాంబుజాత భజనాత్మకుఁడై తనరారునట్టి దా
సరి చినగంగధీరుసతి చారుగుణాన్విత మల్లమాంబ సు
స్థిరబహుభోగసంపదలచే నలరెన్ నిరతాన్నదానత
త్పరనిజచిత్తయై నిఖిలబంధుగణంబులు సన్నుతింపగన్. 39

క. ఆ మల్లమాంబ కనియెన్
సోమనిభుని బాపఘనుని సొబ్బిను బ్రకట
శ్రీమహితుని నంకన్నను
ధీమంతుని నక్కధీరుఁ దేజోఘనులన్ 40

వ. వారిలోన 41

చ. వినయగుణాభిరాముఁ డరివీరభయంకరమూర్తి మిత్ర స
జ్జనపరిరక్షకుండు హరిశౌర్యుఁడు దానకళానిరూఢవ
ర్తనుఁ డనఁగా ధరన్ బ్రబలు దాసరి గంగన కూర్మినందనుం
డనఁ దగు బాపినేఁడు కమలాక్షపదాంబుజ మత్తభృంగమై. 42

క. జనవినుతుఁడైన దాసరి
చినగంగన సొబ్బినేని చిరతరకీర్తుల్
ఘనవాహన ఘనవాహన
ఖనదీ చంద్రార్క తుహినకరుల హసించున్ 43

క. పంకజలోచన భక్తుఁడు
బొంకఁడు కలలోననైన భూజననుత ని
శ్శంక బిరుదాంక దాసరి
యంకనఁ బ్రణుతింతు రుర్వి నార్యజనంబుల్. 44

క. చక్కెరవిల్తుని కన్నను
జక్కనివాఁ డతులదానసద్గుణములఁ బెం
పెక్కినవాఁ డిల దాసరి
యక్కనఁ బ్రణుతింపఁ దగు జనాధిప సభలన్ 45

గీ. ఇట్టి నలువురు పుత్రులు నెలమి రామ
లక్ష్మణ భరత శత్రుఘ్నుల మహనీయ
గుణులఁ బోలి విధేయులై కొలువ (నిచ్చ)
సిరులఁ జినగంగన వహించె ధరణి ప్రజల. 46

షష్ఠ్యంతములు

క. ఏవంవిధగుణగణునకు
భావజసువిలాసునకును బంధుజనవనీ
పావన పావన భావన
భావన వంతునకు వినుతపదశాంతునకున్. 47

క. శ్రీమత్పురుషోత్తమపుర
ధామునకును గాంతిఁ దుహినధామునకును దే
జోమాననీయసుగుణ
స్తోమునకును వైరిశిఖరిసుత్రామునకున్. 48

క. ధీరునకును నిజవంశో
ద్ధారునకును వాక్యఫణికి తతగుణమణికిన్
దూరాగత శూరాహిత
వీరానతపాదునకుఁ గవి వినోదునకున్. 49

క. నారాయణ పదసన్నుత
పారాయణ సదయహృదయపావనునకు వి
స్ఫారవనీపావనునకు
మారాకారునకు సుజనమందారునకున్. 50

క. ధారాధర చింతామణి
పారావారాంబుజాత పరిపంథిమరు
ద్భూరుహసమ దానకళా
ధౌరంధుర్యునకు ధర్మధర ధైర్యునకున్. 51

క. వరతరశుభధరణీధర
నరహరిఘనదివ్యచరణనళినద్వయబం
భరచారుమూర్తికిని దా
సరి చినగంగునకు సుజన సత్సంగునకున్. 52

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన మాఘమాహాత్మ్యం
బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన. 53

సీ. కరవీరమాకంద ఘనమంజరీకుంద
శరబిల్వ కురువింద సరళబృంద
మేలామదనతాళ కోలార్జునతమాల
కాలాగరురసాల సాలజాల
మారేవతసమీర ణారధ్వజమయూర
వీరద్రుమపటీరభీమసార
పరిమళమాలుంగ గిరిమల్లికాభృంగ
వరకీసరవరాంగ పురుషసంగ
గీ. మమిత కుసుమితతత విటపమహిత
కరనికరశుకపిక కలకలిత విదిత
నినదకనదమును రుచితనియత మునిజ
నంబునై పొల్చు ననిశంబు నైమిశంబు. 54

గీ. అట్టి నైమిశమున శౌనకాదిమునులు
రోమహర్షణతనయుచే రోమహర్ష
ణమ్ముగ మహితబహుపురాణములు వినుచు
నాదరంబున నిట్లని రతనితోడ. 55

క. విమలాత్మ! మాఘమాహా
త్మ్యము కర్ణరసాయనంబు ధారుణినత్యు
త్తమ మితిహాసశ్రేష్ఠం
బమితఫలప్రదము దురితహర మెన్నంగన్. 56

వ. వాయుపురాణంబునం బ్రసిద్ధంబైన యీ యితిహాసంబు సవిస్తరం
బుగా నెఱింగింపుమనిన నుగ్రశ్రవసుండు సమగ్రమనీషభాషా శేష
విశేషుండై యమ్మహనీయ సంయమివరులం గనుంగొని యిట్లని
వివరింపం దొణంగె. తొల్లి విష్ణుధర్మకథాప్రసంగసమయంబున జన
రంజనుండైన ప్రభంజను నివ్విధంబున నాదిత్యుం డడిగిన నతని కతం
డిట్లనియె. 57

క. జనవినుత! నన్ననడిగితి
వనయంబును మాధవప్రియకరంబగు నీ
ఘన చారిత్రము తెరగె
ల్లను నెఱిఁగించెదను విను మలఘుతరమతివై. 58

బ్రహ్మ నారద సంవాదము

గీ. చతురసంగీతవిద్యావిశారదుండు
ధీరజనతాధికజ్ఞానసారథుండు
నవ్యరుగ్జిత శారదానారదుండు
నారదుఁడు విష్ణుయోగమనస్కుఁ డగుచు. 59

క. నిపుణోన్నతి నిఖిలదిశా
ధిపవిశ్రుతపట్టణములఁ ద్రిమ్మరి యొకనాఁ
డపరిమితఫల సుధర్మము
నుప(దేశ)మునందుఁ దెలియ నూహించి తగన్. 60

ఉ. నాకపథంబునం గనియె నారదుఁ డబ్జజదర్శనాగతా
స్తోకనదీసరోర్ణవ వసుద్యుమణిగ్రహతారకామరా
నీకము సాంఖ్యయోగమత నిశ్చలవిష్ణు నుతిప్రమోద సు
శ్లోకసనందనాది మునిలోకవిలోకము సత్యలోకమున్. 61

వ. ఇవ్విధంబునం గనుంగొని వినిర్మలమౌక్తికప్రాలంబ తోరణాలంకృతం బైన తత్పుర గోపురంబు కదియంజొచ్చి బహువిచిత్ర రత్నఖచిత హిరణ్మయ చంద్రశాలాసాంద్రరుచు లనంతకోటిసహస్రకిరణ ప్రకాశంబునం దేజరిల్ల నీక్షించుచుం జని యొక్క మహనీయజనాశ్రయం బున నించుక క్షణముహూర్తాహోరాత్ర పక్షమాసర్త్వయన హాయనం బులు కిన్నరకింపురుషసిద్ధవిద్యాధర యక్షగంధర్వపన్నగులును పరమ యోగీంద్రులు నింద్రాది దిక్పాలకులును ద్వాదశాదిత్యులు నేకాదశ రుద్రులుం గొలువ లక్ష యోజన విస్తారంబు నష్టగోపుర సంయుక్తం బును దివ్యతేజఃపుంజంబును నగు మంటపమధ్యంబున ధర్మాదిచతు ష్పాదారూఢంబగు పీఠంబున నున్నవాని 62

మ. జగదుత్పత్తివిచిత్రకౌశలుని భాషాయోషితాత్మేశు దే
వగరిష్ఠున్ సకిరీటరత్నకిరణ వ్యాకీర్ణపాదాంబుజున్
నిగమాంతప్రతిపాద్యమానమహితోన్నిద్రున్ జిదానందయో
గ గతైకాధ్యు హిరణ్యగర్భుఁ గని జోకన్ మ్రొక్కి సద్భక్తితోన్. 63

ఉ. రంగదమర్త్యభూధరవిరాజితశృంగనిభాంగ! దివ్యచ
క్రాంగకనత్తురంగదురితాఘతమిస్రపతంగ! భారతీ
సంగ! నిజాంఘ్రిపద్మనతసన్మునిజూటకుడుంగ! సత్కృపా
పాంగవిలోకనాశ్రితతపఃఫలదాయక! లోకనాయకా! 64

ఉ. వారిజగర్భ! పూర్వకృతవర్తనచే జనులెల్ల ఘోరసం
సారనిబద్ధులై దురితచర్యలచే నతిదుఃఖమగ్నులై
క్రూరనిరీక్షితన్ సుఖమె కోరుచు నుందురుగాని ముక్తికిం
జేర నెఱుంగ రాకఠిన చిత్తుల కేగతి యానతీయవే. 65

క. హరిచారిత్రము విను స
త్పురుషులు దుర్విషయవర్జితులు సుజ్ఞాన
స్ఫుర(తర)భూరిజ్ఞులునై
పరమానందైకభోగపరులగుదు రిలన్. 66

వ. మఱియు లోకంబునందు సర్వజనహితంబుగా సుజ్ఞానోపదేశంబు సేయు మహాపురుషులుగదా జననీజనకులనం బరగుదురు సకలధర్మ వేత్తలయందీ వాద్యుండవు సర్వంబును నెఱుంగుదువు సకల దోషం బులు నేకర్మంబుచే నివృత్తియగు నా శ్రుతిస్మృత్యుదితంబులగు ధర్మం బులు బహువిధంబులై ప్రవర్తిల్లునవి దుర్లభంబులగుటంజేసి నరు లాదియందు విముఖులగుదురు సర్వబంధవినాశనంబును సుఖోపాస్యం బగు ధర్మం బతి విశేషకరంబు విశ్వాసంబుచే ధర్మంబొనర్ప భవబంధ విమోచనంబును భగవద్భక్తి హేతుకంబును నిఖిలలోక హితంబును నగు నట్టి ధర్మం బుపదేశింపుమని యభ్యర్థించిన నమ్మహాముని వాక్యంబు లాకర్ణించి సమంచితప్రహృష్టహృదయుండై యక్కాంచన గర్భుం డతని కిట్లనియె. 67

చ. కలితగుణాఢ్య! ధర్మమతి గల్గిన సంయమివర్యులందు నీ
వలఘుతరైకపూర్వికుఁడ వంచితవైష్ణవచారులక్షణో
జ్జ్వల మహనీయమానసవశంవదవర్తివి ధారుణీజనం
బుల కనిమిత్తబంధుఁడవు భూరిదయాపరమూర్తి వెన్నఁగన్. 68

క. శోభాతిశయాన్వితు లవ
నీభాగనయాగతులగు నీవంటి మహా
శ్రీభాగవతుల స్తుతు లంట
నాభాగ్యము కొలఁది యేమి నారద! తలఁపన్. 69

క. కావున నీ వీప్రశ్న శు
భావహముగ నడిగి తిది జనావళికి హితం
బై విష్ణుకథాస్పదమై
పావనులుగఁ జేయు వినినఁ బల్కిన జనులన్. 70

చ. అని సరసీరుహాక్షుని మురాంతకుఁ గృష్ణు నిరామయున్ రమే
శుని నచలున్ బురాణపురుషున్ ఘను నచ్యుతు నద్వితీయు హృ
ద్వనజమునందు నిల్పుకొని వందన మొప్పఁగఁ జేసి దోషనా
శనము శుభప్రదంబునగు శాశ్వతపుణ్యకథాప్రసంగమున్. 71

వ. నిజహృదయంబున నిశ్చయించి యిట్లనియె. 72

మాఘస్నాన మహిమ

సీ. మౌనీంద్ర!సర్వధర్మములకు నాద్యంబు
తోయావగాహంబు వేయునేల
స్నానవర్జితులైన జనులకృత్యము లిభ
భుక్తభూరి కపిత్థము (వలె) నడఁగు
రహి విష్ణుధర్మపరాయణులై ఁపేప
కడ నీటఁ గ్రుంకిన ఘను లదోషు
లలర శౌచస్నానములు రెండు సకల క
ర్మములకుఁ బితరుల మాడ్కిఁ దనరు
గీ. నుదయవేళావగాహన కోపరేని
చెలఁగి మాసత్రయంబైనఁ జేయవలయు
మేష మకర తులలయందు మిహిరుఁ డుండు
నపుడు మానవకోటు లహర్ముఖమున. 73

క. తనయా! విను మాసత్రయ
ముననైన నదీతటాకమునఁ గ్రుంకని దు
ర్జనుఁ డింద్రులు పదునలువురు
సనునంతకు ఘోరనరక సంప్రాప్తుఁడగున్. 74

గీ. అఖిల తీర్థమ్ములకును సహస్రగుణము
అధికమగు కార్తికస్నాన మంతకంటె
మాఘమున నీటఁ గ్రుంకిన మనుజునకును
గోటిగుణితం బనుచుఁ బల్కెఁ గైటభారి. 75

సీ. కలియుగంబునను మాఘస్నానఫలమున
కితరధర్మక్రియ లీడుగావు
సంసారదుఃఖంబు శమియించు నిందులఁ
జక్రిచారిత్రల సమము వచ్చు
గురుకృపగల్గిన నరుఁ బుణ్యములు చేరు
మనమున నిఖిల ధర్మములు గల్గు
దరుణార్కరుచిఁ గని విరియు చీకటి భంగిఁ
జను మాఘసుస్నానమున నఘంబు
గీ. మహినిఁ గోటి(సహస్ర) జన్మముల నైనఁ
జేయు దోషములెల్ల నశించి పోవు
పరమధర్మంబు పరమలాభంబు పరమ
గతియుఁ గల్గును సుస్నానకలితునకును. 76

క. మనుజాధముఁ డెవ్వండై
నను మాఘమునందు జలమునం గ్రుంకక యుం
డిన యేని బ్రహ్మకల్పము
ఘనమైన పిశాచతనువు గైకొని యుండున్. 77

గీ. ఓపి జలముల నదుల సూర్యోదయంబు
గాక యటుమున్న నరుఁ డవగాహనంబు
సల్పెనేనియు బంధవర్జన పునర్భ
వములఁబాయును మకరమాఘమున ననఘ. 78

చ. అలవడ నేఱులున్ సరసు లాదిగఁ గల్గు నదీవిశేషముల్
కలితనమున్ మహత్త్వమును గైకొను సూర్యుఁడు నక్రయుక్తుఁడై
చెలఁగ నహర్ముఖంబునఁ బ్రసిద్ధిగ నందవగాహనంబుచేఁ
బొలియు నశేషబంధములు భూజనకోటికి నద్భుతంబుగన్. 79

సీ. బ్రాహ్మణ హంతకుల్ పశుహంతకులు బితృ
హంతకుల్ మానినీహంతకులును
శిశుహంతకులు పరస్త్రీసంగులును సువ
ర్ణస్తేయులును బరద్రవ్యదేవ
ధనచోరులును గురుతల్పగులును నధ
ర్మపరులు కుమత దుర్మార్గవర్త
నులు మిత్రవధికులు కలహవాదులు మృషా
వాదులు నిందాపవాదు లాస

గీ. వప్రమోదవిషాదులు వనవిఖండి
తులును కోడెలు గృహదాహకులు కృతఘ్ను
లైన సుస్నాతులై దురాహ్వాములఁ బొలియు
నెలమినని మాఘదినముఖ జలము మెఱయు. 80

క. ఏనరుఁడైనను మాఘ
స్నానము సూర్యోదయావసరమునఁ జేయున్
బో నియతుఁ డాతఁడని ప్రియ
మూనంగా మ్రోయు జలమహోరాత్రంబున్. 81

గీ. చెలఁగి లోకత్రయంబునఁ గల త్రికోటి
పంచలక్షతీర్థములు ప్రాభాతిక సమ
యమున నుర్విని సకలజలములయందుఁ
గలసి తగనుండునని స్మృతుల్ పలుకుచుండు. 82

సీ. స్నానంబు మాఘమాసమునఁ జేయనివాఁడు
చండాల కులమున సంభవించు
వనిత సేయదయేని వరహీనయై పుట్టు
వైష్ణవభక్తి వివర్జితాత్మ
పుణ్యంబులీనమై పోవు నింత నిజంబు
నంతజన్మానుగతాది దుష్ట
కర్మబంధంబులు కడచనుఁ జండధా
మహతినిఁ గనిన హిమంబు కరణిఁ

గీ. బన్నగంబుల గరుడుండు పర్వతములఁ
గులిశమును వారణముల నంకుశము దుష్కృ
తముల హరి భజనము నెవ్విధమున నోర్చు
నట్లు మాఘము మానవాంహముల కనఘ! 83

సీ. అమరగణంబులో నంబుజనాభుండు
నదుల లోపల జహ్ను నందనయును
భూరుహంబుల లోన బోధిద్రుమంబును
బశుసమూహంబు లోపలను మొదవు
సకలవేదములలో సామవేదంబును
బ్రకటమంత్రములలోఁ బ్రణవరాజ
మలఘుతరచ్ఛందములలోన గాయత్రి
పక్షిసంఘంబులోఁ బన్నగారి

గీ. యేక్రమంబున ముఖ్యమై యెసఁగు నట్లు
నమరు మాఘంబు సకలమాసముల లోనఁ
గావున నొనర్చువారల గ్రహభయములుఁ
జేర వహిభూతభయములుఁ జెందవెపుడు. 84

సీ. కలుషంబు లణఁగు మాఘస్నాన మొనరించు
జీవుల కని ముని చెప్పె యముఁడు
చిత్రగుప్తునకు మున్సిద్ధంబు సాంగత్య
ముననైన స్వాభావముననను నైనఁ
గృతముననైన దుష్కృతము లడంచెద
ననుచు గర్జించుఁ దోయంబు లెపుడు
మకరమాఘంబున మాధవార్చన సేయఁ
బూని మాతృస్తన్యమునకుఁ జొరదు

గీ. బుద్ధిశూన్యులు సంసారభోగి దుష్ట
లైనవారికి నిది పరమౌషధంబు
పూర్వజన్మాది దుష్కృతంబులు హరించు
నైహికంబున సుస్నాతుఁడైన నరుఁడు. 85

గీ. మేరుమందర తుల్యమై మీఱు నఘము
లణఁగు సుస్నానమునఁ (జేయ) నభిలషించు
మాత్ర నశియించు బంధముల్ మఱియుఁ దీర్ఘ
సేవకై నరుఁడేఁగిన సిరులు గలుగు. 86

క. కావున విప్రక్షత్రియ
త్రైవర్ణిక శూద్రులకును దగుఁ జేయంగా
వావిరి మాఘస్నానం
బీవిధి నిగమములు నొడువు నెప్పుడుఁ బుత్రా! 87

క. భూసురవటుఁడు గృహస్థుఁడు
వానప్రస్థుండు యతియు వదలక మాఘ
స్నానంబు సేయవలయును
భానుఁడు మకరస్థుఁడగుచుఁ బరగిన వేళన్. 88

క. మునివర! మాఘస్నానం
బొనరింపని నరుఁడు శునకయోనుల జనియిం
చును నూఱువరుస లిట్లని
మనుజున కది సేయు టొప్పు మదినూహింపన్. 89

క. ఇది ఘనతరబాంధవ్యం
బిది పరమశుభప్రదాఢ్య మిది పరమతపం
బిది పరమగతి యనందగు
మది మాఘస్నానమహిమ మతమేనెంతున్ 90

వ. అని యానతిచ్చిన నారదుం డక్కమలసంభవున కిట్లనియె. 91

క. శ్రీనాయకహిత! మాఘ
స్నానంబేరీతి మోక్షసాధన మిది మీ
రానతి యీఁదగు శిష్యుఁడ
సూనుఁడనగు నన్నుఁ గరుణఁ జూచి మహాత్మా! 92

మాఘస్నాన విధానము

వ. అనిన విని యన్నారదమునికి వనజగర్భుం డిట్లను మాఘస్నాన వ్రత నిర్ణయక్రమం బెట్లనిన పుష్యశుద్ధదశమి యాదిగా మాఘశుద్ధ దశమి పర్యంతంబైనను తత్పౌర్ణమాసి మొదలుగా బౌర్ణమిపర్యంతంబైనను మకరప్రవేశంబుగాఁ గుంభపర్యంతంబైన నితర వ్రతంబులు మాని స్నానంబు సేయుట యుత్తమంబు. 93

క. సుకరముగ నెల్లి మొదలుగ
మకరస్నానం బొనర్తు మాధవ! నిర్వి
ఘ్నకలితుగఁ జేయు మనుచును
బ్రకటితముగఁ దొలుదినమునఁ బలుకఁగ వలయున్. 94

సీ. అనుచు సుస్నాతుఁడౌ నప్పుడే నియమించు
కొని మఱునాఁటి వేకువను లేచి
జనుఁడు దూరస్థలంబున కేఁగి మూత్రపు
రీషముల్ విడిచి విశేష పాత్ర
మున శౌచవిధి సల్పి మొగి పదప్రక్షాళ
నము సేసి తగ రదనములు దోమి
జలములఁ బది వరుసలు పుక్కిలించివై
చి యతి ప్రియాత్ముఁడై చేలమునను
గీ. గడఁగి నదియందుఁ జొచ్చి సంకల్పమమరఁ
జెప్పి లక్ష్మణ గోవింద చిన్మయాత్మ
చక్రధర పద్మనాభ సుస్నానమునకు
నెలమి ననుమతి నిమ్మని పలుకవలయు. 95

క. తదనంతరంబు గంగన్
ద్రిదశాపాంగన్ దలంచి దినకరబింబం
బుదయించక మును మర్త్యుఁడు
నదియం దవగాహనం బొనర్పఁగ వలయున్. 96

వ. మఱియు భాగీరథి భోగవతి జాహ్నవి త్రిదశేశ్వరి నందిని నళిని మాలతీ మలాపహ స్రోత్రి గంగానది త్రిపథగ విష్ణునది యను నీ ద్వాదశ నామంబులు స్నానవేళ నెవ్వరు పఠియింతురు తత్క్షణంబున యాస్థలం బులనుండి తీర్థంబులు సన్నిహితంబులగు స్నానానంతరం బున నయ్యె నదుల కర్ఘ్యంబిచ్చు నప్పుడు మంత్రంబులిట్లు చెప్పుకొనవలయు 97

శ్లో. నమః కమలనాథాయ నమస్తే జలశాయినే
నమస్తేస్తు హృషీకేశ గృహాణార్ఘ్యం నమోస్తుతే. 98

శ్లో. మాఘమాసే మహాదేవ వ్రతస్థోహం జనార్దన
గృహాణార్ఘ్యం మయాదత్తం మాధవోద్య ప్రసీద మే. 99

వ. అని విష్ణునకర్ఘ్యంబిచ్చి యా తదనంతరంబున. 100

శ్లో. వృద్ధగంగే మహాపుణ్యే గౌతమస్యాఘనాశనీ
గోదావరీ గృహాణార్ఘ్యం యమునే ఫలదా భవ. 101

వ. అని యమునకు నర్ఘ్యంబిచ్చి తదనంతరంబునను 102

శ్లో. దేవమానస సంభూతే సరస్వత్యఘనాశనీ
గృహాణార్ఘ్యం మయాదత్తం పృథుకా నగరగామినీ. 103

వ. అని సరస్వతి కర్ఘ్యంబిచ్చి పదంపడి. 104

శ్లో. సహ్యపాదోద్భవా దేవీ శ్రీశైలోత్సంగగామినీ
గృహాణార్ఘ్యం మయాదత్తం సర్వపుణ్య ఫలప్రదా. 105

వ. అని కృష్ణవేణి కర్ఘ్యంబిచ్చి యితర నదులకు వేర్వేర నర్ఘ్యంబీవలయు ధాత్రీ ఫలసమానమైన మృత్తికయు గోమయంబును గైకొని స్నానంబు సేసి పితరుల గురుల స్మరియించి ప్రత్యేకంబ స్నానంబొనర్చి సాలగ్రామ తీర్థంబు శిరంబున ధరించి జలంబులు వెడలి దేవర్షి పితృతర్పణంబులు సేసి శిఖండజలబిందుసందోహంబు దక్షిణాంసభాగంబున నురుల ధౌతవస్త్రపరిధానుండై యార్ద్ర వస్త్రంబువిడిచి శుద్ధాచమనం బొనరించి తదీయవస్త్రంబు భూమిపై నుంచి ప్రోక్షించిన యనంతరంబ ద్వాద శోర్ధ్వపుండ్రంబులు ధరియించి సంధ్యోపాసనా దేవపూజావిధానంబులు గావింపవలయు ననిన నారదుండు పద్మజుం గనుంగొని చూడా జలంబులు దక్షిణభాగంబున నొదులవలయునని యానతిచ్చితిరి యందేమి ఫలంబు గలదనిన భారతీవల్లభుం డిట్లనియె. 106

సీ. సురనాయకుఁడు మున్ను గరుడభయంబున
నమృతంబు విప్రశిఖాంతరముల
డాఁపఁగాఁ బదిలమౌటను జూచి పక్షీంద్రుఁ
డలిగి పీయూష మయ్యమరపతికి
ఫలియింపదనుచు శాపంబిచ్చి తచ్ఛిఖా
స్రుతిజలధారసంగతముఁ జెంది
సురభూ పతితమైనచో బితృభోగ్యమౌ
నని దయామతిఁ బల్కి యవనిసురులఁ
గీ. జీరి దివ్యరసంబు మీశిఖల నింద్రుఁ
డునిచె నది మాదియనిన లోభోపహతమ
నస్కులై లేదటన్న వినాథుఁ డపర
పక్షగతులగు పితరులఁ బల్కె నపుడు. 107

క. మీరీ సందేహము నిజ
మారసి పల్కుఁడన దేవతాహారంబీ
ధారుణి నమరులు దాఁచిన
వారన విని పక్షివిభుఁడు వారల కనియెన్. 108

ఉ. మీరు నిజంబు పల్కుటకు మెచ్చితి విప్రశిఖాశ్రయామరా
హారము భూమిలోఁ బితృగణాశనమౌను శిఖాజలంబులన్
జారగనీక యెవ్వఁడవిచారముతోడ విదల్చు వాఁడు దు
ర్వారయమోగ్రబాధలు నిరంతరమున్ గను రక్తపాయియై. 109

చ. అనివరమిచ్చి రక్తరుచిరాంబకుఁడై ధరణీసురౌఘమున్
గనుఁగొని మీరు సత్యులరు గావున నం దమృతాప్తిగల్గియు
న్నను సమకూరుజన్మమును నాశన మేకవిచారశూన్యతన్
జనుఁడని శాపమిచ్చి ఖగచంద్రుఁ డదృశ్యముఁ జెందె గ్రక్కునన్.
వ. కావున శిఖండజలంబులు పవిత్రంబులయ్యె నదియునుంగాక తద్దోష
కర్మ ప్రతీకారంబులు వివరించెద నాకర్ణింపుము 111

గీ. చెట్టునీడలఁ దెరువులఁ బుట్టలందుఁ
గూపముల రచ్చపట్టుల ద్వీపములను
చెంగటను దేవతాగృహప్రాంగణముల
విగతమతి మలమూత్రముల్ విడువఁజనదు. 112

క. నదిలోపల మలమూత్రము
లదనెఱుఁగక చేసెనేని యతఁ డజకల్పం
బొదవిన ఖేదంబున యమ
సదనప్రాంగణమునం దజస్రము నుండున్. 113

గీ. చలము డింపక నదుల శౌచంబు సేయు
నతఁడు పితరులతో నథోగతినిఁ జెందు
నట్లయగు బావి చెఱువును నంబుజాక
రమున మడువున నొనరింపఁ గుమతులకును. 114

సీ. వాస్తవ్యకంటెను వటునకు శౌచవి
ధానంబు ద్విగుణమై (తనరుచుండు)
ననుపు మీఱంగ వానప్రస్థునకునుఁ ద్రి
గుణము సన్యాసి కెక్కుడు దలంప
వనజలోచనకు శూద్రునకు దుర్గంధంబు
తలఁగున యంతమాత్రంబు చాలు
పుట్టలోనిది మందపట్టుది యెలుక త్ర
వ్వినది త్రోవది మన్ను విధికి కాదు

గీ. పాడ్యమీ షష్ఠి నవములఁ బర్వములను
ద్వాదశులఁ గాష్ఠముల దంతధావనంబు
సేయవలవదు ఏకాదశియును వర్జ
నములు నొనరింపఁగా సవర్ణములఁ దగును. 115

వ. మఱియు గంగా గోదావరీ కృష్ణవేణ్యాదులం దలంపక యవగాహనంబు సేయందగ దజ్ఞానంబునం జేసెనేని మృత్తికాస్నానంబులు సేయ వలయు నిట్టి దోషంబు లెఱింగి సుస్నాతుండైన నరుండు మాఘమాస ప్రియుండును బ్రసన్నవదనుండును నైన మాధవుం బూజింపవలయు (నది) యెట్లనిన నద్దేవు నుద్దేశించి 116

మాధవ పూజా విధానము

సీ. ఆవాహనము నీకు దేవారిభంజన
పీఠంబు నీకుఁ గృపీటశాయి
యర్ఘ్యంబు నీకు స్ఫాయద్ఘనాఘనవర్ణ
పాద్యంబు వేదాంతవేద్య నీకు
నాచమనీయముద్యద్గదాధర నీకు
స్నానంబు భక్తసంతాన నీకు
వస్త్రంబు నీకు శశ్వత్కౌస్తుభశుభాంగ
గంధంబు కంధిజాకాంత నీకు

గీ. నక్షతలు నీకు (సుర) గణాధ్యక్ష వినుత
ప్రసవములు నీకు కాశిభుగ్భవ్య పత్త్ర
ధూపమవిరత దివ్యచిద్రూప నీకు
దీప మనుపమ యదుకులదీప నీకు. 117

సీ. కారవేల్ల వటోల కదళి కోర్వారుక
శిగ్రుకూష్మాండ సమగ్రతాశ
లాటులు చించాఫలమరీచజీరక
రామఠ శర్కరాస్థామకలిత
మగుచుఁబాకములఁ బెంపమరిన నదియును
ఘనతరానేకశాకములు చూత
జంబీర లికుచ రుచక బదరీగ్రాహి
ఫలసమ్మితపు సర్షప రుచిఁ దనరు

గీ. పచ్చడులు శిఖరిణి బహుభక్ష్యపాయ
సాన్న ఘృతసూప దధి మధితాంబు విదిత
చతుర నైవేద్యమిదెనీకు జలధికన్య
కాసమేతయి గైకొను కైటభారి. 118

క. శంబరధర తనుశోభిత!
శంబర రిపుజనక! భక్తజనతావన! పీ
తాంబర కటిభాగాంచిత!
తాంబూలము నీకిదియె శతక్రతువినుతా! 119

గీ. మల్లికా మాలతీనవమల్లికాబ్జ
కైరవాశోకవాసంతికా మరువక
కుంద చాంపేయకుసుమముల్ గొనుము నీకు
నమరఁబుష్పాంజలి యొనర్తుఁ గమలనాభ! 120

ఉ. దండము నీకుఁ గైకొను ముదంచితపూర్వసుపర్వ(పర్వ)తా
ఖండల! భర్మగర్భ! శశిఖండ(ధరాదిను)తప్రతాప! వే
దండకులేశరక్షక! గదాధర! శార్ఙ్గ సహస్రకోటిభృ
చ్చండతరైకదోర్జయ! విశంకటయోగప్రయోగ! మాధవా! 121

వ. అని ప్రస్తుతించవలె వెండియు 122

క. మునినాథ! మాఘమాసం
బున మాధవు నొక్క కుసుమముననైనను నే
ర్పునఁ బూజయొనర్చిన న
య్యనఘుఁడు కులకోటితోడ హరిపురినుండున్. 123

క. విలువకు నైనను స్త్రీ శూ
ద్రులచేఁ గొనియైన సుమతతులు హరిపజ్జన్
జలజము నర్చింపందగు
నిల పుష్పవిహీనపూజ లెసఁగవు హరికిన్. 124

గీ. గరిమఁ దులసీదళంబుఁ దద్గంధ మొక్క
యావగింజంత యైనను భావమలర
మాధవార్పణమనెడి యమ్మహితయశుఁడు
బహుళజన్మార్జితాఘముల్ భంగపఱుచు. 125

మ. ఘనకృష్ణాగరు దివ్యచందనము శ్రీఖండంబునుంగూడ వి
ష్ణున కర్పించ సహస్రకల్పములు మాన్యుండై స్వకీయాన్వయుల్
తను సేవింపగఁ గాంచు మోక్షపదమొందన్ బద్మముల్ బూన్పగా
వనజాతాశ్రయ నిల్చుఁ దద్గృహమునన్ వాత్సల్యకారుణ్యయై. 126

గీ. అగ్ని దారువుల నడంచు నట్లు బ్రహ్మ
హత్యకోటియు నుపపాతకాఘ మణఁగు
నర్థిఁ దులసీదళంబులు హరికి భక్తిఁ
బితరులను గూర్చి (మనుజుఁ) డర్పించెనేని. 127

ఆ.వె. మకరమాసముననుు మాధవుఁ దుల
సీదళములఁ బూజ సేయు సుదతి
విష్ణుగృహముఁ జెందు(విష్ణు)ఁ బూజింపని
వాఁడు ఘోరనరకవాసుఁ డగును. 128

క. ధర తులసీపర్ణాష్టో
త్తరశతమున విష్ణుపూజ తగఁ జేసిన య
న్నరు పుణ్యము కడ యెక్కడ
సరవిగ నపరిమితమగుచుఁజను నచ్చెరువై. 129

ఆ.వె. జలజశతమునైన జాతిపుష్పంబుల
నైన సితపయోరుహాక్షుపూజ
సరవిఁ జేయు నతఁడు జన్మకోటులు దరి
ద్రుండు గాడు ధనవిభుండ యగును. 130

ఆ.వె. సురభిరహితపుష్పసరపూజఁ జేసిన
యాతఁ డూరపందియై జనించు
నంబుజముల విష్ణు నర్చించి యైదువ
సరవి గాంచు నింతి జన్మశతము. 131

క. నలువుగ మాఘంబున గు
గ్గులధూపము చక్రధరునకు నొసంగినవాఁ
డలఘుఁ డగుచుఁ (దనువు విడిచి)
సలలితుఁడై కాంచు విష్ణుసాయుజ్యంబున్. 132

చ. దొరయు దశాంగ గుగ్గులపు ధూపము కృష్ణునకిచ్చినట్టి స
త్పురుషులు ముక్తి కేఁగుదురు పుట్టరు వారి కులంబునందు దు
స్తరఘనదోషవర్తనులు దబ్బఱులున్ బహువృద్ధిఁజెందు నా
దరమున దీపమీయని కృతఘ్నులు దాల్తురు కీటభావముల్. 133

క. హరిపూజవేళ ఘంటా
వరనాదము సేయునట్టి వా రపవర్గ
స్థిరులగుదురు (గా ఘంటా)
వరనాదవిహీనపూజ వలదనవద్యా! 134

సీ. శ్రీపతి సన్నిధి దీపంబిడినయతం
డజ్ఞానతిమిర దినాధినాథుఁ
డై పరమేశ్వరు రూపంబుకను నట్టి
(డగు) ధన్యునిఁ బితరు లర్థితోడ
జనియించి వంశవర్ధనుఁడు కావలెనని
కోరుదు రదిగని కొంతమాత్ర
మైన దీపము దేవతార్పణముగను జే
యనివాఁడు జాత్యంధుఁడై వఱలును

గీ. దీపమిడని మర్త్యుండెయ్యది లెససేయ
. . . . . . . మెసంగుట . . . . . బహుళ
భక్ష్యరాజాన్నములు సమర్పణము చక్ర
ధరునకును జేయు నతఁడుండు హరిపురమున. 135

వ. మఱియు నిర్మాల్య విసర్జనంబు సేయని నరుం డున్మాదియైజనించు నీరాజనార్పణంబు సేయు నతనికి బ్రహ్మహత్యాద్యుపపాతకంబులు దశసహస్రంబులైనను నణంగు లక్ష్మీశ్వరునిం గనినవారలు సకల కళ్యాణాన్వితులగుదు రని వెండియు 136

సీ. వనధికన్యాధినాథునకుఁ గర్పూరనీ
రాజనంబొసఁగు వారలు విరించి
లోకంబున(ను వీతశోకులయి) బహుసు
స్థిర భోగసుఖములఁ జెంది కోటి
వరుసలు(భువిఁ) జక్రవర్తులై యుదయించి
యంత విప్రకులంబునందుఁ బుట్టి
మహిత దివ్యజ్ఞానమతులై వసింతురు
విష్ణులోకముననను విభవమెసఁగఁ
గీ. బూజసేసిన పిదప నంభోరుహాక్షు
నకును సాష్టాంగముగ వందనంబొనర్చు
నమ్మహాపుణ్యునకు సహస్రాశ్వమేధ
ఫలము సిద్ధించు సన్మౌని కులవరేణ్యా! 137

క. పదిపదుల వినుత మఘములు
విదిత సుధర్మంబు లొక్క వేయును హరి శ్రీ
పదవందనంబు లోపల
పదియాఱవ పాలు రావు పరమమునీంద్రా! 138

సీ. అశ్వమేధ (ఫలాప్తి యడు) గడుగున గల్గు
శ్రీధరునకుఁ బ్రదక్షిణము సేయ
నొగి జరా జన్మమృత్యుభయమెల్లను ద
త్ఫలమున నిర్జించుఁ బద్మనయన
కలితదామా.......... జిరంబయి యైనఁ
(బరగ) శోధనచేఁ బ్రపాలితంబు
.................. సేసెనయేని
వైకుఠపుర భోగ వసతిగాంతు
గీ. రెవ్వరైనను బ్రోక్షించి యిందిరేశు
సదన మఱచేతఁ బూసి ................
......................సక్తులై ధాత్రిఁ బ్రబలి
మోక్షపురికిఁ జనుదు రంతమున మునీంద్ర. 139

క. భువిమాఘమాసమున మా
ధవు గేహము గోమయమునఁ దగ నల్కెడు మా
నవుఁ డొందు గోసహస్రము
సలలితముగ దానమిచ్చు సత్ఫలితంబున్. 140

మ. గురుసద్భక్తినిఁ బంచవన్నియల ముగ్గుల్ గూర్చి మాఘంబునన్
హరిగేహంబున రంగవల్లులిడు నయ్యబ్జాక్షి ముత్తైదువై
వరసూనుల్ సిరిగల్గి జన్మశతముల్ వర్ధిల్లి యంతన్ నిజే
శ్వరమాతాపితృయుక్తయై చెలఁగు నిర్వాణస్థ సౌఖ్యోన్నతిన్. 141

సీ. నరుఁడెవ్వఁ డీపుణ్య చరితంబు విని పున
ర్జనన మొందదు జపస్నానసంధ్య
లవి మానియైన నీ హరికథల్ వినిన దు
ష్కర్మంబులెల్లను గాలిపోవు

శరఖడ్గముల రిపు క్షయము చేసిన పోల్కి
హరిభక్తి రిపుల నార్వుర వధించు
భాగవతుండగు భగవత్కథాసక్తిఁ
గర్మలోపప్రాప్తి గలుగు మనుజుఁ
గీ. డిట్లు భగవంతుఁడెఱిగింప నెలమి మునులు
మాఘమాసావగాహన మాధవార్చ
నమును కర్మం బణంచు మోక్షము ఫలించు
ననుచుఁ దద్వ్రతచర్యచే నధికులైరి. 142

గీ. ఆదిమధ్యావసానంబులందు నొకటఁ
దనకు గల భక్తియుక్తి మాధవు నొనర్చి
దాన మిచ్చి యథాశక్తిఁ దగఁగ విప్ర
భోజనమొనర్పగా వ్రతపూర్తి యగును. 143

మ. గరిమన్ మానవుఁ డాత్మశుద్ధిఁ దగ మాఘస్నానపూజాదులీ
కరణిన్‌జేసి పురాణవక్త నొనరంగాఁ బూజసేయందగున్
వరపౌరాణికపూజసేయక వినన్ వాంఛించువాఁడెల్ల దు
ష్కరబాధల్ కడునొంది ఘోరఫణియై కానన్వసించున్దుదిన్

క. హరిపుణ్యకథలు నొడువఁగ
నరుఁడెవ్వఁడు వినకపోవు నవ్వాఁడు మహా
గిరి దుర్గమవనములలోఁ
జరియించుం బ్రహ్మరాక్షసత్వాకృతియై. 145

వ. మఱియు శాంతాత్ముం డగు ధర్మవేత్తను మృష్టాన్నభోజనంబుల సంతుష్టుం జేయవలయు నివ్విధంబున మాఘస్నానవ్రతంబొనర్చు వారివారి వ్రతంబెఱుంగ శివ విష్ణు బ్రహ్మ మన్వాదులకు నలవిగా దితరుల కెఱుంగ నగునె మాఘస్నానార్థియై యిల్లువెడలి నడచు వానికిఁ బ్రతిపదంబున కశ్వమేధఫలంబు సిద్ధించు. పూర్వము సుధర్మ రాజకన్యకకు స్నానమాత్రంబున నతిప్రబంధవృత్తియయ్యె నని యానతిచ్చినపద్మభవునకు నారదుండిట్లనియె. 146

రుచిష్మతి చరిత్రము

గీ. మును సుధర్ముని సుతబంధములు దొలంగె
నసుచు మీరానతిచ్చితి రాశుభాంగి
కెట్టు కర్మచ్యుతంబయ్యె నట్టి కర్మ
మిట్టిదని యానతిమ్ము లోకేశ! యిపుడు. 147

క. అన విని విరించి హర్షం
బునఁ జిత్తము దొరల మౌనిపుంగవుతోడన్
ఘనుఁడగు గయు దౌహిత్రుని
వినుతచరిత్రంబు నీకు వివరింతుఁ దగన్. 148

సీ. సౌధాగ్రభాగభాస్వత్కేతనవ్రజో
ద్ధన్మరుద్ధూతమార్తాండరథము
ఫణిఫణాధిపలోకపర్యంతగంభీర
కాండశశ్వత్పరిఘాయితంబు
రథ్యాసమాశ్రయరథవీరభటఘోట
సమరరథివ్రాత సంకులంబు
సర్వంసహామరక్షత్రార్యసైరిక
బహుళవర్ణైక విభ్రాజితంబు
గీ. సరళసహకారపనసకేసరకదంబ
నారికేళపటీరమందారకలిత
సురుచిరోద్యానమధ్యప్రసూనసురభి
వినుత కమలాకరంబు కుండినపురంబు. 149

వ. మఱియు మరకతమరుద్వరశిలాసంఘటితవిశాలసాలశిఖరచుంబి
తాంబరంబును మాణిక్యఖచితసోపానస్థలప్రాలంబగోమేధికప్రవాళ
దామాభిరామంబును తౌర్యత్రికోత్సవవివిధదేవాగారజాగ్రదగ్రభాగా
భోగాగారగీయమాన మానితరుచిస్థితశాతకుంభకుంభప్రవాసితంబును

ప్రాకారతీరరహిత క్షామధామస్తోమప్రకటంబును ప్రబల ముక్తాఫలరంగ ద్రంగవల్లీప్రాంగణంబును భర్మనిర్మిత హర్మ్యస్థల కేతనానికేతనంబును కనత్కనక కవాటకూటపాటవ స్ఫురితంబును వైడూర్యకుడ్యసంస్థాపిత వినోదసాలభంజికా పుంజరంజితంబును వేశ్యాభవనద్వారోభయపార్శ్వ సన్నిహిత విచిత్రచిత్రపటానందకర ప్రసవశరబల కలితంబును నిరంతరమల్లికాతోరణాలంకృతతోరణ విరాజితంబును బహువితర్ది విటంకపక్షకజాలకా రోహణవాతాయన జనాశ్రయప్రపా కంసకంబును నైన యప్పట్టణంబునందు. 150

చ. ఘనతరపుణ్యుఁ డార్యనుతగౌరవభావనిరూఢవర్తనుం
డనుపమసద్గుణాభరణుఁ డాశ్రితరక్షణశాలి విద్విష
జ్జనవర భూరిబాహుబలసామజసింహకిశోరుఁ డిందిరా
తనయనిభుండు శూరుఁడు సుధర్ముఁడనం జెలువొందుఁబెంపునన్.

క. అతనికి నుదయించె రుచి
ష్మతి యనఁగాఁబరగు నొక్క మానిని వినుత
వ్రతశీల రూపరేఖా
చతురత దమయంతియనం బ్రశస్తి వహించెన్. 152

క. ఆరమణికిఁ దగిన వరుం
డారయ మాహిష్మతీపుఁ డగు వైదర్భుం
డనెడి నృపకుమారుండా
తనికిత్తు (ను తనయ) నని సుధర్ముఁడు దలఁచెన్. 153

వ. ఇట్లుదలంచి తజ్జనకుండైన వీరవర్మకుం జెప్పిపుత్తెంచిన నతండును సంభ్రమించి వైవాహికోచిత ద్రవ్యంబులు సంగ్రహించుకొని యొక్క శుభముహూర్తంబున వైదర్భు నలంకృతుం జేసి మహావైభవం బెసంగఁ గుండిననగరంబునకు వచ్చిన సుధర్ముండును నెదుర్కొని మహనీయ

లగ్నంబున రుచిష్మతీ వైదర్భులకు వివాహంబొనర్చె నంత వీరవర్మయు
సుధర్ముచేతం బూజితుండై కుమారు నుంచి మాహిష్మతీపురంబున
కరిగె నంత నవ్వధూవరులు మనోహరమనోభవవినోదంబున సుఖి
యించుచున్న నాఁటవనాఁడు నిశాసమయంబున 154

క. గురుతర శయ్యాతలమున
సరసీరుహనేత్రతోడ శయనించి మహీ
వరనందనుండు విస్మయ
కరముగఁ బంచత్వమొంది కదలక యున్నన్. 155

క. ఇది యేమొక్కొ నిజేశుఁడు
మృదుశయ్య సుఖించి నిద్ర మేల్కొనడని య
మ్మదిరాక్షి తెరువుఁ గానక
చెదరిన మదిలోన భయము సిగ్గు జనింపన్. 156

గీ. వరసఖుల కెఱింగించిన వార లధిక
వేగమున వచ్చి చూచి యా విధము మనుజ
విభునకును విన్నవించిన విని యతండు
విస్మయము తోడఁ జనుదెంచి వెలఁదిఁ గాంచి. 157

క. మానవపతి తను నడిగిన
నానెలఁతుక తండ్రితోడ నత్యాశ్చర్యం
బే నెఱుఁగ నెట్టి చిత్రమొ
పానుపుపై వచ్చి పండి పలుకకయుండెన్. 158

గీ. అనుచుఁ గన్నీరు కొలికుల నడరి గండ
యుగళమున జారి లికుచ పయోధరములఁ
బొదలు పయ్యెదఁ దడుప గద్గదిక యగుచు
నువిద మఱి పల్కనేరక యూరకున్న. 159

వ. సుధర్ముండును మూర్ఛిల్లి కొంతతడవునకుందేరి సకలబంధువులును రాజపత్నులును పౌరజనసహితంబుగా చింతాకులమానసులయిరి తదవసరంబున 160

మ. జనసంపూజ్యుఁడు వారిజోదరకథాచాతుర్యవిజ్ఞాత సూ
రినుతుం డార్యతపఃప్రభావఘనచారిత్రుండు యజ్ఞంబు పెం
పొనరం జేయుటకై ధనంబడుగ నుద్యోగించి యంగీరసుం
డను విప్రుం డరుదెంచి నిల్చెను తదీయద్వారదేశంబునన్. 161

క. నిలిచిన యెడ ధాత్రీవర
తిలకుం డెదురేఁగి తోడుతెచ్చి మణిమయో
జ్జ్వలపీఠంబున నునిచిన
నలరుచు నవ్విభునితోడ నమ్ముని పల్కెన్. 162

క. నీయల్లుని బ్రతికించు ను
పాయం బేఁ జేసెదను నృపాల(క)! ఖేదం
బీయెడ వల దనవుడు భూ
నాయకుఁ డా సంయమీంద్రునకు నిట్లనియెన్. 163

చ. మునికులచంద్ర! నీపలు కమోఘము ధారుణి నీనృపాలనం
దనుఁడు సజీవుఁడయ్యెడు విధం బెటులన్న నరేంద్రుఁ జూచి యో
జనవర! మాఘమాసదివసంబులలోన దినత్రయంబు గా
హన మొనరించినాఁడవు మహాఫలసిద్ధిగ నందులోపలన్. 164

క. ఒకదినఫల మల్లుని కొం
డొకదినఫల మిమ్మగువకు నొసఁగు మనిన ను
త్సుకత దినద్వయఫల ముడు
గక నరపతి మంత్రపూర్వకముగా నిచ్చెన్. 165

గీ. తత్క్షణంబున బ్రతికె వైదర్భుఁడంత
నధికసమ్మోదచిత్తుఁడై యాసుధర్ముఁ
డమ్మహామునిఁ జూచి యో యనఘపుణ్య!
యాతఁడీరీతి నుండుట కేమి కతము. 166

మాహిష్మతి పూర్వజన్మ వృత్తాంతము

వ. మఱి యేకర్మంబున జీవితుండయ్యె నిన్నళినలోచనకు నేకర్మంబున నిత్తెఱంగు ప్రాపించెఁ గ్రమ్మఱ నే కర్మంబున నిజేశ్వరుంగలసె సవిస్తరంబుగా పరమకరుణామతి నెఱింగింపు మనిన నమ్ముని య మ్మనుజపతి కిట్లనియె. 167

సీ. ధరణీశ! వినుము యీతన్వంగికిని పూర్వ
జననంబు గౌళదేశంబునందు
నమర మేఘుండని యను నొక్క వైశ్యుని
తనయ సురూపనాఁ దనరుచుండు
దాని నాతండు సమానసత్కులజాతుఁ
డగు ధనదత్తున కర్థి నొసఁగె
నంత శీఘ్రంబున యౌవనోదయమయ్యె
నారాజముఖికి నయ్యవసరమునఁ
గీ. దన్మనోహరుఁడగు ధనదత్తుఁ డన్య
భూములకుఁ దగ బేహారమునకుఁ జనిన
మదనరాగవశంబున సుదతి యొక్క
చర్మకారునిపైఁ దన కూర్మి నెఱయ. 168

శా. తేలించున్ గనుదోయి నచ్చెలియ నీతీరంచు సౌందర్యపు
న్మేలెంచున్ జనుకట్టు చేల తగ నెమ్మింజారఁ గామించు ము
న్నేలా కంతుని కింతులోర్తు రనుకొం చీరీతి నుఱ్ఱూగు న
వ్వాలుంగంటి తలం పెఱింగికొనియెన్ వాఁ డంగజోన్మాదియై. 169

ఉ. అద్దిర! దీని చన్నుగవ యందము డెందముఁ జెంగలించె ని
మ్ముద్దుమొగంబు గన్గొనిన ముక్కెర చక్కెరమోవికాంతికిన్
నిద్దపు వన్నెదెచ్చె కటి నీవొక పాటివె యెన్నఁ గొంకినన్
బుద్ధికి మోసమింక నసుబోటికి బోటికి జాగులేటికిన్. 170

ఆ.వె. అనుచుఁ జర్మకారుఁ డావైశ్యభామిని
యంట రాఁగఁ గుచము లంటఁ దివిరి
నీకిదె కొదవయన నెలఁతుక నెత్తుక
సరగ నరిగె నాత్మసద్మమునకు. 171

వ. ఇట్లరిగి మణిసదనంబున శశివదనమదనకదనంబునకు నదనని యయ్యదన నత్తన్వినునిచి పనిచిన నదిచిత్తంబున రంజిల్ల నప్పల్లవాధరి నిష్టోపభోగంబు లనురాగంబుతో ననుభవించి విడిచె నివ్విధంబున ననుదినంబును వర్తించుచున్నఁ గొన్నిదినంబులకు ధనదత్తుండు సను దెంచిన నతని నెరుసుగాఁ జూపుచు నొకవిధంబున నయ్యిరువురు నొండొరులమొఱంగి సంగమించుచు వర్తించుచున్న నొకనాఁడు నిజ నాథుని శిక్షించుతలం పూహించి యతండు శయ్యాతలంబున నిద్రించు సమయంబున నా సురూపిణి చర్మకారుకడకుం జని వానితో నిట్లనియె.

శా. రోసంబించుకలేక యిట్లొరులు రారో లేరొ జారాంగనన్
జేసన్నన్ బ్రహరించెఁ బిల్వఁగ విటశ్రేణుల్ గడున్ గూర్చి నీ
యాసం జొక్కితి నింతెకాక యతఁడేలా పోలఁదానిచ్చెనో
గ్రాసం బేతరినైనఁ దెచ్చెనొ వృథాకార్యంబు వాఁడేటికిన్. 173

శా. ప్రాణేశుండిదె నిద్రపోయెడిని రాన్‌జాటేమి వేరమ్ము ని
స్త్రాణత్వంబిక నేటికన్న నసిచేఁ దద్వైశ్యపుత్రున్ గత
ప్రాణుంజేసి తదీయవస్తువులు నెయ్యంబొప్పఁగాఁ గొంచు న
య్యేణీలోచనఁ జంకనెత్తుకొని పోయె న్వాఁడు శీఘ్రంబుగన్. 174

వ. ఇవ్విధంబున నరిగి బహుదేశంబుల బహుగ్రామంబులఁ ద్రిమ్మరుచుఁ గొన్ని వత్సరంబు లయ్యిరువురుం బ్రవర్తించిరి. పదంపడి యా వైశ్య భామిని పంచత్వంబు నొంది నరకయాతన లనేకంబు లనుభవించి కర్మశేషంబున చతుర్దశ జన్మంబులు వారకాంతయై జన్మించి తజ్జన నంబుల సుకర్మంబుల నొనరించుచుం బ్రవర్తించఁ బదునాల్గవ తనువునందు 175

ఆ.వె. ఇందుబింబవదన యెదుట విప్రునిఁ గన్న
దండమనుచుఁ బ్రియము దలరఁబలుకుఁ
జెలఁగి తుష్టి భిక్షములు వెట్టు పరదేశు
లరుగుదెంచిరేని యనుదినమ్ము. 176

క. ఈరీతినున్న నొకనాఁ
డారయగ సుమేధుఁడను ధరామరుఁ డెలమిన్
శ్రీరంగయాత్ర వోవుచుఁ
జేరెన్ హైహయనృపాలశేఖరు పురికిన్. 177

వ. ఇవ్విధంబున నూర్మిళాపురంబున సాయాహ్నావేళం బ్రవేశించి తద్వా రాంగనా గృహప్రాంగణంబున పంచయరుంగుపై నాశీనుండై గీతా పఠనం బొనరింపుచునుండె నంత యన్నిశీథినీప్రథమయామంబున

మ. కరకాచ్ఛాదితమై ఘనాఘన బృహద్గర్జారవస్ఫోరమై
వరవిద్యుల్లతికాతతిప్రబలమై వాస్తోష్పతి స్థానబం
ధురమై సర్వదిశావిభాగములు నస్తోకాంబుపూర్ణంబుగాఁ
గురిసెన్ వర్షము నీడజవ్రజము సంక్షోభింప భీమంబుగన్. 179

క. అప్పుడు బెడిదపువానన్
గప్పిన వస్త్రంబు దడిసి క్రమమించుకయున్
దప్పక నుడువుచు భూసురుఁ
డప్పంచ యరుఁగు కొనను వడంకుచు నుండెన్. 180

క. ఆ నినదము విని యంబురు
హానన తన దాసిఁ బిలిచి యతఁడవనీసురుఁ
డేని యట యునికిఁ గాముకుఁ
డైనం దోద్దెమ్ము పొమ్ము అని పనుచుటయున్. 181

క. ఆ దాసి వచ్చి వాకిట
భూదేవుని తెఱఁగు సర్వమును విని యా శా
తోదరి కడకుంజని యొక
వేదవిదుఁడు రంగనాథు వీక్షించుటకున్. 182

క. తరుణీ! మార్గవశంబున
నరుదెంచిన విప్రుఁడనిన నది దైవవశా
దరణీయభావయై గృహ
మిరవుగఁ బూయించి ముగ్గులిడి ప్రియమెసఁగన్. 183

వ. సకల వస్తువులు పెట్టించి తానొక దాసీరూపంబు దాల్చి యావిప్రుని
కడకుం జని యిట్లనియె. 184

గీ. అనఘ! యిది విప్రగృహ మీగృహస్థు దార
సహితుఁడై తీర్థయాత్రకుఁ జనిన వాఁడు
పథికులరు మీర లిందుండి భక్ష్యయోగ్య
మైన ఫలములు గొనుఁడు ప్రియంబు మెఱయ. 185

గీ. అనిన చలిచేత నోర్వక యతఁడు తద్గృ
హమున కేతేరఁ బట్టువస్త్రములు గట్ట
నిచ్చి మోచా ఫలాదులు నిక్షుదండ
ములు నొసంగిన గైకొని ముదితుఁ డగుచు. 186

గీ. వలయునవి యుపయోగించి వలనుమీఱ
వేదపఠనంబొనర్చుచు వేగునంత

తడవు నందు వసించి యా తరళనయన
నాదరంబున దీవించి యరిగె నతఁడు. 187

క. ఆ కర్మవిపాకంబున
నీకామిని తనుజయయ్యె (నితనికి) గుణర
త్నాకర! తొంటికృతంబునఁ
జేకూరెను బాల కీ విశేషములెల్లన్. 188

వ. మఱియు నవ్వైశ్యసతికి మాఱుమగండైన చర్మకారుండు కాలగతింజెంది ఘోరనరకంబు లనుభవించి చండాలజన్మంబు లనేకంబులు జనియించి క్రమంబునఁ గిరాతుండై మృగహింససేయుచు విపినంబునం జరియింపుచుండి యొక్కనాఁడు జలరహితంబైన భూప్రదేశంబు గల యడవి నలసి కూర్చున్న విప్రునిం జూచి దయాకలితండై యిట్లనియె.

చ. ధరణిసురేంద్ర! యీ వటము దాపున క్రూరమృగంబు లుండు సు
స్థిరముగ నిందు నేమరక తేకువనుండుము నావుడున్ గృపా
కర! కడు దప్పియయ్యె నొడికంబుగ నీరముఁ జూపవే యనన్
వెరవున లుబ్ధకుండతని వీపున మోసుకపోయి ముందఱన్. 190

ఉ. కమ్మని తెమ్మెరల్ మెరయగా నళినోత్పల నవ్యవాసనల్
నెమ్మి మనఃప్రియంబొదవ నిర్మలతుంగతరంగముల్ బ్రమో
దమ్మునఁ జక్రపుష్కరవితానములున్ గలహంసలున్ విహా
రమ్మొనరింప నుజ్జ్వలతరంబగు నొక్క కొలంకు చెంగటన్ 191

గీ. దించి సేవింపు మనిన ధాత్రీసురుండు
వలయు జలములు గ్రోలిన వాఁడు బిసము
లొసఁగ నవి భుజియించి పెంపెసఁగ న న్ని
షాదు దీవించి తనదు దేశమున కరిగె. 192

క. ఆ సుకృతంబున లుబ్ధకుఁ
డీసురుచిర తనువు దాల్చెనిట తొంటి పర
స్త్రీసంగమదోషదుర
భ్యాసంబున నాయు వల్ప మయ్యె నితనికిన్. 193

వ. కావున పరస్త్రీసమాగమంబు సేసిన యిన్నరవరనందనునకు నిట్టి దురితంబు వాటిల్లె నిజవల్లభుండు పంచత్వంబునొందున ట్లొనరించిన యిక్కోమలికి నిట్టి విశేషంబు సంభవించె నియ్యిరువురకు మాఘ దివసద్వయస్నానఫలంబున పునర్జీవంబును గ్రమ్మఱం బతి సాంగత్యం బును నొదవె లక్ష్మీశ్వరు కరుణ నపమృత్యు వినాశకరంబైన మాఘ స్నానఫలం బేమని వర్ణింతుఁ దదవగాహనంబొనర్చినవారలు నాశంబు నొంద రిట్లెఱింగి యిబ్బాలికామణి మాఘస్నానంబు సేయించవలయు నట్లైన దన్మహిమంబునంజేసి దశసహస్రవర్షంబులు సమస్తభోగంబులు ననుభవించి పుత్రపౌత్రాభివృద్ధిం జెంది నిజనాథునితో నంతంబున మోదంబుఁబొందునని యంగీరసుండు చెప్పిన సుధర్ముండును నవ్వధూ వరులును నతనిం బెక్కువిధంబుల బ్రార్థించి యజ్ఞంబునకుందగు ధనం బొసంగిన నిజాశ్రమంబునకుం జనియె నంత సుధర్ముని యనుమతం బున వైదర్భుండు సతీసమేతంబు మాఘస్నానం బొనరించి దశసహస్ర వర్షంబులు మహాభోగపరుండై రాజ్యంబు సేసి విష్ణులోకంబున కరిగెనని

**ఆశ్వాసాంతము**

శా. లక్ష్మీనాయకపాదసక్తసుమనోలంకార! తత్త్వక్రియా
సూక్ష్మాలోకనబుద్ధిసార! విమతాక్షుద్రప్రభాదూర! రౌ
ప్యక్ష్మాభృత్సహధీర! బంధురసుధావారాశిగంభీర! భా
ల్లక్ష్మాకార! యశోవిహార! శుభశీలా! వీర! పుణ్యాకరా! 195

క. హాటక శాటక! ఘోటక
పాటవఘనశౌర్యధుర్య! పరపాతనిరా
ఘాటవచోత్కట విస్ఫుట
వీటీకోటీ ప్రహర్ష విబుధప్రకరా! 196

పంచచామరము :
శరామరాశ్వపర్వతేశ శర్వసీరితారకా
హిరాజరాజతాగహార (హీరకుంద) భాగ్య శో
వరా! దురాగ్రహోగ్రసారవక్త్రచండభండనో
ద్ధురాధిరాట్తమః ప్రశస్తదోఃప్రతాప భాస్కరా! 197

గద్య. ఇది శ్రీమద్వరాహగిరి లక్ష్మీనృసింహ వరప్రసాదలబ్ధసారస్వతవిచిత్రాపస్తంభ సూత్ర కాశ్యపగోత్రపవిత్ర వడ్లపూఁడి వెంకటమంత్రిపుత్ర సకలసుజన విధేయ పెద్దయ నామధేయ ప్రణీతంబైన వాయుపురాణంబునందు మాఘ మాహాత్మ్యం బను మహాప్రబంధంబున నైమిశారణ్య వర్ణనంబును నారదుండు సత్యలోకంబున కరిగి విరించితోడ మాఘమహిమా ప్రశంస చేయుటయు స్నానకర్మ విధానంబును శ్రీఖండ జలంబులు పితరులకుభోగ్యంబైన విధంబును మాధవపూజా విశేషం బును సుధర్ముని చరిత్రంబును రుచిష్మతి వైదర్భుల పూర్వజన్మ ప్రకారంబును నను కథలు గల యది ప్రథమాశ్వాసము.

శ్రీః

# మాఘమాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీసార్వహరిశ్చంద్రమ
హీసుత్రామప్రహృష్టహృదయాదరణో
ద్భాసితవిభవ! ముకుందస
దాసేవాహృత్తరంగ! దాసరిగంగా! 1

వ. అవధరింపుము వివిధ పురాణేతిహాస కథా ప్రసంగవిఖ్యాతుండైన సూతుండు హరికథాశ్రవణసమ్మోదులగు శౌనకాదుల కిట్లనియె నట్లు కమలసంభవుండు రుచిష్మతి చరిత్రంబు చెప్పిన విని ప్రహృష్ట హృదయుండై నారదుండు వెండియు శారదావల్లభున కిట్లనియె 2

చ. వనరుహగర్భ! దేవగణవర్ణిత! మీ వచనామృతంబు వా
రని యనురక్తిఁ గర్ణసుషిరంబున నంబలి ద్రావియున్ మనం
బునకును దృప్తి చాలదు సమున్నతి మాఘమహత్వ మాదరం
బున నెఱిగింపు మన్న మునిముఖ్యునిఁ గన్గొని ధాత యిట్లనెన్. 3

క. నారీ పసి బాలఘ్నులు
స్వైరిణ్యులు కూటబుద్ధిసంగులు విషదుల్
దూరీకృత శుభకర్ము లు
దారత సుస్నాతులైన ననఘులు వత్సా. 4

<u>మాఘమాస కర్తవ్యములు</u>

క. జననుత! మాఘస్నానం
బున నంతఃశుద్ధి యొదవుఁ బురుషు నుదీర్ణున్
ఘనదురితమ్ములుఁ బొరయవు
అనయము పద్మమున జలము లంటని కరణిన్. 5

క. మౌనీంద్ర! మాఘదినముల
లో నరుఁ డుదకార్ద్రకరతలుం డయిన సహ
స్రైనోవ్రజంబు చనునఁట
స్నానంబునఁ గలుగు టరుదె సకల ఫలంబుల్. 6

మ. తెఱఁగొప్పంగఁ ద్రికాల దోషములు ధాత్రిన్ సద్మకాండంబులన్
మఱి నిత్యంబు వసించు గావున తగన్ మాఘంబునం దింటిలో
నెఱి నుష్ణోదకసిక్తదేహుఁడగువానిన్ దండభృత్కింకరుల్
తఱి వైశ్వానరకీలలందు నిడుచున్ దండింతు రుగ్రాకృతిన్. 7

శా. మాఘస్నానము మాధవార్చనము ప్రేమన్జేయఁగా లేని దో
షాఘస్వాంతునకున్ గృతాంతుఁ డదయుండైయుండు వానిం బిశా
చాఘోరగ్రహచోరసర్పభయరోగాదుల్విదారింప దు
శ్శ్లాఘోదగ్రతనుండు నంతమున మోక్షశ్రీ కసంప్రాప్తుఁడౌ. 8

మ. అతసీపుష్పములన్ రమాధవుని నిత్యాసక్తిఁ బూజించినన్
శతదివ్యాబ్దము లంబుజోదరునిఁ బూజల్సేయు పుణ్యంబు సం
భృతలీలన్ ధరఁ గల్గుఁ దద్దళములర్థిం గూరగావించి వి
శ్రుతబుద్ధిన్ భుజియించు వాని హరి గాఁచున్ దోషనిర్ముక్తుఁగాన్.

సీ. శంఖోదకమునఁ గేశవు నభిషేకం బొ
నర్చి విష్ణుపురమునను సహస్ర
కోటికల్పంబు లుంకువనుండు శంఖమ
ధ్యస్థితతోయమౌదల ధరింప

బ్రహ్మహత్యాదులు పాయు నీవిధమున
శంఖంబు పూజించు జనుని గృహము
తగఁ బ్రయాగ సమానమగు నాగృహస్థుఁ డ
శేషసత్కృతి ఫలసిద్ధి దనరు

గీ. రమణశంఖంబు మొదల వేదములు మధ్య
భాగమున సర్వదేవతల్ బహుళతీర్థ
చయము లగ్రంబునందు నిచ్చలు వసించుఁ
గావున విశేషకంబు శంఖంబు పుత్ర! 10

మ. లలితోద్గారతపోనిధాన! విను సాలగ్రామనీరంబులన్
దల ప్రక్షాళనమాచరించుకొనుమాత్రన్ జహ్నుకన్యాది ని
శ్చలతీర్థంబులు జన్మకోటు లతివిశ్వాసంబుతో నాడు స
త్ఫలముల్ సేకురుఁ గోటిజన్మకృతపాపంబుల్ విలీనంబగున్. 11

చ. సలలితమైన మాఘమున జహ్నుసుతా యమునా సరస్వతీ
విలసదనేకవాహినులు విశ్రుతదివ్యమనఃసరోవరం
బులు విబుధాంబుధుల్ బహుళ పుష్కరిణీ ఘనతీర్థకోటు లిం
పలరఁగ గండకీభవశిలాంబుల నూఱవపాలురావుగా! 12

వ. మఱియుఁ గాశీ గయా ద్వారకా కాంచి కేదారంబులును సాలగ్రామ తీర్థంబునకు షోడశాంశంబునుబోలవనిన దన్మహిమయేమనివర్ణింతు భోజనాంతరంబున సాలగ్రామతీర్థంబు గ్రోలెనేని యప్పురుషునకుఁ జాంద్రాయణ శతఫలంబు సిద్ధించు సాలగ్రామార్పితతులసీదళంబు సేవించినవారలు కోటిదివసంబులు పంచగవ్యప్రాశనం బొనర్చినవార లగుదురని వెండియు నిట్లనియె 13

ఆ.వె. మాఘమాసమునను మనుజుండు బ్రహ్మప
త్రంబులో భుజించఁ దలఁగు దురిత
మశ్వమేధ(మఖ) మహాసిద్ధియగుఁ దుది
వనజనేత్రు లోకమున వసించు. 14

గీ. కాంస్యపాత్రమున భుజించు ఖలుఁడు నక్క
యై జనించును తైల మభ్యంగనంబు
తెగువఁ జేసిన ధాత్రిఁ (బోత్రియగుచు) జని
యించుఁ గావున నూనె సేవించ వలదు. 15

క. విను భర్మపత్రమున భో
జన మొనరించిన యతండు చనఁడు యమపురం
బున కధివసించు మత్పురి
నెనయఁగ నీ మాఘమహిమ నేమని యెంతున్. 16

వ. మఱియు నిమ్మాఘదినంబులయందు ప్రాతఃస్నానంబును మాధవార్చ నంబును గీతాపఠనంబును వైష్ణవ పూజయు భర్మపత్రభోజనంబును శాస్త్రాభ్యాసంబును శ్రీమూర్తిధ్యానంబును దుర్లభసంపత్కరంబులు మాయ నుత్తరించుఁగావున సర్వవర్ణాశ్రమధర్మంబుల వారికిఁ గామినీ జనంబులకు హీనకులజాతులకుసహితం బీకర్మంబు నడుపవలయునని వెండియు నిట్లనియె. 17

క. కలిపిండి కూరయును బ
చ్చలియున్ సొరకాయ లశునచయము ములుక కా
యలు ముల్లఁగి నీరుల్లియుఁ
దిలలును వర్జ్యములు మాఘదినములలోనన్. 18

క. శతపత్ర కుసుమములచే
హితమతియై విష్ణుపూజ యెవ్వఁడొనర్చున్
ధృతి నతఁడు సుమతిమానో
న్నతుఁడై స్వర్లోకసుఖమునం జెలువొందున్. 19

క. ధాత్రీఫలముల పేరునఁ
జిత్రంబుగ విష్ణుపూజ సేసిన శుభచా
రిత్రునకును విద్యాఢ్యులఁ
బుత్రుల దయసేయు హరి విభూతి దలిర్పన్. 20

సీ. ధాత్రీఫలములు ముందఱఁ బోసి హరికి దీ
పంబిడ ఘనపాతకంబు లణఁగు
నుసిరికపిండి పెంపెసఁగ మేనునఁబూసి
స్నానంబు సేయ దోషములు వాయు
నమృతశలాటువు లవనీసురునకు దా
నమొసఁగఁ బుత్రలాభము దనర్చు
నామలకీ వినుతామ్రఫలంబులు
చూర యిచ్చిన నిహసుఖము లొదవు
గీ. భక్తితో మాఘశుద్ధసప్తమి (దినమున)
నెనయఁ గూష్మాండదాన మియ్యని (వి) మూఢ
(నరుని) సంతతి విచ్ఛేదనమగుఁ (దుదకు)
తగగఁ గూష్మాండ తనువును దాల్చు నతఁడు. 21

శ్లో. కూష్మాండం బహుబీజాఢ్యం బ్రహ్మణా నిర్మితం పురా
తస్మా దర్ఘ్యప్రదానేన సంతతిర్వర్ధతే మమ. 22

వ. అని కూష్మాండదాన సమయంబున మంత్రంబు చెప్పుకొనవలయు మఱియుఁ దన్మహిమ యెట్టిదనినఁ బూర్వంబున మేరుశిఖరంబునఁ బితృదేవతలు తపంబొనర్చుచున్న సమయంబున నేను వారలం గనుంగొని మదీయనిమిత్తంబు మీరలు తపం బొనరించుచున్న వారలు నేనిందు వసించుచున్నవాఁడ ననుదినంబును శుశ్రూష సేయుండనిన వారలయ్యా! హరింగూర్చితపంబొనర్చుచున్నవారము తత్కారణంబున శుశ్రూషసేయశక్యంబు కాదనినం గోపించి వారలం గనుంగొని మీకు సంతతిగలవారికిం గైవల్యంబునకు స్వతంత్రంబు లేదు సంతతిరహితు లైన నంధతమస్సునం బడుదురని శపించిన భయంపడి వారలిట్లనిరి.

క. వారిజభవ! మాసంతతి
వారఘము లొనర్చిరేని వంశము భిత్తై

ధారుణి లీనంబగు నిం
కేరీతి న్ముక్తిగాంతు మెఱిఁగింపఁ గదే. 24

గీ. అనిన వేఱొక్క విధి వినుం డవనిపై జ
న౯వ్రజము రథసప్తమినాఁడు విప్రు
నకును గుమ్మడికాయ దానమును జేసి
రేని సంతతి చెడదు మేలౌను మీకు. 25

క. అని నిర్ణయంబు సేసితి
ననుమతితోఁ బితరులట్ల యగునని రదిగా
వున రథసప్తమినాఁ డే
పునఁ గూష్మాండమున ముత్యములు బగడములున్. 26

క. వినయమున నావునేతిన
తనరంగా నంటఁగూర్చి దక్షిణతోడన్
విను (భూతలమునఁ) దనయులఁ
గనువాఁ డొసఁగఁ దగు విప్రగణ్యున కనఘా! 27

గీ. మాతులుంగ ఫలంబులు మకరసంక్ర
మాణమున భానుదినమున మహితపుణ్యు
లెవ్వరేనియు విప్రునకిత్తు రట్టి
వారి నిజనందనులు భాగ్యవంతు లిలను. 28

వ. మఱియు మాఘమాసంబున స్నాన దాన వ్రతంబు లెవ్వియైనను జేయ కతిక్రమణఁ జేయు నతండు చండాలకులంబున సంభవించి స్వర్గస్థ పితరులతో బ్రహ్మకల్పంబు రౌరవంబున నుండు. 29

ఆ.వె. మాఘమాసమునను మాధవునకుఁ బుష్ప
మంటపంబొనర్చు మహితధన్యుఁ
డిరుతెఱఁగులను బది తరముల వారితోఁ
దెల్లదీవి యందుఁ దేజరిల్లు. 30

గీ. అనఁటి మామిడి చిగురులఁ దనరఁ దోర
ణముల హరిమంటపమునఁ బూర్ణముగఁ గట్టు
నతఁడు నూఱుతరములవా రరుగుదేరఁ
జని తపోలోకమున నుండు సన్మునీంద్ర! 31

క. చతురతఁ గదళీదళముల
సితవారిజనేత్రుఁ బూజసేయు ఘనుఁడు దాఁ
బితృగణములతోనుండును
సతతంబును సత్యలోక(సద)మున వత్సా! 32

క. ధృతిఁ దావినూనె లక్ష్మీ
పతి కభ్యంగనము సేయు ఫలము నుతింపన్
శతకల్పంబుల కైనను
చతురత శక్యంబుగాదు సన్మునినాథా! 33

క. చలిచేత వణఁకు విప్రున
కెలమి దలిర్పంగ వస్త్రమిచ్చిన పుణ్యుం
డిల యేలు కోటితనువుల
నలరంగాఁ జక్రవర్తి యగును కుమారా! 34

క. ఘనశాస్త్రవేత్తయగు వి
ప్రునకును దద్భార్యకును సుభోజనము ముదం
బుననిడు నతండు గను నిహ
మున నైశ్వర్యంబు నంతమున మోక్షంబున్. 35

క. పూని హరికథలు సెప్పెడి
వానికి నిష్టాన్నమిడ్డ వరపుణ్యుఁడు స
న్మానితుఁడై పితరులతోఁ
దానుండును తెల్లదీవిఁ దాపసవర్యా! 36

ఆ.వె. మాఘమకరమున హిమంబుచే వణఁకుచుఁ
గుందు భూసురునకుఁ గూర్పడంబు
దానమిచ్చు నతఁడు తరలక కల్పకో
టులు విశిష్ట లోకముల వసించు. 37

వ. ధన వస్త్ర ధాన్య గో భూ గజాదులచేత మాఘమాసంబు మాధవస్వరూ
పంబని ధరణీసురోత్తముం బూజించిన యతండు సమస్త లోకంబుల
సమస్త భోగంబు లనుభవించి యితరులకు నందశక్యముగాని విష్ణు
లోకంబున వర్తించు ధర్మశాస్త్రవ్యాఖ్యాతయైన భూసురవరేణ్యు ననంతుం
డను బుద్ధిని గురుభావనచేసి మోదంబునఁ బూజించవలయుఁ బూజిం
పని దుష్టాత్ములం గృతాంతుండు విశ్రవణులం జేయించి యంధత
మిస్రంబులంద్రోయించు. పురాణవక్త నెవ్వఁడునిందించినఁ దద్దూషణ
మాకర్ణించిన వారలు కుంభీపాక నరకంబులనుందురనిన విని
నారదుండు విరించి కిట్లనియె 38

క. విన వేడుకయ్యెడును నా
మనసున కతిహర్షమయ్యె మాఘమహిమ పెం
పున నానతీయవే యనఁ
దనయునితో బ్రహ్మ పల్కెఁ దాత్పర్యమునన్. 39

క. హరి యిందిర కెఱిగించెను
శరనిధి తీరమున నా విశాలనయన సా
దరమున నా కెఱిఁగించెను
వరమతి! యెఱిఁగింతుఁ బరమవాత్సల్యమునన్. 40

ఉ. భూవినుతాత్మ శిష్యుఁడవు పుత్రుఁడవున్ దగ బుద్ధిశాలివిన్
గావునఁ జెప్పెదన్ సుగుణగౌరవ! ప్రొద్దుట నీటఁగ్రుంకి ల
క్ష్మీవరుఁబూజ చేసి వ్రతసిద్ధికి విప్రుల కోదనంబు సం
భావన పెట్టు ధీనిధులు పావను లౌదురు మాఘవేళలన్. 41

గీ. మాఘమాహాత్మ్య మిమ్మహి మనుజులకును
వితతముగ నెఱిఁగించిన వినిన యతఁడు
హీనజాతికులోత్పత్తిభూతుఁడైనఁ
బాపములఁబాయు గుహ్యకుపగిదిఁ బుత్ర. 42

గుహ్యకుని చరిత్ర

వ. అనిన విని శారదావల్లభునుల్లంబు పల్లవింప మహాత్మా! గుహ్యకుం డన నెవ్వం డతండు హీనయోని నేమి కారణంబున నుద్భవించె వానికి స్నానం బెవ్విధంబున సంభవించె విశదంబుగా నానతీయవలయు ననినఁ గలహాశనునకు నళినగర్భుం డిట్లనియె. 43

మ. వెలయున్ జేతననామ గుహ్యకుఁడు రీవిన్ యక్షనాథాలకా
స్థలశశ్వత్ఫణిహారియై యతఁడు చిత్రప్రౌఢలీలన్ హిమా
చలశృంగంబున కొక్కనాఁడు చని తత్సానుప్రదేశంబులన్
గలయంద్రిమ్మఱు నప్సరోనికరయుక్తక్రీడలం బానియై. 44

గీ. ఇట్లు మదిరాసుమహితపానేచ్ఛఁ జేసి
జలజనేత్రలతోఁ గూడి జలవిహార
మమరగాఁ బూని (యొనరింప) నమరతటిని
పొంతకేతెంచి వేడ్కఁ దద్భూమియందు. 45

సీ. మందారమందార మాకందవిశదంబు
చాంపేయచాంపేయ సంగమంబు
కేసరకేసరకేసరానూనంబు
పాటలపాటలీబంధురంబు
కుందకుందురుకీ ముకుంద ప్రశస్తంబు
మాగధమాగధీమధుయుతంబు
పిప్పలపిప్పలీబృందవిస్తారంబు
వంజులవంజులోద్భాసితంబు

గీ. నటనటీజటి (కల్పుల) కుటజ కటభి
వటకటు కటిల్లకా పటోత్కటపటీర
దింట కురువకమరువక తిలకకులక
నికరమగు నొక్కవనము గుహ్యకుఁడు గాంచె. 46

క. చిలుకల కొలుకులతోఁ గో
కిలకులరావమ్ము వినుచు కెలకులఁ గొలఁకుల్
గల నళినోత్పలముల యల
రుల వాసనలలరఁగా మరుత్తొలయంగన్. 47

ఉ. పొంగిన వేడ్కఁ జేతనుఁ డపూర్వముగా విహరించుచుండి యా
చెంగటఁ గాంచె దివ్యసరసీరుహశోభితమత్తభృంగ ను
త్తుంగతరంగఁ దోయపరితోషవికీర్ణ బలాకచక్రచ
క్రాంగ నభంగగంగ నికటాగత సంయమిసంగ నెంతయున్. 48

లయగ్రాహి :

కాంచి యవగాహనము కొంచక యొనర్పఁగఁ ద
లంచి నిజపార్శ్వముల నంచగమనల్ రా
ణించ నదిఁజొచ్చి నగుకొంచు జలముద్ధతిఁ గ
లంచుచు సరోజములఁ ద్రుంచుచు రథాంగ
క్రౌంచతతిఁ బాఱ నదలించుచు వధూమణులు
సంచలితులై యొదిగి వంచనల డాయన్
మించుఁగని యోలలిడు కొంచుతనువుల్ పులక
రించ జలకేళి నొనరించె నతివేడ్కన్. 49

వ. ఇట్లు సత్కేళీవిహారంబు లొనర్చి యొక్క పులినప్రదేశంబున నళినలోచను లును దానును గ్రీడించుచు నగ్నవేషంబున చేతనుండు సంతోషచేత స్కుండై యున్న సమయంబున రోమశుండను మునివరుండు

గంగావగాహార్థంబు చనుదెంచిన యప్పుడు మదిరాపాన మత్తుండై మత్తకాశినులంగూడి లేవకయున్న గుహ్యకుం జూచి రోమశుం డతి క్రోధమానసుండై 50

క. ఓరి దురాచార! కడుం
గ్రూరుఁడవై యప్సరసలఁ గూడుక గర్వ
స్ఫారతఁ దిరిగెదు ఫణివై
ఘోరారణ్యంబు వసతిఁ గొనుమని పలికెన్. 51

క. శాపంబీగతి నిచ్చినఁ
దాపసుతో వాఁడు పల్కె దైన్యము మెఱయన్
గోపంబేటికి మునికుల
దీపక! కరుణించి మలఁగు తెఱఁగుఁ దెలుపవే. 52

గీ. నేరములు గల్గినపుడు మన్నింపవలయు
ననుచుఁ బెక్కువిధంబుల నభినుతింప
వామదేవమునీంద్రుల వలన మాఘ
కథలు విన్నను శాపమోక్షంబు నీకు. 53

వ. అని యనుగ్రహించి రోమశుండు బదరికాశ్రమంబునకుం జనియెఁ దచ్ఛాపవశంబునం జేసి చేతనగుహ్యకుండు చిత్రకూటపర్వతంబున యోజనాంగనామంబు గల సర్పంబై పశు పక్షి మృగ భక్షణం బొనర్చుచు సహస్రవర్షంబులుండు సమయంబున 54

మత్తకోకిల :

వీతదోషుఁడు మౌనివర్యుఁడు విష్ణుభక్తిపరాయణ
స్ఫీతచిత్తుఁడు వామదేవుఁడు చిత్రకూటనగేంద్రవి
ఖ్యాత సుస్థలి కేఁగుదెంచి మహర్షి సంఘసమేతుఁడై
సేతుబంధన వామదేవ విశేషదర్శన కాంక్షతో. 55

గీ. అట్లు సాయాహ్నమున ఋషులరిగి యొక్క
మట్టి క్రిందను వసియించి మాఘమహిమ
వరుస నెన్నంగఁ దత్ప్రాంతవర్తి యగుచు
వెలయు గుహ్యకుఁడను పాము వినుచునుండె. 56

క. బలబల వేగిన పక్షుల
కలకలములు చెలఁగె ఋషులు గమనోన్ముఖ ని
శ్చలహృదయులైన నత్తరిఁ
బొలుపుగ నవ్వటము దివ్యపురుషుండయ్యెన్. 57

వ. ఇట్లు మట్టి రూపంబు విడిచి పురుషుండైన వాని నవ్వామదేవుండు వీక్షించి యాశ్చర్యంబున నీవెవ్వండ వేమి కారణంబున నీరూపు దాల్చి తనిన నతండు సాష్టాంగవందనం బాచరించి యానందకందళిత హృదయారవిందుండై యిట్లనియె. 58

సుతపుని వృత్తాంతము

క. అనఘాత్మక! సుతపుండన
ఘనభూసురసుతుఁడ సుగుణఖని మార్కండే
యుని శిష్యుఁడ నొకనాఁ డ
మ్మునిపనుప సమిత్ఫలార్థము వనంబునకున్. 59

క. మెలపునఁ బోయినఁ దత్కొల
కుల మార్కండేయుపుత్రి గుణవతి చెలిక
త్తెలుఁ దాను బంతులాడుచు
నలువుగ విహరించుచుండి నను వీక్షించెన్. 60

క. అన్నువ కౌనును బిగుపుం
జన్నులుఁ జొక్కపు పిఱుందుఁ జక్కని వాలుం
గన్నులు ముద్దుమొగంబును
చెన్నలరఁగ వచ్చి నిలిచె చెలి నాయెదుటన్. 61

వ. నిలిచి తనవెంటనంటివచ్చు మచ్చెకంటుల పరివారంబును దూరంబున నిలువ నియోగించి పరమానురాగంబున మనోజవికారంబు తోరం బుగాఁ గన్నులు గట్టికొని యప్పల్లవాధరి యుల్లంబున సంతసిల్లుచు నాతో నిట్లనియె. 62

చ. మదనసమానరూప! గరిమంబుగ నిన్పరిరంభణంబు నే
హృదయమెలర్పఁ జేయుటకు నెప్పుడుఁ గోరుచునుందు నేఁడు నా
కిది యొనగూడె నీడు తలఁపేల రసాలము పొంతఁ బువ్వటి
ల్లదె చనుదెమ్ము త్రిమ్మరు నయమ్మున నచ్చుటఁ గమ్మదెమ్మెరల్

క. గాంధర్వవివాహం బను
సంధింపఁగ నిదియ వేళ చనుదెమ్మను కా
మాంధీభూతహృదయయగు
గంధేభసమానయానఁ గని యిట్లంటిన్. 64

క. గురుపుత్రివి గావున నీ
వరయఁగఁ జెల్లెలవు దీన నతులితదోషం
బరవిందవదన! మదనుని
శరముల కిట్లులికిపలుకఁ జనునే నీకున్. 65

వ. అని పలుకు నా పలుకులు చెవులకు ములుకులైనం దలంకి యా చిలుకలకొలికి కలికిచూపుబిత్తరింపుచుఁ దత్తరంబునం గోర్కులిగురొత్త గుత్తంపు చనుగుత్తులు నెత్తమ్మి మొగ్గల లాగున సోగలై దాకొనఁ జే కొలఁది బిగియం గౌగిలించినఁ బొంచి యంపవిలుకాఁడు దమకించి పంచశరంబుల నదలించిన సంచలించి వంచనం గదియం దలంచితి నయ్యండజగమనయు నధరంబు చుంబించితోడ్కొంచుం జని యా సహకారతీరమంజరీస్ఫార సారపులినప్రదేశంబులం గేళి కుద్యోగించిన నేనునుం బరమానురాగంబున నెలనాఁగతో నిష్టోపభోగంబు లనుభ వించితి. తద్దోషవశంబున 66

క. వటరూపంబై వనమున
నిటువలె జన్మించి యే ననేకాబ్దంబుల్
పటుగతినుండి పునఃప్ర
స్ఫుటరూపము గంటి నేమి చోద్యమొ యెఱుంగన్. 67

క. గురుతల్పగ దుర్దోషం
బరయఁగఁ గులకోటిశతములందును జెడ దే
వెరవున ఖిలమయ్యెనొ సు
స్థిరగతి నెఱిఁగింపు దీని తెఱఁగు మునీంద్రా! 68

వ. అనిన వామదేవుండు జ్ఞానదృష్టిం జూచి యాశ్చర్యంబు నొంది యద్దివ్య పురుషున కిట్లనియె. 69

క. వినుము శతార్చి యనాఁ దగు
ముని నేఁ దర్కోదయమున మొగి నీ కుధరం
బున సుస్నానం బొనరిచి
మునుకొని నక్షత్రమార్గమునఁ బోవు తఱిన్. 70

గీ. అతని తడికోక జాఱిన యంబుకణము
చెలఁగి యీ మఱ్ఱి కొనయాకు చెంతనున్న
మంచు చినుకునఁ గలసి యిమ్మహిని బడియె
దాన నయి నీకు నీ పూర్వతనువు గలిగె. 71

వ. హీన యోనిజాతులకైనను బిశాచతనువులకైనను దేవ ప్రాతర్జల స్పర్శ చేతఁ బవిత్రభావంబగుం గావున నేమును ఋషిగణంబులు నేతెంచిన కారణంబునఁ బూర్వజన్మంబు సంభవించె. 72

క. పదివేల బ్రహ్మహత్యలు
కుదురుగ గురుతల్పగములు కోటియు సుగుణా
స్పద! మాఘస్నానము హరి
పదసంస్మరణమును జేయఁ బాయు మునీంద్రా! 73

వ. మఱియు ననేక కర్మబంధంబులు సూర్యోదయావసర స్నానకణ యుక్తతుహినబిందువిశీర్ణపర్ణ సమగ్రన్యగ్రోధంబులైన నిన్ను సమస్త కిల్బిషంబులు బాసె సర్వదానఫలంబులును సమస్త తీర్థస్నాన ఫలం బులును సిద్ధించె నింక సుఖివికమ్మనిన సుతపుండు వెండియు నమస్క రించి నిజాశ్రమంబునకుం జనియె తత్క్షణంబున 74

క. తిరమగు మాఘచరిత్రలు
హరికథలును రాత్రి యమ్మహామౌనులచేఁ
గరమిష్టముతో విని య
య్యురగము గంధర్వరూప మున్నతిఁ దాల్చెన్. 75

గీ. అటులు చేతను గుహ్యకుఁ డాత్మతనువు
దాల్చి యమ్మౌనులకు మ్రొక్కి తన చరిత్ర
వార లడిగిన నెఱిగించి వర విమాన
మమరగా నెక్కి యలకాపురమున కరిగె. 76

వ. వామదేవుండును తటస్థులగు శిష్యులకు మాఘస్నాన ప్రశంస సేయుచు దక్షిణదిశకుం జనియె నది గావున మాఘమాహాత్మ్యం బనంతంబై యుండు లేశమాత్రంబు వివరించితి విస్తారంబుగాఁ జేయ శతవర్షంబు లకు శక్యంబుగాదు 77

చ. హిమవిమలాంబుశీకరము లెన్నిక సేయను దివ్యవాహినీ
సముచితజీవనాంతరిత సైకతరేణుతతు ల్గణింప ఋ
క్షములగముల్ వినిర్ణయవశంబున లెక్కిడవచ్చుఁగాని మా
ఘమహిమ లెన్నగా వశముగాదు కుమార! నిజంబె పల్కితిన్. 78

మ. క్రతుభుక్సంఘములో రమాధవుఁడు వేడ్కన్ ముఖ్యుఁడై యొప్పసం
గతి ధర్మంబులలోన నెక్కుడగు మాఘస్నాన ధర్మంబు త
త్ప్రతిభం గాదె పురందరాదివరదిక్పాలుర్ దిలీపాది భూ
పతులున్ నిశ్చలసిద్ధి బొందిరి జగత్ప్రఖ్యాతయోగాత్ములై. 79

క. విను మాఘస్నానఫలం
బనఘం బతిసుకర మతులహరిపురసుఖదం
బని దేవమునులు గనరఁట
మనుజులెఱుఁగ నెంతవారు మతినూహింపన్. 80

సీ. మాఘమాసమును సన్మతిని బ్రార్థింపగ
వలదు తానయి వచ్చు వత్సరమున
జలము లొక్కని వశంబులు గావు తటినీ చ
యంబులు వలసిన యన్ని గలవు
మాధవార్చనకును మఱి ప్రయత్నము వల
దన్నంబు తులసిఱేకైనఁ జాలు
వరలు మంత్రము కొనవలదుగా నారాయ
ణాభిధానము జిహ్వ ననఁగవచ్చుఁ
గీ. బాటు కొంచెంబు భావింప ఫలము ఘనము
కావునను విష్ణులోకభోగప్రసిద్ధ
కారణములైన యిట్టిసత్కర్మచయము
లయ్యయో యేలచేయ రీ యవనిజనులు. 81

వ. మఱియుఁ బ్రాతఃస్నానానంతరంబున గీతాపఠనంబును సహస్ర నామ జపంబునుఁ జేసినఁ గైవల్యసిద్ధియగు భూతలంబున నెట్టి దోషంబు చేసిన వారికి వేదశాస్త్రపురాణాదులం బ్రాయశ్చిత్తంబగుం గాని మాధవ భక్తి విరహితులకుం బ్రాయశ్చిత్తంబు గాదనిన జనకునకు నమ్మునివరుం డిట్లనియె. 82

గీ. చెలఁగి మాఘంబునం బ్రసిద్ధ తిథులు
వ్రతములును గలవె సమున్నతమనీష!
విస్తరంబుగ వివరింపవే మహాత్మ!
యనిన నారదుఁ జూచి పద్మాసనుండు. 83

గీ. సకలదిగ్దేశనదులలో జాహ్నవియును
సర్వదేవప్రతతిలోనఁ జంద్రధరుఁడు
నెఱయఁగా నిద్ధరణిఁ ద్రివేణీసమాగ
మంబు మిక్కిలి పూజ్య మీమహిఁ గుమార! 84

క. కలహాభుజ! సకలజీవా
త్మలఁ గలిగియు శార్ఙ్గపాణి తలఁగక మిగులున్
చలదళతులసీబ్రాహ్మణ
జలరుహ గోప్రతతులం దజస్రము నుండున్. 85

మాఘమాసములో ప్రసిద్ధ తిథులు, వ్రతములు

గీ. మాఘదినములలోన సమస్తసువ్ర
తములకును నుత్తమంబగు ద్వాదశీమ
హాదివస మవగాహనాద్యఖిలపుణ్య
కర్మములు కోటిగుణము లొక్కటికి నందు. 86

వ. మఱియుఁ బదినూఱు గ్రహణ పుణ్యసమయంబులును వ్యతీపాత యోగంబులు పదివేలును సూర్యేందుసమాగమంబులు లక్షయు మాఘ శుద్ధద్వాదశికళా షోడశాంశంబునుం బోలవు విను మహిత దినంబుల శంఖోదకంబుల హరి నభిషిక్తుంజేసిన విష్ణుపురనివాస సుఖంబు సిద్ధించు వెండియు 87

క. విను మాఘశుద్ధవరశో
భన సద్వాదశుల హరినిఁ బంచామృతమ
జ్జన మొనరించిన వారికి
జననుతముగఁ గలుగు విష్ణుసాయుజ్యంబున్. 88

సీ. ఆజ్యంబుచేత శ్రీహరిని ద్వాదశిఁ బ్రేమ
నభిషిక్తుఁ జేసిన యతఁడు ధరణి
శతవర్షములు మని ధృతి నంతమున విష్ణు
పురిఁ జేరు నందు సద్భోజనంబు

భాగవతునకును భక్తితోఁ బెట్టిన
యేని సహస్రమహీసురులకు
నిడిన పుణ్యము చెందుఁ గడఁకతో (నధి) దేవ
తను కేశవుని గూర్చి వినయమెసఁగ

గీ. రమ్యముగ ముఖ్యతరసమారాధనంబు
సేసెనేనియు దేవవిశేషపూజ్య
తను చెలఁగుఁ గృష్ణపక్షపుద్వాదశుల ధ
రామరుల కన్నమిడ్డ ననంత ఫలము. 89

చ. పనివడి మాఘమాసమున భానుదినంబున వేదసంవిదుం
డనఁ దగు భూసురాగ్రణికి నన్నము పెట్టిన ధన్యుఁడుండు పెం
పున బితృకోటితో విదితభోగపరుండయి శార్జ్గ భృత్పురం
బున భవదివ్యయోగిగణపూజితుఁడై సురమౌనిశేఖరా! 90

క. మోదమున మాఘశుద్ధ
ద్వాదశినాఁ డెట్టిదైన దానము మఱి ధా
త్రీదేవున కిచ్చిన నది
యాదరముగఁ గోటిగుణితమగు మునినాథా! 91

క. మునినుత! మాఘద్వాదశి
నెనయఁగ సంక్రాంతి యైన నినుదివసంబై
నను గూడిన పుష్కలయం
దనయము నందొదవుఁ గోటి యజ్ఞఫలంబుల్. 92

మ. పొసగన్ ద్వాదశిపాత భానుదివసంబుల్ గూడినన్ శృంగళా
ఖ్య సుయోగంబయియొప్పు నందు నరుఁడాకాంక్షన్ గృతస్నానుఁడై
న సమస్తాధికతీర్థసత్ఫలము లెన్నంగాంచు మాఘంబునం
దెసఁగన్ ద్వాదశివంటి పుణ్యదివసంబీక్షింప లే దెయ్యెడన్ 93

గీ. శ్రవణమునఁ గూడి ద్వాదశి శనిదినంబు
వైష్ణవీతిథి యనఁదగు వరుసఁ గలియు
గమున నతిదుర్లభంబు మాఘంబునందుఁ
గొలఁదినే ధర్మ మొనరింపఁ గోటిగుణము. 94

సీ. జలజగ్రహము సర్పశస్త్రాస్త్రములచేత
హరివృషభవ్యాఘ్రకరులచేతఁ
బుష్కల చండాల భూభుజాజ్ఞలచేత
శాత్రవ శిఖి చోరజనముచేత
బంధనోగ్రాశని సైంధవంబులచేత
నాత్మవధోద్భవ హానిచేత
నైన దుర్మరణంబు లంటిన వారికి
గతిలేని దుర్జనవితతికెల్ల
గీ. చెలఁగి మాఘసిత ద్వాదశీదినమున
భోజనము విప్రతతికి సంపూర్తిగాఁగ
నిడినయంతనె మోక్షంబు కడఁకఁ గాంతు
రనుచు నార్యులు పల్కుదు రాగమముల. 95

మ. క్రమమీక్షింపఁ బరోక్షసత్క్రియలు జోకన్లేక మున్నేఁగిన
ట్టి మనుష్యావళికిన్ బ్రియంబలర రూఢిన్మీఱఁగా వారి వం
శమునం దెవ్వరు నైన మాఘసితపక్షద్వాదశీభోజనం
బమరం బెట్టిన నుందు రింద్రపురి నత్యానందసౌఖ్యోన్నతిన్. 96

వ. మఱియు నసంస్కృత ప్రమీతులు కులయోషాత్యజితులు మొదలయిన కష్టజనులు ద్వాదశిభోజనంబున ముక్తికింజనుదురు మాఘ బహుళదర్శ నాదిత్యదినంబునం బితృగణంబు నుద్దేశించి స్నానదానాది క్రియలొనర్చినయట్టి ధన్యులు కలియుగంబునఁ గృతకృత్యులగుదురు మఱియును 97

క. అమ సోమ భౌమ రవి గురు
సముచితదినయుక్తమైన నగు పద్మకయో
గము శతగుణ మిందుగ్రహ
ణములకు నది కోటియగు గుణము మాఘమునన్. 98

క. గురువారము మఘ గూడిన
వర పౌర్ణమి తాంద్రకాఖ్య వర్తిలు నది భా
సురము (జగతిఁ) గడు దుర్లభ
మరయ సుమిత్రప్రదాఢ్యమగు జనములకున్. 99

ఆ.వె. మాఘశుద్ధపూర్ణిమా గురుదినమున
సరవి శింశుమారచక్రరూప
ముగను ప్రతిమ భర్మమునఁ జేసి దానమి
చ్చినను మృతులుగారు తనయులండ్రు. 100

వ. తద్దానమంత్రం 101

శ్లో. నమః సర్వగ్రహాధార లోకానుగ్రహకారణ
తవ దానాన్న మే భూయా న్నమఃసంతాన నిష్కృతే 102

వ. ఇమ్మంత్రంబున బ్రాహ్మణికిం బ్రతిమాదానంబు సేసిన యతండు హైహయ దేశాధీశ్వరుండు కార్తవీర్యునిం గనినట్లు చక్రవర్తియైన సుపుత్రునిం బడయు. తత్పౌర్ణమిం బితృనక్షత్రంబు కూడెనేని వత్సయుక్తం బైన ధేనువు నుత్తమద్విజునకు దానంబిచ్చిన యతండు తద్గోరోమంబు లెన్ని యన్నివేలేండ్లు విష్ణులోకంబున నుండు. 103

గీ. నేలయైనను పరిపాటిఁ జేలమైన
నెందునుం బూర్వవయసు మహీసురునకు
నిచ్చునతఁడు గయాశ్రాద్ధ మెలమిఁ గోటి
మారులొనరించు ఫలము నిమ్మహిని గాంచు. 104

క. భువిమాఘస్నానము వృష
భవిమోచన మాత్మజనకు పనుపును లక్ష్మీ
ధవు పూజనము పురాణ
శ్రవణ మివి సుమతులొనర్చు సద్విధు లనఘా! 105

క. ఇలఁ బుత్రహీనులగువా
రలు నల్లని కోడె బసవరాయునిగా ని
శ్చలమతి విడిచినఁ బుత్రులు
(గలుగుదు) రేవు రసమాన ఘను లధికబలుల్. 106

సీ. ఆఁబోతు విడిచిన యంతటికంటె క
ర్మగ్రంథిభేదనక్రమములేదు
నియతిఁ జేసిన ఋణత్రయమును బాయు నం
తటి కంటె నతి సుకృతంబు లేదు
మొగి వృషభోత్సర్గమును గయాశ్రాద్ధంబు
సమమనియందురు జనము లెల్లఁ
గావున నిదియ మాఘంబునం జేసిన
కోటిగుణంబని చాటెఁ జక్రి
గీ. మాఘశుద్ధత్రయోదశి మనుజుఁ డెవ్వి
డైనఫలములు రాశిగా ననుమతించి
చూఱగా నిచ్చునతని విశుద్ధకులము
కల్పపర్యంతమును హాని గాక యుండు. 107

వ. మఱియు నీశుద్ధత్రయోదశియందు 108

క. కార్పాసము లక్కాకును
శూర్పముఖోజ్జ్వలపుఁ జిప్ప సురుచిరమతిచే
నేర్పున నైదువకుం గృ
ష్ణార్పణముగ నిచ్చునట్టి యబ్జాననకున్. 109

ఉ. భర్తయుఁ బుత్రులుం గలిగి భాగ్యనిరూఢి శతాబ్దముల్ లస
ద్వర్తనచే ధరిత్రిని నుదారతఁ గృష్ణచతుర్దశిన్ యశః
స్ఫూర్తిగ నేత వండినయపూపము లెంతయు దానమిచ్చు త
త్కర్త యిహంబునన్ సుఖము గాంచుఁ దుదింగను మోక్షకామినిన్.

సీ. జలజలోచన రథసప్తమీదినమున
నుత్కృష్టఫల మాత్మ నూహచేసి
నాలవజామున నది స్నాన మొనరించి
ధవళాంబరము గట్టి నవకముగను
తులసిచెంగటనైనఁ (దూర్పువాకిటనైన
నెలమితో) సూర్యమండలమువ్రాసి
యందు పశ్చిమమున నతివిపులాష్ట స
త్పద్మము లిఖియించి పంచవన్ని
గీ. యలుగ ముగ్గుల నొడఁగూర్చి యబ్జనయను
ఘనతఁ దన్మండలస్థితుగాఁ దలంచి
పద్మముల నరుణోజ్జ్వలప్రసవములను
విమలతరమతిఁ బూజగావించి మఱియు. 111

వ. గంధాక్షతంబులును వస్త్రంబులును ధూపదీపంబులు నిచ్చి పాయసోప హారంబు సమర్పించి తమాలపత్రంబు నొసంగి యారాత్రి నిద్రించిన భానుమండల నిపాతుండైన నారాయణుండు స్వప్నంబున వచ్చి హిత వును నేర్పరించి యిష్టంబులైన కోర్కులొసంగు వెండియును రథసప్తమిని స్నానంబుసేసి కూష్మాండదానంబు నిచ్చిన కాంతకు సంతానోత్పత్తియగు రథసప్తమి దినంబున బ్రాహ్మణునకుఁ బాయ సాన్నదానంబు సేసిన గ్రహదోషంబులు తొలంగు తిలపాత్రంబు దానంబు సేసిన సమస్త కలుష నాశనుండై గ్రహపీడలం బొరయకుండు హిరణ్యశ్రాద్ధంబు సేసిన యతని పితరులు పరమానందంబునం బొందుదురు. పితరుల నుద్దే శించి యన్నంబువెట్టిన నది మేరుతుల్యంబై యొప్పు మఱి భూదానంబు సేసినవారు కోటికల్పంబులు విష్ణులోకంబున నుందురని వెండియు

గీ. రాజసూయాశ్వమేధపూర్ణపు ఫలంబు
లెంచఁ గొన్నాళ్ళకైన నశించుఁ గాని
యమర రథసప్తమినిఁ జేసినట్టి భూమి
దానఫల మెన్నటికిఁబోదు మౌనిచంద్ర. 113

క. విను రథసప్తమిదినమున
ననువుగ నొకభూసురునకు నన్నం బిడినన్
ఘనముగ నది కోటిగుణం
బని యెంతురు సూరిజనము లనఘవిచారా! 114

గీ. అగిశపూవుల దండచే నంబుజాయ
తాక్షు రథసప్తమినఁ బూజ లాచరించు
నతని దోషములన్నియు నణఁగు నింధ
నములు శిఖిచేతఁ(గాలి) యణంగు పగిది. 115

క. క్రమమున మాఘంబున స
ప్తమియును ద్వాదశియు ధీరతఁ ద్రయోదశి పౌ
ర్ణమియును నతిదుర్లభములు
సమకొను కలుషాత్ములకును సంయమివర్యా! 116

గీ. మాఘసితసప్తముల నినుమారు గుడుచు
నతఁడు వాయసమై పుట్టు నందు స్నాన
దానములు చేయకున్న యమ్మానవుండు
జగతిఁ జండాలుఁడై పుట్టు జన్మశతము. 117

సీ. సప్తమీదినమున గుప్తదానము సేయు
నతనికిఁ దనునిత్తు ననుచు జాగ
రూకుఁడై విష్ణు వాలోకించుఁ బితరులు
తమవంశమునను నందనులనేకు

లుదయించ వలయునందొకcడైనc జని గయా
ప్రజనంబు సేయునో వరుస మాఘ
సితసప్తముల విప్రతతికి నన్నంబిడి
కృతకృత్యుcడగును యం చతిముదమునc

గీ. దలcతు రదిగావునను గురుతరము పుణ్య
ఫలద మంభోధికన్యకా ప్రాణనాథ
హితము రథసప్తమీదినం బిట్లెఱింగి
మనుజు లొనరింపవలయు ధర్మములు పుత్ర! 118

సీ. అతిఫలదంబు ప్రయాగ మాఘస్నాన
మని ప్రశంసయొనర్తు రార్యులాది
నెపుడు తులాస్నాన మెక్కుడు కావేరి
నని మదీయాత్మలో వినుతిసేతు
మేషకర్కటములు మేలు ప్రాతఃస్నాన
మర్థి రేవను తుంగ యనెడు నదిని
కడుప్రశస్తము సింధుగామీనదిస్నాన
మతిరాత్రయజ్ఞఫలాప్తిc జెందుc

గీ. బక్షసవన ఫలంబు చేపడును వేగ
సాగరము బొందు నదిcగ్రుంక సాగరంబు
మాసవవన ఫలంబు షణ్మాసఫలము
నిచ్చు గోదా సరస్వతు లెపుడు మౌని. 119

గీ. అర్థి జాహ్నవి సంవత్సరాఖ్యయజ్ఞ
ఫలమొసంగును కాళింది ప్రతివసంత
యజ్ఞఫలదము పద్మాకరాఖ్య నొందు
లలిత సంక్రాంతసవన ఫలప్రదంబు. 120

క. క్షితి సంక్రాంతఫలప్రద
మతులితమగు దేవఖాత యవగాహము సం
తతము తటాకస్నానము
సుతసాహస్రపు ఫలంబు సుగతియు నిచ్చున్. 121

క. విను ఘనకూపస్నానము
మనుజుఁడు గావింప ఫలసమగ్రత నొందున్
పెనుపగు మాఘస్నానం
బున కోటిగుణాధికంబు భూరిగుణాఢ్యా! 122

క. క్రమమున సప్తనదీసం
గమమున మాఘమునఁ గ్రుంకఁ గాంచిన హయమే
ధము రాజసూయమఖముల్
సమమతిఁ గావించుఫలము జనులకుఁ గలుగున్. 123

గీ. కణఁకతో సప్తగంగావగాహనంబు
మాఘమునఁ జేయనేర్చిన మానవుండు
కాంచు నతులితవిభవ మోక్షస్థలంబు
నంచితానందమతి మునీంద్రాగ్రగణ్య! 124

క. అనిమిషనదియును గౌతమి
యును గావేరియును యమునయు సరస్వతియున్
ఘననర్మదయును పెన్నయు
ననఁగా నివి సప్తగంగ లవనిం బరగున్. 125

చ. గురుమతిఁ గృష్ణసన్నిధి నకుంఠితభక్తిని గోమతీసుపు
ష్కరముల మాఘవేళ నవగాహము సేయఁగఁ గాంచినట్టి య
న్నరుఁడు గనున్ రమాహృదయ(నాథుని)ధామము శాశ్వతంబుగా
దురితమనస్కు లుగ్రకుమతుల్ గననేరరు తద్విశేషముల్. 126

క. మనుజుండు తేపకడ మే
ల్కని గోమతినిం బ్రశస్తి గావించిన పొం
దును ఘనసుస్నానఫలం
బనుదినసేవాఫలంబు లధికం బరయన్. 127

చ. అనువుగ గోమతీతటమునందునఁ గృష్ణుని సన్నిధిన్ గడున్
మనసనురాగ మొందు లవమాత్రము మాఘములో వసింపగాఁ
గనిన నరుండు యోగియగుఁ గాంక్షఁ గవేరసుతావగాహనం
బున బహువిప్రహత్యలనుఁ బొందినపాపమణంగు నెంతయున్.

వ. మఱియు మకరమాఘంబునఁ ద్రిరాత్రంబు కావేరియం దవగాహనం బొనర్చి పాపకోటులచే విముక్తుండగు. పుష్కరస్నానాపేక్షచే సకల కిల్బిషంబులు బాయు స్నాన(మహిమ)ం బేరికి నొడువ శక్యంబు ప్రభాసస్నానం బేకదినం బొనర్ప విశ్వజిద్యజ్ఞఫలావాప్తి యగు మాఘ బహుళేందుక్షయంబున సాగరస్నాన మొనర్ప శతక్రతుఫలంబును సర్వకర్మవిమోచనంబగు. కురుక్షేత్రంబున భానుసప్తమియం దవ గాహనం బొనర్చి మాధవార్చనంబు సేయఁ గుష్ఠరోగ విముక్తుండగు నాదినంబునఁ బుష్కరస్నాన మొనర్చి పితృతర్పణం బొనరించినఁ బితృ ఋణ విముక్తుండగు. కృష్ణాంగారకచతుర్దశిని శ్వేతపర్వతంబున సాలగ్రామదానం బొనర్ప ఋణత్రయదూరుండగు ననంతసరోవరం బున మాఘస్నానం బొనరించి మాధవార్చన గావించి వత్సయుక్త గోదానం బొసంగ గోసహస్రఫలావాప్తియగు నభ్రసరసిస్నానంబున పునర్జన్మనివృత్తియగు. మాఘకృష్ణచతుర్దశిని శ్వేతపర్వతహ్రద స్నానంబు శ్వేతద్వీపనివాసప్రాప్తింజేయు. మూకాంబికా గిరియందుఁ గామ సరో వరంబున నవగాహనంబాచరించి ఫలదుర్గపుజనచరుండై సర్వాభీష్టసిద్ధి యగు దుగ్ధనదీస్నానంబుగావించి క్షీరాబ్ధిశాయి నర్చింప సాయుజ్యంబు ప్రాప్తించు. పైఠినిశీక్షేత్రంబున గోదానసాంకనకృత్యంబునఁ బిప్పలిక

ప్రసాదంబుచే సుజ్ఞానియై జనించు బ్రహ్మేశ్వరకాద్రిక్షేత్రంబున గోదానదీ స్వంబులసుస్నాతుండై బ్రహ్మేశ్వరలింగంబు దర్శించి మోక్షంబునుం జెందు. కృష్ణాసాగరంబున మాఘస్నానంబును శ్వేతమహేశ్వరాలోక నంబును గైవల్యప్రదాయకంబు మాఘస్నానాశక్తుండయ్యేనేని వస్త్ర పరివర్తనంబుసేసి ప్రయాగ స్మరణంబు గావించిన మాఘస్నాన ఫలంబు సిద్ధించు.ప్రయాగయందు సుస్నాతుండై మాధవమూర్తి దర్శించి పితౄద్దేశంబున శ్రాద్ధకర్మంబులం దీర్చిన నరుండు కృతకృత్యుండగు మకర మాసంబున వ్యతీపాతయోగంబున బ్రాహ్మణభోజనంబు పాయస ఘృతయుక్తంబుగాఁ బెట్టిన స్త్రీకి సుపుత్రావాప్తియగు మాఘం బున కుజపంచమియందు మాలతీపుష్పంబుల మాధవార్చనగావింప మృత్యుంజయుండై యుండు నేతద్విషయంబగు నితిహాసంబు కాల మృత్యుహరాది మహాపాతకనాశనంబును బురాతనంబును నైన యదిం జెప్పెద నాకర్ణింపుము. 129

**విచిత్రరథ, సుమంతుల వృత్తాంతములు**

సీ. ధీరుండు సౌవీరదేశాధినాథుండు
వసుమతి యను ధరావల్లభుండు
కలఁడు తత్పుత్రుండు ఘనుఁడు విచిత్రర
థాఖ్యుండు సర్వశస్త్రాస్త్రవిదుఁడు
వృద్ధసేవితుఁడు బలోద్ధతుం డుదయార్క
నిభుఁడు సర్వజ్ఞాన నిపుణుఁ డతని
తండ్రి దిగ్విజయముద్ధతిఁ జేసి విశ్వజి
ద్యాగంబొనర్చి సర్వార్థమెల్ల
గీ. దక్షిణ లొసంగె భూసురతతికి నెలమిఁ
దత్కృతాశీర్వచనప్రౌఢిఁ దనరి భువన
వినుతవిఖ్యాతిమహిమాభివృద్ధితోడ
నలరు పూర్ణమనోరథుం డగుచు భువిని. 130

ఉ. ఆ నరనాథుపాలికి మహాధ్వరదీక్ష దగన్ ధనార్థియై
మానసముల్లసిల్ల జనమాన్యుఁడు కృత్సమదాహ్వయుండు నా
మౌనివరుండు వచ్చిన సమంచితభక్తి నమస్కరించి పూ
జానియమం బొనర్చి యతిచంద్రునకున్ నయమొప్ప నిట్లనెన్.

క. మునివర్య! సేమమే నీ
కనయము మత్కులము పూతమయ్యెను సఫలం
బనఁ జెలఁగెను మజ్జన్మం
బనఘ! జగంబెన్న నేఁ గృతార్థుఁడ నైతిన్. 132

సీ. పరఁగ త్వత్కృపచేత భవదంఘ్రిపద్మము
లక్షిగోచర మిపుడగుట కతన
మత్పితరులు తుష్టమానసులైరి నా
సుకృతంబు ఫలితమై సొంపుఁ జెందె
నుపదేశ మొనరింపుఁ డొనర మీరేతెంచు
కార్యంబటన్న నిక్కముగఁ బల్కె
యాగదీక్షితుఁడనై యర్థంబుఁ గోరి నే
నిట వచ్చినాఁడ నింపెసఁగ నాల్గు
గీ. కోట్ల ధనమిచ్చి నను వీడుకొల్పు మనుడు
సరసదివ్యాన్నపాన భక్ష్యముల నతనిఁ
దుష్టుఁ గావించి సౌఖ్యోపవిష్టుఁడైన
మౌనివర్యున కిట్లను మనుజవిభుఁడు. 133

క. మునివర! పుత్రస్నేహం
బున నిన్నొక వాక్య మడుగఁ బూనితి నాసూ
నుని కాయమేర్పరింపవె
యనవుడు చింతించి యతివరాగ్రణి పల్కెన్. 134

చ. జననుత! చోళభూమిని విశుద్ధుఁ డనా ద్విజవర్యుఁడుండు ద
త్తనయుఁడనన్ సుమంతుఁడు నితాంతము జూదరియై విటుల్విటీ
జనములఁ గూడి వర్తిల నిజంబుగ సూనునిఁ జూచి తండ్రి నె
మ్మనమున రోసి భార్యను కుమారున కొప్పనఁ జేసి మౌనియై. 135

క. సన్యాసమూని ప్రణవో
పన్యాసుండగుచుఁ దామ్రపర్ణీభజనన్
వన్యాహారంబులఁ గడు
ధన్యుండై మోక్షమందెఁ దాత్వికులలరన్. 136

గీ. అట సుమంతుఁడు నిజ సతి హర్షవాక్య
ములను దల్లిఁ దిరస్కారముగ నొనర్ప
నాత్మఁగుంది నిరాహారి యగుచు దుఃఖ
పడుచుఁ దనువుఁ దలంగి వైభవమునొందె. 137

గీ. తల్లిఁ దల్లడ పెట్టినఁ దత్ఫలమున
నతఁడు నలుబది కొఱఁతగా హాయనములు
నూఱు మని జనించెను నీ తనూజుఁ డగుచు
నేఁడు తోడుత నవియును నిండె నధిప! 138

క. యామత్రయమున కయ్యమ
ధామం బీతండు చేరుఁ దథ్యంబనఁగా
భూమీశుఁడు ఘనశోక
వ్యామోహమనస్కుఁడగుచు నడలుచు మఱియున్. 139

చ. మునివరు పాదపద్మములు మూర్ధము సోఁకఁగ మ్రొక్కి పల్కె నా
తనయునకున్నుపద్రవము తాఁకకయుండఁగఁ జేయు మన్న ని
ట్లనియె శివుండు పార్వతికి నానతి యిచ్చిన యట్టి వాక్యముల్
వినుము తదీయకృత్యమున వీఁడు మనున్ బహుదివ్యవర్షముల్.

సీ. మాఘమాసంబున మనుజేశ! కుజపంచ
మిని నదీస్నాన మర్మిలి నొనర్చి
మాధవార్చనఁ జేసి మఱి గుడయుతముగా
నాఢకంబులు తగ నలవరించి
యొనరంగ వృషభసంయుక్తంబు దానంబు
నొసఁగిన మృత్యువు నోర్చు నితఁడు
నరనాథ! నీపుత్రునకు మంగళము కోరి
తేనియు మఱియిడు మిట్టిదాన

గీ. మనిన రాజును మునివర్యు ననుమతమున
నర్థి చర్మణ నది స్నాన మాచరించి
మాధవునిఁ బూజసేయించి మఱి తదుక్త
దాన మొనరించెఁ దనయుచేతను జెలంగి. 141

వ. తదీయస్నానవిశేషంబున మృత్యుక్షయంబు సేసి పరిపూర్ణాయురో పేతుండయ్యె నదిగావున మాఘంబునఁ గుజపంచమి యందు నదీ స్నానంబును ఆఢకయుక్తంబుగా వృషభప్రదానంబును గళ్యాణాపేక్షు లకుఁ గర్తవ్యంబులు మాఘకృష్ణవ్రతం బభీష్టసద్యఃఫలదాయకంబు విజ్ఞానాపదం బొకకాలంబున ఫలించు మాఘావగాహనంబు సార్వ కాలికఫలావాప్తియగు నిష్కామనచే మాఘవ్రతపరాయణుం డితర మాసంబుల కంటె కోటిగుణాధిక్యంబునం జెందు ఫలాపేక్షకుండు ఫలావాప్తుండగును. 142

గీ. ఆదినుండి దురాచారుఁ డయ్యేనేని
యెపుడు వర్ణాశ్రమవిహీనుఁడేని నరుఁడు
కాంచు విభవంబు మాఘావగాహనమునఁ
దద్వ్రతాసక్తులకు మోక్షదంబు తనయ! 143

భద్ర, సుభద్రుల చరిత్ర

సీ. ఈ ప్రసంగంబున నితిహాస మొక్కటి
గలదది వినుము తత్క్రమము వినుతు
శతబలి యను శూద్రుఁ డతిలోభి ధర్మవి
హీనుండు శఠుఁడు దుర్మానశాలి
దానవర్జితమైన ధనమతఁ డార్జించి
మృతిఁ బొంది నారక స్థితివహించె
నంత సుభద్ర భద్రాహ్వయుల్ తత్సుతుల్
యౌవనంబునను రూపాధికతను
గీ. ధార్మికులు గాదనంగ జూదమునఁ దగిలి
పట్టణంబేఁగి పల్లెలఁ బ్రతిదినంబు
జారచోరప్రసక్తసంచారు లగుచు
వర్ణసంకరవృత్తితో వర్తిలంగ. 144

క. జనకాధర్మార్జితమగు
ధనము వృథా నాశమగుడుఁ దంత్రౌషధ దు
ర్మను చర్యలఁ బరకాంతా
జనసంగ విముక్తబుద్ధిఁ జరియింపంగన్. 145

గీ. వార లీరీతి వర్తింప పౌరజాన
పదులు తల్లడమొంది విభ్రాంతిఁ జెంది
రదియు వర్జించి మృగయావిహారులగుచు
నుగ్రవనములఁ దిరుగుచు నొక్కనాఁడు. 146

క. ఇరువురు మృగయాసక్తులు
చరియింపఁగఁ జూచి వారిఁ జంపిన కతనన్
ధరణి ననావృష్టిత్వము
నిరధికదుర్భిక్షమొంద నిర్జలమయ్యెన్. 147

గీ. అపుడు భద్రసుభద్రు లాహారకాంక్ష
శునక వృక గార్దభ లులాయ సూకరాహి
ధేనుభక్షణసేసియుఁ దృప్తిఁ గనక
క్రమమున జనిరి దేశాంతరమున కపుడు. 148

క. పాపాత్ము లుదరపూర్తి
వ్యాపారంబునను మంత్రవశ్యౌషధకా
ర్యాపాదితవర్తన లు
ద్దీపించఁ గళింగనామదేశాశ్రయులై. 148

మ. ఘనచంపానగరంబు గాంచి మెలగంగాఁ జూచి రోగార్తిచే
తను వాయువ్యధఁ జెంది భూసురుఁడు వంతన్ దాఁ జికిత్సార్థమై
ధనమెంతేనియు నిత్తునంచు నయమొందన్ బ్రార్థనల్జేయ వె
జ్జనుమోదించి మహౌషధక్రియలచే నావ్యాధి వారించినన్. 150

గీ. తాను వైద్యున కొడఁబడ్డ ధనమునకును
యాచ్ఞచే నీయఁ దలఁచి భద్రాఖ్యు వెంటఁ
దోడుకొనిపోయి యట చని దుహితపుత్రు
మందిరంబున కేఁగి సమ్మదమెలర్ప. 151

సీ. అనువొందఁ బంచయోజనదూరమునను చం
పానదియుండుఁ దత్ప్రాంతమునను
చంపకేశ్వరు సంజ్ఞ శంభుఁడచ్చటనుని్క
నెపుడుఁ గళింగకులేశుఁ డందు
వసియించి యుండ ద్రవ్యముఁ గోరి భూదేవుఁ
డచ్చట త్రిదినంబు లనుసరింప
మాఘంబునందు బ్రాహ్మణయోగమునఁ జేసి
భద్రకుం దవగాహపరతనొందె

గీ. నా కళింగాధిపతిచేత నర్థమొంది
వైద్యునకు నిచ్చినం జన వాఁడు మరలి
చని సుభద్రునితోఁగూడి జన్మభూమి
చూడ నూహించి తగఁ జను చోట నపుడు. 152

గీ. గగనమధ్యస్థుఁడై ఖరకరుఁడు వెలుఁగ
నిర్జలారణ్యమున దప్పి నిగుడుకొనిన
నపుడు భద్రుఁడు జలము తే నరుగ బిలము
వెడలి భీకరశార్దూలవిభుఁడు చేరి. 153

చ. కనలి సుభద్రుపై నెగసి కంఠము ద్రచ్చి వధింప నంతలో
ననుజుఁడు తోయముల్గొని రయంబున వచ్చి మృగేంద్రు నగ్రజుం
గని కనలూని తద్గళము ఖడ్గము చేఁగొని వ్రేయ భద్రునిన్
మునుకొని చంపె నాపులియు ముప్వురు మృత్యువుబొంది రయ్యెడన్.

మ. తగ నవ్వేళ యమప్రయుక్తులగు దూతల్వచ్చి పాశంబులన్
దగులం గడ్డకు దించి ముప్వుర యమస్థానంబుఁ జేర్పంగ ప
న్నగరాట్తల్పుఁడు పల్కెఁ బార్షదులకు న్మాఘావగాహవ్రతా
నుగ చిత్తుండగు భద్రుఁడెమ్మనుడు సంతోషాత్ములై మ్రొక్కుచున్.

గీ. శంఖచక్రగదాయుధశార్జ్గధరులు
వీతరాగులు నగు విష్ణుదూత లపుడు
నలువురు నిజేశ్వరాజ్ఞచే నిలకు డిగ్గి
శమనదూతలఁ గన్గొని సరభసమున. 156

గీ. పరమకారుణ్యచిత్తుఁడై పద్మనాభుఁ
డవ్యయుం డాదిమూర్తి మూలయ్య యిపుడు
భద్రు నిటతోడితెమ్మని పలుకుటయును
వచ్చినారము విడుమంచు వారి నెలమి. 157

క. అని హరిదూతలు పల్కిన
విని యమకింకరులు భక్తి వినయముతోడన్
జనితామర్షణ నప్పుడు
ననుహొందగ నిట్టు లనిరి యార్యులు మెచ్చన్. 158

క. అతిపాపి దురాచారుఁడు
శ్రుతిమార్గవివక్షితుండు సూనృతదూరుం
డితనికి సర్షపమాత్ర
వ్రతధర్మము లేదు వీని వదలుడు మీరల్. 159

సీ. ఆగమస్మృతిపురాణార్థధర్మజ్ఞులు
నిత్యవ్రతాచార నిరతిశయులు
దమశమాన్వితులు ప్రాతఃస్నానకర్మరుల్
హరికథాపఠనార్చనాభిరతులు
లలితసాలగ్రామతులసీభజనమతుల్
సతతగాయత్రీవిశారదులును
నళినోదరసహస్రనామసంస్తుతిపరుల్
విష్ణుగీతాసక్తి విశదహృదయు
గీ. లఖిలతీర్థావగాహను లన్నదాన
మహితకీర్తులు భువనైకమాన్యు లెలమి
భాగవతులార! చేరరు భానుసూను
సదనమున కెప్పుడును వారు జనవినుతులు. 160

సీ. వసుధ నేకాదశవ్రతులు నమావాస్య
విశ్వాసకులు నరవిందనాభు
నకు దీపములు వెట్టు నరులు పుష్పఫలంబు
లలర సమర్పించు ననఘమతులు

ధూపంబు లొసఁగు సత్పుణ్య(జనులు) నిజా
చారవర్తులు వేదశాస్త్రవిదులు
గోదానపరులు గంగోదకస్నాతులు
పితృమాతృభక్తులు నతిథిపక్షు
గీ. లర్భకులకు నూనెయును బా లరయువారు
తిలకపరిశోభితాలకుల్ దులసికామృ
దన్వితస్నానపరులు శ్రీహరికథాను
రక్తులును రారు యమునిపురంబునకును. 161

క. శ్రీపతిసదనస్థలమున
నేపలరఁగ రంగవల్లు లిడుధన్యమతుల్
గోపీచందనధారులు
చేపడి చనఁబోరు జమునిచెంతకు నెపుడున్. 162

సీ. హరిమందిరమున జాగరణసేసినవారు
చలిపందిరు లొనర్చి వెలయువారు
వరుస గీతలు భాగవతములు వ్రాసిన
ఘనపుస్తకము లింటఁ గలుగు వారు
స్నానవేళల రాముచరిత చెప్పెడి వార
లెందు చాతుర్మాస్య మందు శాక
వర్జితులగువారు వరలు శీతమువేళ
నిరవొంద కంబళు లిచ్చువారు
గీ. రమణఁ దులసీమణులు కంధరముల శిరము
లను ధరించువారలు గమలాక్షహార
ధార్యులగువారు దశవిధోత్తమ జయంతి
పరతఁ జెందినవారు చేపడరు మాకు. 163

క. భువిఁ జాతుర్మాస్యపు రెం
డవ నెల దధి పాలు సముచితంబుగ మఱి మూఁ
డవ నెలను నాలుగవ నెల
నవిరళబీజద్విదళము లంటరు సుజనుల్. 164

వ. కావున నిట్లు బహుధర్మంబులు కృతాంతుండు మా కెఱింగించిన వాఁడు నిట్టి ధర్మంబులలో నెద్దియైనను భద్రుండు సేయుట లేదు మీ వచనంబు లతిక్రమించ వెఱతుము వీనినెవ్విధిం గొనిపోయెద రనిన యమకింకరులతోడ విష్ణుదూత లిట్లనిరి. 165

క. మీ నియమంబులు నిశ్చయ
మైనను మాఘంబు నందు నచలితబుద్ధిన్
స్నానము లొనర్చెఁ ద్రిదినము
లీనరు దోషములు వాసె నిలదన్మహిమన్. 166

క. అటు గావున దుర్దోషము
వటబీజంబంత లేదు వైకుంఠము చే
రుటకుం బ్రాప్తుం డీతనిఁ
జటులమతి న్విడిచి పొందు శమనుని కడకున్. 167

ఉత్సాహము :
అనిన విని కృతాంతదూత లప్పుడాసుభద్రు బం
చ నఘముంగడుక్కడంచు జనఁగ నూహ సేసి రే
పున మురాసురారిభటులు పుష్పకాధిరూఢుగా
నొనర భద్రుఁ జేయ వాఁ డనూనభక్తి వారితోన్. 168

గీ. అలఘుమతులార! యన్నదమ్ములము మేము
సమముగా దోషములొనర్చితిమి మృగద్వి
షంబు బహుజీవతతుల భక్షణ మొనర్చె
నిట్టి ముప్వురలోఁ బ్రియంబెసఁగ నన్ను. 169

శా. కైవల్యంబున కింపెలర్పఁ గొనిపోగా నేను ధీరోక్తితో
నీ వైశేష్యసుఖంబు లన్న వెలిగా నేనొల్ల నన్నుంచి స
ద్భావప్రౌఢి మదగ్రజుంగొని శుభప్రారంభులై పొందు ప్ర
జ్ఞావర్ధిష్ణు గుణాఢ్యులార! యనినన్ సంప్రీతచేతస్కులై. 170

సీ. భద్రునిఁ గనుఁగొని పలికి రధోలోక
మును మధ్యలోకంబు ఘనత నూర్ధ్వ
లోకంబు లనఁగ నస్తోకమనీష తన్
ద్రివిధంబులై యుండుఁ దెలియ వినుము
పంబి యధోభువనంబున నరకంబు
కడకతో మధ్యలోకంబు త్రిదివ
మూర్ధ్వలోకము బ్రహ్మ యునికిపట్టివి తలం
చఁగ దోషకామ్య నిష్కామయుతము
గీ. లమరు దోషంబునను నిరయము విశిష్ట
కామమునఁ ద్రిదివంబు నిష్కామమునను
సత్యలోకంబు గలుగు నిశ్చలత నిపుడు
మాఘదివసత్రయస్నాన మహిమఁ జేసి. 171

క. వనజజు లోకము గల్గెను
జననుత! మఱి వారు పుణ్యచయ మించుక యై
ననుఁ జేయ రుగ్రనరకం
బున కేఁగెద రింక వారి పొత్తేమిటికిన్. 172

క. చనుదెమ్ము నావుడును మీ
రనఘాత్ములు దివ్యపురుషు లగునట్టి మిమున్
గనుఁగొన్న వారలకుఁ గ
ల్గునె దుర్గతులన్న వా రకుంఠితకరుణన్. 173

మత్తకోకిల :

పంబి వీరలు ముక్తులౌ విధి భక్తిఁ జూచెదవేని మా
ఘంబులోన దినత్రయం బవగాహనంబొనరించి నె
య్యంబుతో ననఘుండవైతిపు డందులోపల నాలవా
లంబుగాఁగ దినద్వయంబు ఫలంబొసంగుము వారికిన్. 174

వ. అనిన విని భద్రుండు దినద్వయస్నానఫలంబు దానంబు సేసినఁ దత్పుణ్య ప్రభావంబున యమశాసనంబున వ్యాఘ్రసుభద్రుల విడిచి దండధరకింకరులు చని రయ్యిద్దఱను సూర్యసంకాశవిమానారూఢులం జేసి విష్ణుకింకరులు తోడ్కొనిపోవుతఱిని వైష్ణవప్రభావంబునం జేసి త్రిరాగ్నులంబోలి యమ్మువ్వురు దమలో నిట్లనుకొనిరి. 175

క. ధీరత నమరనివాసముఁ
జేరినఁ దత్పుణ్యమహిమ చెల్లిన మరలన్
ధారుణిఁ ద్రోతురు గావున
గౌరవమతి నందుఁ బోవఁగా నేమిటికిన్. 176

గీ. మర్త్యలోకమునందు బ్రాహ్మణ కులంబు
నందు జనియించి ప్రకట మాఘావగాహ
మహిత కృత్యులమగుచు దన్మహిమ నమిత
వినుత హరిపురసౌఖ్యంబు గనుట మేలు. 177

వ. అని తమ తెఱంగు పంకజనయన కింకరుల కెఱింగించి వారల యనుగ్రహంబున నగ్రజన్ములై భూలోకంబునంబుట్టి యందు మాఘస్నానంబు సేసి తత్పుణ్య ప్రభావంబున నమర్త్యులకు నందరాని వైకుంఠపుర నిత్యసుఖంబునం జెంది రెందును మాఘస్నానపరాయణుల కసాధ్యంబు లేదు 178

క. జననుత! యీయితిహాసం
బనురక్తిన్ వినినవార లతిదురిత విమో
చనులై మధువైరిపురం
బున నుందురు విహితదివ్యభోగాన్వితులై. 179

వ. అని మఱియు నిట్లనియె. 180

ఆ.వె. మఘసమేతమైన మాఘపౌర్ణమియందు
హరిఁ దలంచి జలములందుఁ గ్రుంకె
నేని గురుని నింద మానుగాఁ జేసిన
పరిధి రీతి నఘము వాయుననిన. 181

పరిధి కథ

వ. విని నారదుండు పరిధియన నెవ్వఁ డతఁ డేమి కారణంబున గురుని నింద సేసె మఱల నప్పాపంబు నెట్లువాసె దీనిని సవిస్తరంబుగాఁ దెల్పు మనిన. 182

చ. అనవిని బ్రహ్మపల్కెఁ గలహాశనుతో సరయూతటంబునన్
గొనకొని సుప్రసిద్ధమగు కోసలయందు ప్రగాథనామ స
న్ముని విలసిల్లు నాయనఘమూర్తి నిజాశ్రమభూతి జాతిభే
దన రహితంబు పుష్పఫలదామకుజప్రకరంబు చూడఁగన్. 183

గీ. అతని శిష్యుండు వేదవేదాంగవిదుఁడు
కౌశికమునీంద్రగోత్రుండు ఘనుఁడు పరిధి
నాఁగఁ జెలువొందు నతఁడొక్కనాఁడు గురున
నుజ్ఞచేఁ దీర్థయాత్రకు నుత్సహించి. 184

సీ. ఛత్రదండాజినోజ్జ్వలుఁడై వెడలె నంత
నిచట ప్రగాథమునీశ్వరుండు
కడఁక విద్యలు మాని గరికవ్రేళ్ళరసంబు
ద్రావుచు నుత్కృష్ట తపమొనర్చు

చుండంగ పరిధి తా నొకనాఁడు గురునిగృ
హమునకుఁ జనుదెంచు సమయమునను
సాయాహ్నకృత్యముల్ సలిపి దూర్వామూల
రసముపయోగించు ప్రథితయశుని

గీ. ఘను ప్రగాథమునీంద్రునిఁ గాంచి యాతఁ
డాసవము గ్రోలుచున్నవాఁ డనుచుఁ దలఁచి
కనలి యాత్మలో రోసి వందనము సేయ
మతి దలంపక దూషించి మరలె నతఁడు. 185

వ. ఇట్లు పరిధి తత్కృతం బెల్లవారికి నెఱింగించి నిజదేశంబునకుం జనియె నంతనొక్కనాఁడు ప్రగాథమునీంద్రుం డింద్రసభకుంబోయి యందలి సభాసదు లిందేలవచ్చెదు స్వభావంబుననైనను అస్వభావంబుననైనను జనంబులచేత శిష్యునివలన నిందం బొందితి వింక మగుడి పొమ్మనినఁ గ్రమ్మఱి నిజస్థానంబునకు వచ్చి సమీపాశ్రమవర్తులైన భూసురులం బిలిచి వారితో నిట్లనియె. 186

ఆ.వె. గటికవ్రేళ్ళుద్రవ్వఁగా శక్తి చాలదు
రమణ రసముద్రావు వ్రతము నాది
యెలమి మీరు తెచ్చి యిచ్చిన యాహార
మొనర జేసికొందు ననిన వారు. 187

గీ. జ్యోతిషార్ణవుఁడను విప్రుఁ జూచి మౌనిఁ
బ్రేమ సేవించు మనుచుఁ బంపిన నతండు
గటిక వేళ్ళేరి తెచ్చి రోఁకటను ద్రొక్కి
పాత్రలోన రసముపిండి భక్తి మెఱయ. 188

క. మునిముందఱఁ బెట్టిన నా
యన సాంధ్యోపాసనాదు లనుగతి నొనరిం
చిన పిమ్మట రసపానం
బును ముదమునఁ జేసియున్న నవ్విధమెల్లన్. 189

సీ. తెలిసి తత్తీరవిప్రులకెల్ల నెఱిఁగించి
జ్యోతిషార్ణవుఁడు సంప్రీతితోడ
నయ్యయో! మున్నీమహాత్ముని మైరేయ
పానకృత్యుండని పలికె పరిధి
యీమృషావాక్యంబు లేల పాటించితి
మతిదోషము ఘటించె ననుచుఁ గుంది
యాతపోధను కడ కరుదెంచి మొక్కి స
ద్వినయంబెసఁగ నిట్టు లనియె ననఘ!

గీ. పాపకర్ముఁడ నైతిఁ గృపాకటాక్ష
వీక్ష నా యందు బ్రసరించవే గుణాఢ్య
యెఱుఁగ కిట్లాడు కుమతుల కేదిగతియొ
యనిన సంయమి యిట్లను నతని తోడ. 190

వ. సుఖదుఃఖంబులును నిందాబహుమానంబులును జయాజయంబులును భయశోకహానిలాభంబులును జరామృత్యువులును బూర్వ కర్మానుభవంబుచేత దైవంబే యొసంగుచున్నయది. లోకవిద్వేషంబునైన ధర్మంబెవ్వరాచరింతురు వారు నరకంబునఁ జరింతురు. సర్వసమ్మతంబుగా నడిచిన సత్పురుషులు నుపకారవంతు లపవర్గం బనుచరింతురు వారికి నిందలేదు 191

శా. ఏకాలంబున నేవయోనియతి మున్నేసీమ నేయూరిలో
నేకర్మంబు లొనర్చు మానవుఁడు దా నిచ్ఛావిహారాత్ముఁడై
నాకాలంబున నావయోనియతి మున్నాసీమ నాయూరిలో
నాకర్మానుభవంబుఁ గొంచు మనుజుండర్థించి ధీరోత్తమా! 192

సీ. సురహితార్థంబు దుర్మరణంబు నొంది పెం
పలర సద్గతికిఁ బోవఁడె దధీచి
చెలఁగి మాంసంబిచ్చి శిబి కాంచఁడే యాత్మ
వధ చేసుకొని యపవర్గపదము

జనకు మాటఁ దలంచి జనని నొక్కటఁ ద్రుంచి
పరశురాముఁడు కీర్తిపరుఁడు గాఁడె
ధాత్రీసురుండైన వృత్రునిఁ బరిమార్చి
సన్నుతి కెక్కఁడే జంభవైరి

గీ. జగతిఁ బౌలస్త్యవంశసంజాతుఁడైన
రావణునిఁ గూల్చి (జానకీ) రామవిభుఁడు
లోకహిత మొనరించి సుశ్లోకధనుఁడు
గాఁడె వీరికి దోషంబు గలదె యెందు. 193

వ. మున్నొక బ్రాహ్మణుండు సత్యవాది జితేంద్రియుండు తీర్థయాత్రా ప్రసంగంబున వనంబునసంచరింప దిగంబరుండును నిరాహారుం డును మాంసరక్త వర్జితుండును నగు నొక్కముని పల్వల సమీపంబున వేణుగుల్మ మధ్యంబున నున్నయెడ లుబ్ధకుం డొకరుండు పొద మాటున నుండి విహంగనాశనంబు సేయుచుఁ దీర్థయాత్రా పరుండగువానితో గుల్మమధ్యంబున నెవ్వఁడున్న వాఁడు సత్యంబు పల్కు మనవుడు నసత్యంబున నతండొక్కరుం డున్నవాఁడనిన లుబ్ధకుండు తద్వధం బొనర్చి వనాంతరంబున కరిగె వేదవేత్తయుఁ గులీనుండును సర్వజన సమ్మతుండునునగు విప్రు నీతివచనమాత్రంబు బ్రహ్మహత్య ప్రవేశించి బాధింపం దొణంగెఁ గావునఁ బరిధికిఁ బాప ప్రాప్తియగు. తద్వచనం బుచే సంశయంబు నొందిన నీ కఘంబు లేదని పల్కి నిందా పరి త్యాగియై దేవపూజ్యుండై యింద్రసభాప్రాప్తిచే ప్రగాథమునీంద్రుండు చెలంగుచుండె నంత 194

సీ. గురుని నిందించిన దురితంబుచే చతు
ర్దశసంఖ్యమన్వంతరములు పరిధి
ఛాయావిహీన నిర్జలఘోర వనములో
బ్రహ్మరాక్షసుఁడయి బహుళదుఃఖ

మందుచు నర్బుద న్యర్బుద సప్తత్రి
తయవత్సరమ్ములు దాటి (తుదకు)
రైవతమన్వంతరమున ముద్గలుఁడను
ముని గమనింప నిమ్ములనుఁ జూచి

గీ. క్షుద్వ్యథాకులుఁడై మ్రింగఁ గొఱలి కడఁగు
వికృతతను నూర్ధ్వకుంతలు వికటవదను
చంచలపు జిహ్వ బ్రహ్మరాక్షసునిఁ గాంచి
మునివరుఁడదల్చి వానితో ననియె నపుడు. 195

క. క్రూరాకారుఁడవై ఘన
ఘోరారణ్యమున మిగులఁ గుందుచు నుండన్
గారణ మేమి నిజంబుగ
నారసి యెఱిగింపుమనిన నతఁడిట్లనియెన్. 196

గీ. సుజనవినుత! ప్రగాథశిష్యుండ నైన
పరిధి యనువాఁడ కుమతినై గురుని నింద
చేసితిని మద్యపానంబు సేసె ననుచుఁ
దత్కృతంబున నిట్టి పాపంబు చెందె. 197

క. అనిశము జలరహితంబగు
వనమున కోట్యర్బుదయుతవర్షంబుల నే
ఘనవిప్రరాక్షసాకృతి
దినమును దుఃఖములఁ బొందితిన్ మౌనీంద్రా! 198

మత్తకోకిల :

కోరి శోషితపూయమాంసముఁ గొంచు మూత్రపురీషమా
హారమై యెసగంగ శోకమహాంబురాశి మునుంగుచున్
బారమేమియు లేని నన్నుఁ గృపాకటాక్షనిరీక్షణన్
జేరి ప్రోవు మునీంద్రచంద్ర! విశేషచిద్బలదాయకా! 199

వ. అని పలికిన 200

చ. పనుపడ బ్రహ్మరాక్షసుఁడు పల్కినపల్కుల కద్భుతాత్ముఁడై
యనియె ధృతిన్ గవేరతనయాంబువులం దవగాహనంబుగాఁ
జను మొకమాఘమాసము నజస్రము మాధవపాదభక్తిచే
వినుము మహాఘనాశమగు వేయును నేటికి తత్క్షణంబునన్.

సుగంధివృత్తము :
బాంధవం బెలర్ప నిన్గృ(పాప్తిఁ గావగాఁ) గుశ
గ్రంధినావహింపఁజేసి కాంక్షతోఁ గవేరజా
సింధువాఃప్రపూరనిత్య సేచనంబొనర్ప నీ
బంధముల్ వినాశమొందు బ్రహ్మరాక్షసోత్తమా! 202

క. అని ముని కృతనిశ్చయుఁడై
సునిశితమతితోడ రాక్షసుఁడు తనవెంటన్
జనుదేరఁ గవేరసుతా
ఘనతటినీస్నానవాంఛఁ గదలెన్ జదలన్. 203

సీ. మొనసి యామ్యదిశాభిముఖుఁడయి చనియట
కావేరిఁ గన్గొని కడకతోడ
సరభసవృత్తి కుశగ్రంధి సమకూర్చి
పసమించు బ్రహ్మరాక్షసుని యందు
నావహింపఁగఁ జేసి యవగాహమొనరించి
పెనుపొంద దేవర్షి పితరతర్ప
ణము లొనరింపంగ రమణఁగుశగ్రంధి
మజ్జనంబునను నిర్మలుఁడగుచును
గీ. ముక్తుఁడయ్యెను పరిధి సన్మునులు వొగడఁ
బ్రీతి మాఘావగాహనచేతనైన
మహిమఁ దెలియంగ నేర్చునే మాధవుండు
దక్క నొరులకునని సురల్ దలఁచి పొగడ. 204

క. గురునింద శాస్త్రనిందయు
హరినిందయు దేవవిత్త హరణము ధరణీ
సురధనముఁ గొనినదురితము
పొరి మాఘస్నానమునను బొలియు నిజముగా. 205

క. అని పరిధి కీఁక్రియన్ బో
ధన సేయుచు ముద్గలుండు తన శిష్యులుఁ దో
జనుదేర పాండ్యధరణీ
జననాయకు పురమునకును జయ్యనఁ జనియెన్. 206

గీ. పాపనిర్ముక్తదేహుఁడై పరిధి మౌని
ప్రమద మొదువంగ బదరికాశ్రమముఁ జేరె
ననుచు మాఘావగాహమాహాత్మ్య మెల్ల
క్షీరవారాశిపై హరి సిరికిఁ జెప్పె. 207

ఉ. దానములున్వ్రతంబులును ధర్మములున్ బహుయజ్ఞముల్ సమా
ధానతనొక్కచోటనిడి తక్కినవైపున మాఘమాసను
స్నానఫలంబు నిల్పి సురసంఘము తూన్చిన మాఘధర్మమెం
తై నయమై తనర్చె సముదీర్ణత నేమని యెంతుఁ బుత్రకా! 208

వ. పూర్వకృతంబులగు బహుకర్మవిపాకంబుల వలన మాఘస్నానాపేక్షా సక్తుండగు. తద్యోగంబు సర్వదోష విముక్తకరంబగు మున్ను అష్టావింశతి పిశాచంబులు బహువిధరూపంబుల నుండియు సమిత్కుశ దానపరుం డైన సుయజ్ఞుని వలన ముక్తులైరని చెప్పిన విని నారదుం డిట్లనియె.

**సుయజ్ఞుని కథ**

చ. అరయ సుయజ్ఞుఁ డేగతి మహామునియయ్యె నతండు ధాత్రి నె
వ్వరికిని శిష్యుఁ డాసుజనవర్తి కతంబున బ్రహ్మరాక్షసుల్
చిరమతి నెట్లు మోక్షమును జెందిరి యావిధ మేర్పరించు మా
దరముగ నన్న వాక్పతి ముదంబున నారదుతోడ నిట్లనున్. 210

సీ. మౌనీంద్ర! చాక్షుషమన్వుసమయ ద్వాప
　　　　రమున జాబాలిసంయమివరేణ్యుఁ
డమర నారాయణాశ్రమమున నుండు నా
　　　　యనపుత్రుఁడు సుయజ్ఞుఁ డమలచిత్తుఁ
డేడేండ్లనాఁడు పెంపెసఁగ శాండిల్య మ
　　　　హామునీంద్రునియొద్ద నధ్యయనము
చేయుచుఁ బద్మాక్షు సేవావిచక్షత
　　　　నుండి తద్గురుఁడంప నొక్కనాఁడు
గీ. సుమ సమిత్కుశఫలనిమిత్తము వనాంత
రమున కేతెంచి యందొక్క రావి యభ్ర
చుంబితోన్నతయైయున్నఁ జూచి చేరఁ
జనిన దద్భూరుహవిటప సప్తకమున. 211

గీ. కర్బురాచలశృంగసంకాశతనులు
ప్రకటభీకరదంష్ట్రకరాళముఖులు
శుష్కకంఠోగ్రతాలువుల్ శుద్ధతామ్ర
కేశులగు బ్రహ్మరాక్షసుల్ కెరలి యపుడు. 212

క. సప్తశాఖలనుండి భూస్థలికి వ్రాలి
యేడుగురు విప్రసుతు దెస కేఁగుదేరఁ
జూచి రయమున జాబాలి సూనుఁ డచటు
తొలఁగి యతివేగమున నేఁగెఁ దూర్పు దెసకు. 213

క. అట పోవుచున్న యా ముం
దట శ(తశాఖాభయప్రద)స్ఫుటవట ము
త్కటమతి నీక్షించిన య
చ్చటి కూష్మాండవ్రజంబు సరభసవృత్తిన్. 214

క. తలలు భుజంబుల మీఁదట
విలసిల్లఁగ రక్తసిక్త వికృతాకృతులై
నలి నేడుగు రరుదెంచినఁ
గలఁగి వటుఁడు పశ్చిమంబు కడకుం జనియెన్. 215

సీ. అచ్చట యోజనాయామంబు గల శాల్మ
లీ మహీజము మహాభీమమగుచు
వెలయు నందున జానువులు భుజములఁ గటి
స్థలముల (యందులఁ) దలలు గలుగు
ఢాకినీసప్తకం బేక (మొత్త) మ్మున
గదిసిన సాధ్వసకలితుఁ డగుచు
మునిపుత్రుఁ డుత్తరమ్మున కేఁగుటయు (నొక్క)
యానోహకంబు రమ్యంబు గాఁగఁ

గీ. గట్టెదుటఁ గానుపించె నా చెట్టు మొదల
ఘూకవక్త్రులు వ్యాఘ్రముఖులును నైన
శాకినుల నిద్దరను గని చలనమొంది
వడుగు వడి వడంకుచుఁ గడిమి కడకు. 216

క. చిడిముడితో నేఁగిన న
య్యడ గర్దభముఖులు ముప్వ రరుదెంచిన బె
గ్గడిలి నలుగడలు గని య
ప్పుడు మునిపుత్రుండు మేడి పొంతకుఁ జనియెన్. 217

వ. అచట నరాకారులు దీర్ఘబాహులును శాకినీయోనులును నగువారి నిరువురం గని కంపించిన చిత్తంబుతో నిర్విణ్ణుండై తొట్రుపడి నిలుచున్న నమ్మహాభూతంబు లన్నియుం గూడుకొని 218

ఆ.వె. ఇతని మేమె కంటి మీతఁడు మావాఁడు
ఇతఁడు మున్నకాదె యిటకు వచ్చె
భుక్తికర్త్వఁడనుచుఁ బొంతపో కొండొరుల్
ముష్టియుద్ధమునకు మొనసి రపుడు. 219

ఉ. ఒండొరు హుంకరింతురు బలోద్ధతి నొండొరుఁ బాసి డాతు రు
ద్దండత నొండొరున్గదిసి తన్నుదు రొండొరుఁ జూడ మున్ భుజా
దండములన్ బెగల్తురు మదంబున నొండొరుఁ ద్రోతు రిట్లు కూ
ష్మాండులు బ్రహ్మరాక్షసులు నద్భుతమానవమాంసకాంక్షులై. 220

గీ. అటులు తమలోనఁ(దాము) పోరాడుచున్న
యెడ సుయజ్ఞుండు తనకు దిక్కెవ్వరనుచు
భక్తసంత్రాణు సుజనహృత్పద్మభానుఁ
జతుర గాంగేయపరిధాను మతిఁ దలంచి. 221

చ. హరి పరమాత్మ కేశవ నవాంబుదవర్ణ రమాసతీమనో
హర హరిణాంకపంకజహితాక్ష మురాంతక చక్రపాణి భా
సురతపనీయవాసపరిశోభిత నీరజనాభ శత్రుభీ
కర కరుణావిధేయ కరిఁ గాచు విధంబున నన్నుఁ గావవే. 222

వ. అని యార్తత్రాణపరాయణుండైన భక్తవత్సలు ననంతశాయిం బ్రస్తు
తించిన నప్పు డశరీరవాణి యిట్లనియె. 223

చ. ఇదె చనుదెంచె మాఘము మునీశ్వరపుత్త్ర! నృసింహమంత్ర మా
స్పద మది లోఁ బఠింపుము పిశాచగణంబులు చేరలేవు నీ
మది భయమేల వేగఁ జనుమా యనుమానము మాని కాశికా
నదికి జలావగాహనమునం గృతకృత్యుఁడ వౌదు నావుడున్. 224

క. విని కడు హర్షించుచు న
మ్మునిసుతుఁడు నృసింహమంత్రము పఠించుచు గ్ర
క్కున నదిఁ జొచ్చినవెంటన్
జనుదెంచెను బ్రహ్మరాక్షసప్రకరంబున్. 225

వ. ఇట్లు తోడన చనుదెంచి పిశాచశాకినీఢాకినీ కూష్మాండబ్రహ్మరాక్షసులు నదిం జొఱవెఱచి తీరంబున నిలిచిన సుయజ్ఞుండు కాశికా నది నాభి ప్రమాణపర్యంతంబుఁ జొచ్చి స్నానంబుసేసి యాపిశాచ గణంబులు తనపై వచ్చునో యను భయంబునఁ దన్మధ్యంబున నుండి పాణి పుటంబునన్ జలంబులు వారిపయిం జల్లిన నందఱు విశుద్ధజ్ఞాన హృదయులై నమస్కరించిన వారింజూచి మీ రెట్టికర్మంబున నిట్టి దురవస్థం జెందితిరి మీ మీ విధంబులు వేర్వేర నెఱింగింపుడనిన

## ఆశ్వాసాంతము

క. ఆక్కాంబా వరనందన!
దిక్కాంతాచికురభారధృతసితమల్లీ
స్రక్కోమలకీర్తినిధీ!
వాక్కలనాజితఫణీశ! వరశుభమూర్తీ! 227

గద్య. ఇది శ్రీవరాహగిరి లక్ష్మీనృసింహవరప్రసాదలబ్ధసారస్వతవిచిత్రాపస్తంబ సూత్ర కాశ్యపగోత్ర పవిత్ర వడ్లపూఁడి వెంకటమంత్రిపుత్ర పెద్దయ నామధేయ ప్రణీతం బైన వాయుపురాణంబునందు మాఘమాత్మ్యంబున శంఖోదకసాలగ్రామతీర్థ విశేషంబును గుహ్యకు చరితంబును సుతవుని శాపమోచనంబును విచిత్రరథ భద్ర సుభద్రుల పరిధి సుయజ్ఞుల కథనంబులు నున్నది ద్వితీయాశ్వాసము.

శ్రీః

# మాఘమాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

క. శ్రీరామా వరపాదాం
భోరుహసేవామనఃప్రపూర్ణామోదో
ద్ధారణ! బలవద్రిపుమద
వారణ! చినగంగ! కమ్మవంశాభరణా! 1

వ. అవధరింపుము వివిధ పురాణేతిహాస ప్రసంగ విఖ్యాతుండైన సూతుండు హరికథాశ్రవణసమ్మోహితులగు శౌనకాదుల కిట్లనియె నట్లడిగిన సుయజ్ఞునకు బ్రహ్మరాక్షసు లిట్లనిరి. 2

### బ్రహ్మరాక్షసుల పూర్వ వృత్తాంతములు

ఆ.వె. దగ్ధకరతలుండు దగ్ధజిహ్వుండు న
మఘుఁడు దూతికుండు (మఱియు) నింద
కుండు మలవిభక్షకుండు రైవతుఁడును
ననఁగ సప్తకాఖ్యలతిశయిల్లు. 3

గీ. అట్టివారము మేము మహాత్మ! నేఁడు
పూర్వజన్మకృతంబునఁ బుట్టినట్టి
కలుషములఁ బాసితిమి తత్ప్రకార మెలమి
తోడ వినుమని దగ్ధహస్తుండు పలికె. 4

ఉ. ధీమహితాత్మ! యే సురనదీఘనతీరమునందుఁ గాశికా
గ్రామపురోహితుండ నొడికంబుగ మాధవుడంద్రు నన్ను నే
వేమఱకభ్యసించితిఁ బ్రవీణత వేదములున్ దదంగముల్
భూమిఁ బ్రసిద్ధికెక్కితిని భూసురపుంగవు లిచ్చమెచ్చగన్. 5

క. తలిదండ్రుల విడిచితి ని
ర్మలగంగాస్నానవిపులమహిమ మఱచితిన్
లలి శాస్త్రవ్యాఖ్యానం
బులు మానితి వేదపాఠముం జేయ నొగిన్. 6

గీ. శ్రాద్ధదాననిమిత్తమై చల్ది మూట
గట్టి దేవళ్ళ నుంచెడి పెట్టె యనుచుఁ
జంక దగిలించుకొ చరింతుఁ బొంకముగను
దీపధూపంబు లిడ నెట్టి దేవునికిని. 7

వ. మఱి లోభంబున సకలజనుల వంచించి ధనంబార్జింతు మహిష కూర్పాసతిలదానంబులును దుర్దానంబులం బరిగ్రహింతు మిథ్యా వచనంబులని సర్వధర్మంబుల నిందింతు హరికీర్తనంబులు విననొల్లక బంధుమిత్రాశ్రితజనంబులఁ బోషింపక పెద్దకాలంబువర్తిల్లి కాల పక్వంబైన బ్రహ్మరాక్షసభావంబు నొందితి బహుదివసంబులు నిర్జన కాననంబున వసియించి భవద్దర్శనంబునం జేసి నిఖిలదుఃఖ విమోచ నుండ నైతి ననిన యనంతరంబ దగ్ధజిహ్వుండు భూసుర శిరోమణి కిట్లనియె. 8

సీ. ఆది నందన గ్రామమందున వసియింతు
ముద్గల గోత్రుండ మొగి సుకర్ముఁ
డను పేరివాఁడ వేదాదు లెఱింగి దు
రాశఁ బరాన్నమె యభిలషింతు

నిది భుజింపఁగ వచ్చు నిది భుజింపంగరా
దనక కక్కూర్తుల వినయహీను
సరణి ముల్లంగి బచ్చలి తండులీయక
శాకా(దికములు) వార్తాకములును
గీ. మునగకూరయు సొరకాయలును కళింగ
ములును నీరుల్లి బీరకాయలును చిలుక
కూరలశనంబు నతికాంక్షఁ గూడదనక
యాశతీఱంగ భక్షింతు ననుదినంబు. 9

క. చాతుర్మాస్యద్వాదశిఁ
బోతరమున ద్రుష్టికూర? భుజియించితి సం
ప్రీతిగఁ బర్వంబులఁ బ్ర
ఖ్యాతంబుగ రాత్రివేళ నన్నము తింటిన్. 10

ఆ.వె. నరుఁడు దుష్టభూత నాగశక్తులకును
ఘనత నిడిన యన్నమును భుజింతు
భానువాసరములఁ బైతృకదినములఁ
బొసఁగ నిశలఁ జేతు భోజనంబు. 11

క. గురులన్ బెద్దలఁ గాదని
వెరవొందగఁ జెప్పినవియు వినక మెలఁగితిన్
ధర దగ్ధజిహ్వుఁ డనఁగాఁ
జరియించితి బ్రహ్మ రాక్షసస్థితి నంతన్. 12

వ. అనిన నమాఘుం డిట్లనియె. 13

సీ. వినవయ్య మున్ను ద్రావిళదేశమున శర్యుఁ
డనియెడు పేరిధరామరుఁడను
జగతి పావనుఁడను సర్వవేదవిదుండ
నైయుండ నొక్కనాఁ డర్థి శూద్రుఁ

డల జటాభస్మలింగాంకితుం డతితీక్ష
ణాకృతి కృతకవిద్యాన్వితుండు
శఠుఁడు కామగతి వాచాలుండు భైరవా
దికమంత్రవిదుఁడు (యాత్రికుఁడు) నైన

గీ. యతఁడు భిక్షార్థియై యస్మదాలయమున
కరుగుదెంచి కుతూహలి(యయి భి)షగ్వి
భూతి సర్వవశీకరంబులును జూప
నప్పు డే భిక్షమిడిన వాఁ డరుగుచుండు. 14

చ. అతని మహానుభావుఁడని యాత్మఁ దలంచి ముదంబు పర్వ సం
స్తుతు లొనరించి శంభుఁడవు ధూర్జటి వీవ మదీయభాగ్యసం
గతమున నేను నిన్నిపుడు కంటిఁ గృతార్థుఁడనైతి భక్తి వాక్
ప్రతతిసుధారసంబునను బావనుఁ జేయుము నన్నుఁ దాపసా! 15

గీ. భువినిఁ బురుష ప్రతిష్ఠ యెప్పుడు ఫలించుఁ
గాన నినుఁ జూడ సుదినంబు గాదె నాకు
జీవనంబెల్ల రక్షించు శిక్షసేయు
మనుచు నుతియింపగాఁ బ్రసన్నాత్ముఁడగుచు. 16

క. నాపదముల నింపారఁగ
లేపసరును బింద నెగసి లీల నతనితోఁ
బ్రాపైన మహామేరున
గోపాంతముఁ జేరి దర్శనోత్సుకమతినై. 17

మ. గురు ప్రస్థంబు సమగ్రరత్నవిలసత్కూపంబు మౌనీంద్ర కి
న్నరగంధర్వపతంగ యోగిగణ నానాసిద్ధసంసేవ్య మం
బురుహాక్షాబ్జజశంకరాశ్రయ కనద్భూయిష్ఠమున్ గష్టదు
ష్కరమార్గంబగు మేరుభూధరము నేఁ గంటిన్ మహోత్సాహినై. 18

సీ. అతులిత మేరువిదితవిచిత్రములెల్లఁ
జూచుచు హిమగిరి స్ఫూర్తి మెచ్చి
మగుడి యోగీంద్రుతో మద్గృహంబున కేఁగి
యనురక్తి భోజనం బాచరించి
యుండ సిద్ధుఁడు గమనోన్ముఖుం డగుటయు
నంఘ్రుల కెఱఁగి నే నస్మదీయ
మందిరంబున నుండుమా (యన) యోగియుఁ
బుష్యమాసంబునఁ బోవ నిలిచె

గీ. నతఁడు పాషండమతమార్గ మలవరింప
నేను తన్మతవృత్తి వహించి తిరుగ
శిష్యుఁడగు నన్ను విడిచి యాసిద్ధుఁ డేఁగె
నన్యదేశాంతరమునకు నంతలోన. 19

వ. మాఘమాసమేతెంచిన మదీయ భార్య తదీయస్నానాపేక్షచే నన్ను వేఁడిన నొడంబడకున్న వేదాచారవర్జితుండనైననన్ను కులీనుండవు జామదగ్ని వంశోద్భవుండవు నిగమాగమ నిపుణుండవు పాషండ మార్గంబున వర్తింపవలవదు.అనుజ్ఞ యిమ్మనవుడు నేను కోపంబు గదుర దండంబునఁ దాడనంబు సేసితి నది కారణంబున రోదనంబుచే మాఘస్నానంబు మానె నేను సుస్నానంబు దూషించు కతంబున నల్పాయుష్కుండనై యీయశ్వత్థంబున బ్రహ్మరాక్షసత్వంబునొంది యమాఘాహ్వయుండనైతి ననవుడు తదనంతరంబున దూతికుం డిట్లనియె 20

గీ. వెలయఁ గాశ్మీరదేశీయవిప్రవరుఁడ
ధాత్రిఁ బెంపొంద శావటగోత్రజుండఁ
బౌష్కలాహ్వయుఁడను వేదపారగుండ
మత్పురాతనచరిత నేమరక వినుము. 21

సీ. పదియేళ్ళవాఁడనై పరగ మృతుండయ్యె
 తండ్రి యాలోన వేదములు చదివి
మఱచితి (నే) పరామర్శ సేయఁగ లేక
 ధర్మమార్గముఁ దప్పి దాసిఁ గూడి
గుణవతి భార్యఁ జేకొనక రేయిబవళ్ళు
 సంధ్యాద్యనుష్ఠానచర్య లుడిగి
దాసినిఁ బత్నిగాఁ దగు పత్ని దాసిగా
 వర్తింపగా దాసి వలనఁ బుత్రు
గీ. లుదయమొందిరి నలువు రభ్యుదయమొంది
కర్మమున బ్రహ్మరాక్షసాకారమైతి
ననుచు దూతికుఁడాడిన యవసరమున
నిందకుఁడు మ్రొక్కి పల్కె మౌనిసుతు తోడ. 22

క. విను మాగధదేశంబునఁ
జను పంచనఖాభిధాన జనపదమున నుం
దును కౌశికుఁడనువాఁడను
జననుతుఁడను మైగిగోత్ర సంభవుఁడఁ గడున్. 23

గీ. శంఖవర్ణుండను మునీంద్రచంద్రు వలన
శ్రుతియు నంగయుతముగాఁగ స్మృతిపురాణ
తర్కమీమాంస (న్యాయ) శాస్త్రములు చదివి
యోగ్యుఁడని భూజనము లెన్న నుండునంత. 24

సీ. క్రమమున ద్వాపరాంతమున జ్యోతిష్మతి
 యను రాజు నన్ను ధర్మాధికారిఁ
జేసి పురోహితస్థితి వహింపుడటన్నఁ
 గణఁగి లోపాముద్ర కరుణచేత

జయశీలి నగుచు రాజద్వారమున సూరి
జనులను గెలిచి నిచ్చలును పూని
యోగ్యునయోగ్యుఁగా యోగిని యోగికాఁ
డనిపల్కి కొందఱ నపహసించి

గీ. యధికపుణ్యఫలంబులయందు పరుల
కర్థ మంటంగనీక నే నపహరించి
మ త్సమానుఁడు లేఁడు భూమండలమున
నని యహంకృతిఁ బెద్దల నఱఁగఁ జేసి. 25

వ. వర్తింపుచున్నఁ దత్కాలంబున 26

తరలము :

గురుసుతుండు మఘార్థమై(నృపుఁ) గోరివచ్చి నృపాలు మం
దిరము డాసిన మత్సఖుండను ధీవివేకము మాని యేఁ
బరిహరించితి భంగపెట్టి యపాస్తవైభవుఁ జేయ న
ద్దురితవృత్తిని బ్రహ్మరాక్షసదుర్దశీవ్యథఁ జెందితిన్. 27

వ. అని నిందకుండు పలికిన మలభోజనుం డిట్లనియె 28

గీ. అర్థితో వంగదేశంబు నందు దేవ
యాజి యభిధ నగస్త్యమహామునీంద్రు
గోత్రజుఁడనై ధనాఢ్యత ధాత్రి నెగడి
మండలగ్రామవాసినై యుండు నపుడు. 29

గీ. అంధులగు తల్లిదండ్రుల కస్మదీయ
పత్ని మాటలు విని బహు యత్నములను
కష్టమగు కూడు పెట్టించి మృష్టభోజు
నైతి పుత్రులతోడ భార్యాయుతముగ. 30

గీ. పూని పితరుల కొక్కనాఁడైన మంచి
భోజనంబిడక కుడిచితి రాజనంపు
కూడు సతితోడ సుతులతోఁ గొదవలేక
యంతఁ గొన్నాళ్ళ కొక భూసురాన్వయుండు. 31

మ. కడుదూరంబున నుండి మేను వణఁకంగా పాదముల్ దొట్రిలన్
వడచేఁ జిక్కి హరీయటంచును గృహద్వారంబుఁ జేరంగ నే
నిడఁగాఁ బంచితి నీరసాన్నమతఁడున్ హేయంబునుం జెందకే
కుడిచెన్ దత్కలుషంబుసేయు కతనన్ ఘోరాటవీభూములన్. 32

క. జనియించితి మలభోజనుఁ
డనఁగా నే బ్రహ్మరాక్షసాకారుఁడనై
యని విన్నవింప రైవతుఁ
డనుపమసద్భక్తి నిట్టు లనియెన్ మునితోన్. 33

సీ. కకసగోత్రజుఁడ మక్కణకుండ కాశికా
పురి నగ్నిధూతభూసురసుతుండ
నతులిత వేదవేదాంతపారగుఁడను
రాజదత్తాధికారములు చాలఁ
గైకొని దేవతాగారవిత్తము తైల
తండులఘృతధాన్యధనమరీచ
చయములు దేవతాస్వము హరించితిఁ బుణ్య
మరయ సర్షపమాత్రమైనఁ జేయ

గీ. హీనులను పూజ్యులని పూజ లే నొనర్తు
నటవిటుల నెల్ల మెచ్చి ధనంబు లిత్తు
నర్థ ధర్మవ్యయంబు నే నాచరింపఁ
బరగ నార్యులఁజూచి నేఁ బరిహసింతు. 34

గీ. నిగమదూషణ దేవతానింద నృత్త
గీతవాద్య రతిప్రీతిచేతఁ దగిలి
యీశపాదాబ్జసేవన మెఱుఁగలేక
సత్పురుషసేవ లెప్పుడు సలుపనైతి. 35

వ. అదికారణంబున రైవతుండను బ్రహ్మరాక్షసుండనైతి భిన్నదేశమ్ముతుల మగు మా పూర్వసాంగత్యంబు నెఱింగించెద నాదియందు మే మాఱు వురము నిషధపతి పుత్రులము సుబాహు పరబాహు దీర్ఘబాహు లోచన దీర్ఘకాయ దీర్ఘజంఘ దీర్ఘోష్ఠులను నామంబులు వహించి 36

క. వనమునను శౌర్యకర్మం
బున బాణశరాసనములు పూని తిరుగుచున్
ధనికుఁడగు వైశ్యునొక్కని
దునిమితి మీ రావిమొదల దుర్దమవృత్తిన్. 37

క. శరజన్మదర్శనార్థం
బరుగుచు మన్మాతులుఁడు దయామతి మమ్మం
దరఁ బిలువ దైవవశమున
సురుఁగున వెడలితిమి మామఁ జూడను మౌనీ! 38

గీ. ఒనరఁ గార్తీకకృత్తికాయోగమునను
ధర్మమభివృద్ధిగఁ గుమారదర్శనంబు
మాతులానుజ్ఞఁ జేసిన మహిమ వలన
విప్రకుల(జుల)మై ప్రభవింపగలిగె. 39

గీ. పూర్వకర్మానుకృతముగఁ బుణ్యపాప
మొందు నేదేశకాలము లందునెందుఁ
దీర్థయాత్రాప్రయుక్తమృతిప్రసక్తి
నీద్రుమం బాశ్రయించితి మిద్ధతేజ. 40

చ. మునుకొని పూర్వకర్మ భవమోచనమున్ భవదీయదర్శనం
బున ఫలియించె సంతసముఁ బొందితి మిప్పుడు పూర్వజన్మవా
సన లెఱుగంగనయ్యె నిక సత్యము ముక్తులమైతి మంచుఁ బ్రే
మను దగ బ్రహ్మరాక్షసులు మౌనికి మ్రొక్కి నుతింపుచుండఁగన్. 41

కూష్మాండుల పూర్వచరిత్రలు

గీ. అపుడు కూష్మాండు లిట్లని రనఘ! మేము
దొరయు నుచ్ఛిష్టభోజి భద్రుండు నీర
సుండు హీననామకుఁడు నిష్ఠురుఁడు తగ ని
రాశ్రయుండు శాస్త్రాద్వర్తుఁ డనఁగఁ బరగి. 42

గీ. సప్తకూష్మాండ చయమును సప్తవటవి
శాల శాఖలనుందుము జననుతాత్మ
విశదముగ మా తెఱంగెల్ల వినుమ యనుచు
నెలమి నుచ్ఛిష్టభోజి తా నిట్టులనియె. 43

క. ధీయుక్త! యహిచ్ఛత్ర
చ్ఛాయాపురగృహమునం బ్రశస్తత వివిధా
మ్నాయజ్ఞ కళింగాఖ్యుఁడ
నాయతధృతి వీతిహోత్రు నాత్మోద్భవుఁడన్. 44

శా. చాముండీఘనదేవతాభజనుఁడన్ సద్వేద పద్యేతర
వ్యామోహుండ బిశాచయక్షఫణిపూజాసక్తుఁడన్ (రక్తుఁడన్)
సోమోచ్ఛిష్టదురాన్నభక్షణుఁడ విష్ణుస్తోత్రదూరుండ నిం
దామోదాత్ముఁడ దుష్కృతంబునను గూష్మాండుండనైతిన్ దుదిన్. 45

సీ. అనిన భద్రుఁడుపల్కె ననఘ! భీమనదీ త
టంబున నీలాహ్వయంబనంగఁ
దనరిన సుక్షేత్రమున నుండు జైమిని
గోత్రుండు నిశ్శంకు కూర్మిసుతుఁడ

రోమహర్షణుఁడ ధారుణిలోనఁ బరగు పా
షండసంసర్గచే శాస్త్రవిధులు
చదువుచు భైరవీచక్రం బొనర్చి య
ష్టాదశవర్ణుల సరవి నొక్క
గీ. జాడనుండఁగ నియమించి జాతి సంక
రముగ భామిను లేకరూపమును బురుషు
లెల్ల నొకరూపునని తత్త్వ మెఱుఁగునట్టి
భ్రాంతిఁ గల్పించి చరియింతుఁ బాపబుద్ధి. 46

క. ఇలఁగల శాస్త్రపురాణం
బులు దూషింపుదును భోగములు సుఖదుఃఖం
బులును నచరచరముర? వలె
కలవని పల్కుదును బుణ్యగతి లేదందున్. 47

గీ. ఆత్మయే మోక్షమనుచు మిథ్యావిహార
కలన జనముల బోధించు కతన నంత
మునను కూష్మాండదుష్కర తనువు గల్గె
నిర్మలస్వాంత! యనునంత నీరసుండు. 48

సీ. తలవంచుకొని సిగ్గు దొలుకఁగ గద్గది
కాభాషణంబుల ననియె నిట్టు
లేఁ దొల్లి యవన మహీస్థలి మాలతీ
పురమున సుద్యుమ్ను వరసుతుఁడను
మాననీయుఁడను విమలపుణ్య! తిగ్మద్యు
తీయనుపేరి ధాత్రీసురుండఁ
బిన్నతనమునందె పితృవిహీనుండనై
విరసవిక్రియలచే వెలయనుందు

గీ. గొఱ్ఱెలను మేకకదుపుల గోచయమును
బఱ్ఱెలను గల్గి వేఱ్వేఱఁ బాలు పెరుగు
ఘృతము నమ్ముదు నెన్నఁడు నతిథి కిడను
డింభకులకైనఁ బోయను దంభమతిని. 49

గీ. రమణ నిరువది నాల్గు కుంచముల మాత్ర
మైన సద్యోఘృతంబు శ్రీహరికి నొక్క
దినము నందైన నిడజాల దీపమాత్మ
భుక్తికై యింతయును గొన బుధవరేణ్య! 50

క. మేకల గొఱ్ఱెలఁ గోడెలఁ
బ్రాకటముగ విక్రయించి బహుళధనంబుల్
చేకూర్చితిఁ దత్కృతమున
నీకుటిలాకారగతి వహించితి ననఘా! 51

క. అనినీరసుండు చెప్పినఁ
దన తెఱఁగెఱిగింప నాత్మఁ దలఁచి మునికుమా
రున కెంతయు హీనాఖ్యుఁడు
మునుకొని వందన మొనర్చి ముదమునఁ బల్కెన్. 52

క. ధీరమతి నొక్కయూరికిఁ
బౌరోహిత్యం బొనర్తుఁ బ్రజ కందఱకున్
నేరుపుదు వేదమంత్రము
లారయ దానప్రతిగ్రహములఁ జరింతున్. 53

వ. మఱి యష్టాదశవర్ణంబుల వారికి మౌంజీవివాహాదిసత్కర్మలు చేయింతు నపరక్రియ శ్రాద్ధకర్మంబు లాచరించున ట్లొనరింపుదు సంక్రాంతుల వైతరణీ గోదానంబు లనేకంబులు పట్టుదు నేకోపదిష్టశ్రాద్ధంబులు భుజియింతు. శూద్రులకై గ్రహణవేళల పాయసాన్న భక్షణంబొనర్తు

సంధ్యానుష్ఠానంబులమఱచి హరిధ్యానపరాఙ్ముఖుండనై వర్తింతు.
తత్కర్మవిపాకంబునఁ గూష్మాండయోనింజన్మించి యీ మఱ్ఱిచెట్టున
నున్నవాఁడననిన యనంతరంబు నిష్ఠురుం డిట్లనియె. 54

సీ. మునిపుత్ర! చండకుండనువాఁడ దౌహిత
కులసంభవుఁడు సుభర్గుని సుతుండ
బహుధనాఢ్యుఁడ వేదపారగుండను వైశ్య
వృత్తి నర్థాపేక్ష వృద్ధి పెంతు
గురునకు నప్పిచ్చి విరివిగా వడ్డివ
చ్చిన నిష్ఠురము లాడి పెనుచుకొందు
నంతనాఘనుఁడు భార్యాయుక్తుఁడై కాశి
కేఁగి సిద్ధిని బొందె నిచట గురుత
గీ. నూజుఁ డపరక్రియలొనర్ప నోజసమున
నడ్డగించితి సొమ్ము దెమ్మనుచు నతని
భార్య గదుమగా ఁబట్టితి ఁబనులు సేయఁ
దత్కృతంబునఁ గూష్మాండతనువు గలిగె. 55

వ. అనిన నిరాశ్రయుండనువాఁ డిట్లనియె. 56

క. మౌనినుత! యేను మిత్రుని
సూనుఁడ గార్గేయగోత్రజుఁడ గో ధన స
న్మానాది దానవిదితుఁడ
పూనిక నాగాహ్వయోరుపురమున నుందున్. 57

మ. ధనమార్జించియు విత్తలోభమున మిత్రవ్రాతమున్ దల్లినిన్
జనకుం బంధుల వీడనాడుటయు నోజం దల్లిదండ్రుల్ మనం
బున దుఃఖించుచు దిక్కులేక మృతులై పుణ్యాస్పదామర్త్యలో
క నియుక్తిందగి రాదురాహ్వామున జోకంగంటి దుర్భావమున్. 58

వ. అనియె నంత శాస్త్రోద్వర్తనుం డిట్లనియె. 59

క. సచ్ఛాత్రత్రయమునఁ బ్రక
టచ్ఛవి నేనుండుఁ గుక్కుటగ్రామమునన్
సుచ్ఛాయసుతుఁడ బేరు స
కచ్ఛుఁ డనాఁ బరగి వేద గర్వితబుద్ధిన్. 60

గీ. కణఁగి శాస్త్రపురాణముల్ గల్లయనుచుఁ
దత్ప్రకారంబు నుడువ నధర్మయుక్తి
నొండు తెఱఁగున వర్తించుచుండు కతన
నఖిల జనులు శాస్త్రోద్వర్తుఁ డనఁగఁ బరగి. 61

వ. కూష్మాండుండనై వర్తింతు నిట్లేద్గురము దైవకృతంబున నిన్నుఁ గాంచి సద్గతులు గంటిమి. మా పూర్వజన్మప్రకారంబు వినుము తొల్లి నాగాహ్వయ పట్టణంబునఁ జంద్రవంశంబునం బుట్టిన సుబర్హుండను రాజు నందనులము. అనంతబాహుబలపరాక్రమంబునం బ్రజాపాల నంబు సేయుచున్నఁ బల్లియలు చోరులచేత హరింపబడినఁ దద్వధా ర్థంబు శస్త్రపాణులమై వెనుతగిలితి మా నిశాసమయంబున. 62

గీ. చోరు లొకకొంద ఱొకత్రోవఁ బోరుచుండి
మమ్ముగని భీతిఁజెంది యా మఱ్ఱిక్రింద
నున్నవారల బంధించి రెన్న భటులు
తాము కోపించ వార లుద్దండగతిని. 63

క. మదకరుల చేత నందఱ
మృతులం గావించుకతన నీవటతరు వా
స్పదముగఁ గూష్మాండులమై
యొదవిన దుర్వర్తనమున నుండుదు మనఘా! 64

వ. అనిన ననంతరంబున శాకినీగణమ్ము లమ్మునికుమారున కభిముఖులై యిట్లనిరి. 65

శాకినీ గణముల పూర్వచరిత్రలు

సీ. దలముగ శాకినీత్వముఁ జెంది శాల్మలీ
స్థలమున నున్న మా చరిత వినుము
జానుశిరుండనాఁ జను బ్రాహ్మణుఁడ మున్ను
కౌండిన్య గోత్రుండ ఘను సుగల్బుఁ
డను విప్రసుతుఁడ నే నర్చిష్మఁ డనువాఁడఁ
దగు కర్మమున దరిద్రము వహించి
సరవి కుటుంబపోషకశక్తతను జెంది
బహువిధకృత్యసంపాదినగుచుఁ

గీ. బిదప హేమపురంబునఁ బ్రీతిఁ జేరి
యచట పుణ్యోపజీవినై యనుదినంబు
తగిలి వర్తించి బహుపదార్థములు గోరి
యుండి పెద్దల సంగతి నొక్కనాఁడు. 66

వ. దానయజ్ఞతపోతీర్థంబులచేత శ్రుతిస్మృతేతిహాసంబులచేతఁ బుణ్యఫలదంబని వచియింపంబడు ద్వాదశీవ్రతంబు ద్వాదశవర్షంబులు నాచేత చేయంబడియు సర్వాధికుండును నసంశయుండునునగు విష్ణున కర్పణంబులు సేసియుండితి మఱియును 67

గీ. మాతృగమనంబు పితృవధ మాంసభుక్తి
యన్యధనహృతి పంచమహాఘ ధేను
హననమున కంటెఁ(దలపంగ) నధికదోష
మన్న మేకాదశిని భుక్తమయ్యెనేని. 68

గీ. అవని గతిహీనులయిన పాపాత్ములకును
కథిత మేకాదశీతిథి పితరులకును
మోక్షదంబగు నది ధనాపేక్ష వైశ్యు
నకు నొసంగితి నేమి విన్నప మొనర్తు. 69

క. ద్వాదశవార్షికకృతమగు
ద్వాదశియందలి వ్రతంబు తగ మెచ్చింపన్
ఖేదంబుతోడఁ బితృగణ
మాదట యమసదనమునకు నరిగె మునీంద్రా! 70

ఉ. చేకొని ధర్మవిక్రయము సేసిధనంబు హరించి యర్భకా
లోకనబుద్ధిచే నడవిలో నొకడన్జనుచుండఁ దస్కరా
నీకము కట్టి కొట్టి యవినీతి పదార్థముపుచ్చుకొన్న నే
నాకులవృత్తినొందితి మహాఘము సేయునతండు క్రుంగడే! 71

గీ. పితరులందఱు వెస నధోగతికిఁ జనిరి
ధనము చెడిపోయెఁ బుణ్యమంతయును బొలిసె
నేను తత్కర్మవశమున నిట్టిగతిని
వనమునఁ జరింపవలసె పాపము మునీంద్ర! 72

సీ. చర్చింప నూరుదేశశిరుండు మా మేన
మామ క్రూరుండు దుర్మార్గరతుఁడు
శాండిల్యమునిగోత్ర జన్ముండు దేవకీ
ర్తికిఁబుట్టి ధర్మనామకుఁడు వీఁడు
హేమనామకపురిం బ్రేమతో వైశ్యోప
జీవియై వర్తనచేఁ జరించు
ద్వాదశాబ్దంబు లాతండు నాతోఁగూడఁ
జరియించె స్వకుటుంబభరణమునకు

గీ. నర్థమాశించి జాహ్నవీ యాత్ర మున్ను
చనిన దశవారఫల మూరుజన్మునకు నొ
సంగి విత్తాఢ్యుఁడై చోరజనముచే మృ
తంబునుం జెంది శాల్మలీస్థలి వహించె. 73

గీ. భుజశిరుండు తృతీయుండు పూర్వమునను
పద్మరుచ్యభిధానుఁ డుద్భవముఁ జెందె
వాజినామీసుతుండయి వరలు ఋక్ష
గోత్రుఁ డీతని చరిత విచిత్ర మరయ. 74

క. ఘనుఁ డితఁడు భాగినేయుఁడు
విను హేమపురంబులోన విఖ్యాతముగా
మును శిష్యుల కధ్యయనం
బొనరించెను ద్వాదశాబ్దములు చిరకీర్తిన్. 75

క. ఆపుణ్యక్రమ మూల్యము
వైపుగ శిష్యార్పణము సవంచనధనమున్
జేపట్టి నన్నుఁగూడక
యేపున నిజపట్టణమున కేఁగెడి వేళన్. 76

వ. చోరులవలన మృతింబొంది భుజశిరుండయ్యె. 77

సీ. విద్యోపజీవనవృత్తి విప్రునకని
శ్రుతిచాటు శిష్యులంచితము గాఁగ
గురువులకై ప్రేమ నిరవొంద నిచ్చిన
ధనమర్థమనుచు వేదములు చాటు
వరవిప్రబాహుజవైశ్యసంతతిచేత
నధ్యాపకునిచేత నతులశాస్త్ర
వేత్త యొసంగిన విత్తంబు షష్ఠాంశ
మర్థంబటంచు బుధాళి నొడువు
గీ. జీవికులలోన షష్ఠాంశ మర్థమనుచుఁ
దెలుప విద్యోపజీవిక ద్వివిధ మనుచు
వేదము వచించునపుడు వేర్వేరఁ జెలఁగి
(పాదము లోపించినది) 78

వ. వేదాంగపంచకంబు శిష్యులకు కాలద్రవ్యహితంబు సేసి యెవ్వండధ్య
యనం బొనర్చు నతండు విక్రియుండు నతిపాపి కులసహితంబు
విష్ఠాకూపరౌరవంబులు కల్పసహస్రంబు లనుభవించి ఢాకినీత్వంబుఁ
జెందుననివేదాంతోక్తి యదిగావున నితండధ్యయన సుకృతంబు
క్షత్రియునకిచ్చి విత్తంబుగొని నాతోడంగూడి చోరులచే మృతుండయ్యెఁ
దత్కర్మంబున భుజశిరుండన ఢాకినియై శాల్మలీద్రుమంబున
వసియించె. 79

క. పైతృష్టసుఁ డతిదుర్మదుఁ
డాతతబహుశాస్త్రి సుబలుఁ డనుపేరిటి వి
ఖ్యాత భరద్వాజాన్వయ
జాతుండు దరిద్రమొంది చలిత హృదయుఁడై. 80

క. నాతోడ హేమపురమున
కేతెంచు(చు) యజ్ఞఫలము లిచ్చి పరార్థం
బాతతముగఁ గొనె వైశ్యుని
చేతను దత్కర్మఫలముఁ జెంది వనమునన్. 81

వ. ననుంగూడి చోరులచే మృతుండై కపిశిరుండనా శాల్మలి ప్రాప్తుండయ్యె

సీ. మాతృస్వసేయుఁడీ మనుజాశి సంకృతి
గోత్రుండు నధ్యయనసుపుత్రుఁ డాఖ్య
సంకృతినాఁగ నిచ్చలును నాతోఁగూడి
హేమనగరికి విత్తేచ్ఛ వచ్చి
మున్ను ప్రాతఃస్నానములు తులామాఘంబు
నందునఁ జేసిన యాఫలంబు
గరిమ ధారాపూర్వకముగా నృపాలున
కొసఁగి యాతనిచేతఁ బసదనంబు

గీ. నంది చోరులచే మృతిఁ బొంది యిచట
ఢాకినీరూపమై ప్రకోష్ఠమున శిరము
(గలిగి విటపి) మాతోడ సంగతి వహించె
షష్ఠుఁడైన మదాత్మజు చరిత వినుము. 83

మానిని :

మాతులగోత్రజుఁడు (ంకు) సనాముఁడు మన్మఁడు నాకిల హేమపురం
బీతఁడు చేరి యపుత్రులకున్ (గతి) యేనని ముప్పురకేరుపడన్
(బ్రీతిగ) నౌరసజుండ నటంచు నభీష్టధనంబు వహించి చనన్
భాతిగ చోరులచే మృతిఁ బొందిన పాతకిఢాకినియయ్యెనిలన్. 84

సీ. సప్తముండు కుసుండు సఖుఁడు శ్రీవత్సగో
త్రజుఁడు వాచస్పతి తనయుఁ డగుచు
హేమపురంబులో నితఁడనాథప్రేత
సంస్కార మూల్యంబు సంగ్రహించెఁ
జను ననాథప్రేత సంస్కారమున కోటి
యజ్ఞఫలంబగు నన్నమాట
వినియుఁ బంద్రెండేళ్ళు చన మత్సహాయుఁడై
యిచట మృత్యువుఁ బొంది యీద్రుమంబు

గీ. కడను పార్ష్ణిముఖుండనా గణన గాంచె
నాదిఁ గైలాసమున శివుం డానతిచ్చె
గౌరికిని పుణ్యము పరోపకారమనియు
నర్థి పాపమె పరపీడ యనియు మిగుల. 85

వ. సాధువుల కేది కర్తవ్యంబు దుర్మార్గుల కేదియవకార్యంబు మద్వృత్తాం
తంబంతయు నీ కెఱింగించితిమి యుష్మత్కృపచేత సుఖావాప్తులమని
ఢాకిను లూరకున్న గృధ్రశిరస్కు లిట్లనిరి. 86

క. మును తుండిలాహ్వయుండను
ఘనగంధర్వుఁడను దేవగాయకుఁడ మహా
వనినాయక! యొకనాఁ డిం
ద్రునిసభ కేఁగితిని యేపుతోటి మదమునన్. 87

వ. పోయి యచ్చట. 88

క. గరుడోరగ ముని విద్యా
ధర మను వసు రుద్ర దైత్య దానవ యక్షా
మర కింపురుష వియచ్చర
నరనాథులు నింద్రసభ ఘనద్యుతితోడన్. 89

క. నానాధ్యానపురాణ రు
తానకపుణ్యప్రసంగ మమరెడు తఱి నేఁ
బూని కళావిద్యాసం
ధానకృతిచేత దుర్మదంబున నచటన్. 90

సీ. మునివర్యుఁడగు మతంగునితోడఁ దత్కృత
సంగీతశాస్త్రలక్షణము లెల్లఁ
గాదని యేనహంకారత మత్సమా
నుండు లేడంచు నేనుడువఁ గినిసి
నీవు గర్వంబున నిందించి తదిగాన
భువిని క్షత్రియుఁడవై పుట్టుమనిన
సరవితో భోజవంశమున రుక్మరథాహ్వ
యున కేను శృతకీర్తి యన జనించి
గీ. రూపవిద్యాఢ్యుఁ డనఁగను రూఢిగాంచి
నిష్ఠురాహంకృతిని విప్రనింద సేసి
పూని విష్ణుదినత్రయంబునను బుధులు
చాలు మానుమనంగను క్షౌరకర్మ
మొనరిచి (యట) ప్రవర్తిల్లుచున్న యెడను. 91

మ. ఘనుఁ డాహైహయవంశ్యుఁ డర్జునుఁడు వీఁకన్లోకముల్ గెల్చి తా
నను గెల్వన్ మదిగోరి వచ్చినను నానా సేనలన్ గూర్చి నే
ననుమానింపక దుర్మదంబునను బాహాశక్తిఁ బోరంగ నా
జినిఁ బాదంబులు ద్రుంచి వక్షము పగిల్చెన్ గ్రోధసంరూఢుఁడై. 92

క. దురమునఁ దనువు దొఱంగిన
హరిదినమునను క్షౌరమొౌకతనన్ భూ
సురు నిందించిన దుష్కృతి
పొరసిన నేనీయవస్థఁ బొందితి ననఘా! 93

చ. అనవుడు వ్యాఘ్రవక్త్రుఁ డపు డాతనికిట్లను మత్స్యభూమికిన్
జనపతి దుష్టకేతునకు సంభవమొందితి నూర్మిళుండనాఁ
జను ఘనపాపవర్తనుఁడ శౌర్యుఁడ వాయునిపీడితుండనై
యునికిని తైలమంటుకొని యుండుదు నిత్యము దేహయాత్రకై. 94

సీ. అభ్యంగనంబు నే హరిదినంబునఁ జేయఁ
గొదవను వ్యాఘ్రముఖుండ నైతి
నిక వృక్షవాసంబు హేతు వెఱింగింతు
నధిపతియగు చైత్రరథుఁడు కాంతి
మతి యను సుపుత్రి నెమ్మనమున వైదేహ
నరపతికై స్వయంవర మొనర్ప
నపహరించితి మే మఖిలరాజులు చూడ
నపుడు విదేహధరాధిపతియుఁ

గీ. గోపఘూర్ణితనేత్రుఁడై కూడముట్టి
యడరి మద్బలమెల్ల మాయంగఁజేసి
చేరి ననుఁబట్టి తల పంచశిఖలు గాఁగ
శరమునను గొఱిగి విడిచెను కరుణతోడ. 95

క. ఆ యువతీమణిఁ గైకొని
పోయెం దనపురికి నందపొరలుచు మతినే
నీయెడ నుండితి నగరికి
యేయనువునఁ బోదుననుచు నెంతయు లజ్జన్. 96

గీ. పగటివేళల వనములోపల వసించి
రాత్రి వృక్షము చేరంగరా మహోగ్ర
సింహమొక్కటి నన్నుఁ ద్రుంచినను వ్యాఘ్ర
వక్త్రుఁడన నిట్టి శాకినీత్వము వహించె. 97

వ. తదీయవాక్యానంతరంబున కదంబకత్రయం బిట్లనియె. క్షత్రియోత్తముం
డగు కుంతిభోజు పుత్రులము నీలకేతు పీతకేతు చిత్రకేతులనువారము
శౌర్యోదారంబుల నింద్రసములమై చరియింతుము 98

మానిని :

వీటజనుల్ దగుసాధనముల్ గొని వెంటఁగణంకల నంటిచనన్
ఘోటకకుంజరవీరభటుల్ దముఁగొల్వ విభూతిదలిర్పగ న
య్యాటవికోక్తపథంబున వన్యవిహారముసల్పి విదాహముతోఁ
బాటిల నొక్కనదింగని తోయము పానము చేసితి మందఱమున్. 99

శా. ఆ శోణానదిపొంత రంజిలెడు కృష్ణావాసముంజూడఁ ద
ద్దేశానీతమహావ్రతుల్ మునివరుల్ దేవార్చకుల్ సింధుజా
ధీశున్ బూజ (యొనర్ప) కార్యభజనాధిక్యోక్తి వారిన్ మదా
వేశం బాత్మజనింప దేశికవరున్ వే చీఱి కోపంబునన్. 100

మ. జనసంపూజ్యులఁ బార్థివోత్తములఁ బూజల్ మున్నుగాఁ జేయ కే
మనుజాళుల్ హరినిన్ భజించెదరు ప్రేమన్ మమ్ముదండించు మం
చనుమానింపక శిక్షసేయుచుఁ దదీయార్థంబు దైవస్వమున్
ధనవాంఛాత్ములమై హరించితిమి మానంబొప్పి సంధిల్లఁగన్. 101

వ. దేవద్రవ్యం బపహరించిన దోసంబున మృతింబొంది బహుయాతనల బహువిధంబుల బహుకల్పంబులనుభవించి శాకినీయోనినాశ్రయించి గృధ్రశిరస్కులమై కదంబాశ్రయుల మైతిమి పూర్వంబున మేము యవన పుత్రులమై వర్తిల్లుచుండి 102

గీ. గర్భిణీస్త్రీలఁ దెచ్చి యీ కడిమి తరువు
క్రిందఁ జైత్రాగమనమునఁ గ్రీడసలుపఁ
బోవ మేఘంబు లంబరంబున నమరుచు
బల్లిదంబుగ(రేఁగి) గర్జిల్ల, నపుడు. 103

వ. అశనిపాతంబునం జేసి పంచత్వంబునొందిన కతంబున నీవృక్షంబున శాకినీరూపంబున నుండవలసె నన ననంతరంబ మేడినాశ్రయించి యున్న ప్రేత లమ్మునిపుత్రున కిట్లనిరి. 104

ప్రేతల పూర్వచరిత్ర

క. నుతపుణ్యశీల! వంగ
క్షితితలమున నందవరవిశిష్టపురమునన్
ప్రతిభసుఘోషుల మనఁగాఁ
జతురత మించితిమి విప్రజన్ముల మగుచున్. 105

క. యములనఁగఁ బ్రబ్జఁగంటిమి
సమవిద్య సమానశౌర్యసంపదలను వి
క్రమమున నిలయేలుచు భూ
రమణుల క్రియ వెలసితిమి యరాతులు బెగడన్. 106

క. మాచేతఁ బ్రజలు బంధితు
లై చెదరి పరస్థలముల కఱుఁగ మిగుల దు
ర్వైచిత్ర్యలీల నొకనాఁ
డేచిన తమకమున నడవి కేఁగినయంతన్. 107

చ. చెలఁగి వసంతవేళ విలసిల్లిన చంపకకింశుకావళీ
విలసితసుప్రసూనములు విస్ఫుటమై తగఁ గోకకాకలీ
కలకలరావముల్ బహుముఖంబుల నధ్వరశాలపంక్తులన్
వెలయఁగ బంభరధ్వనులు వీనుల కింపుదలిర్పుచుండఁగన్. 108

క. చనిచనిముందట శృంగం
బనుపురి చేరువను సైరికాగ్రణిసుతులే
పున డేగవేఁట లాడఁగఁ
గని వారల డేగ నిమ్ముగా నడుగుటయున్. 109

క. ఆయిరువురు శూద్రసుతుల్
గాయకులై పక్షినియ్యఁగా జాలక లో
నాయుక్తిఁ బర్వ వెసఁజని
కూయిడగాఁ జంపి డేగఁ గొంటిమి కినుకన్. 110

సీ. అద్దోషముననిట్టి యాకారములు గల్గె
నదియును గాక ము న్ననఘ! వినుము
కౌశికుండు మఖంబు గావించుటకును సొ
మ్మడిగె మేమది విని హాస్యమొదవఁ
బరిహసించితిమి తాపసియును నలిగి డ
క్కన మేడికడనీల్గు డని శపించె
నంత చిత్రరథుని యాత్మజుల్ గంధర్వు
లంగనాసహితులై పొంగి మద్వి
గీ. హారవనమునఁ గ్రీడింప నదరి వారి
దండితులఁ జేయఁ జిత్రరథుండు కినిసి
చంచ దుగ్రాసిఁ గంఠముల్ ద్రుంచి చనియెఁ
గావున నివాసమున కిది కారణంబు. 111

వ. అని యష్టావింశతి బ్రహ్మరాక్షసులు తమతమ విధంబు లెఱింగించి రప్పుడు 112

ఉ. కందువ మీఱ నిట్లు గతకల్మషులైన పిశాచులింపుతో
నందఱు గూడి యమ్మునివరాత్మజమౌళికి భక్తియుక్తిచే
వందన మాచరించి జనవందిత! నీ కరుణాకటాక్షవీ
క్షందెలివొంద చిత్తములు సర్వశుభంబులు గాంతు మింకిటన్. 113

గీ. అనఘ! మత్ప్రమాదాబ్జసుధాంశుమూర్తి
వమితశోకాబ్ధి యానపాత్రమవు దుష్కృ
తాంధకార ద్యుమణివి మహావిభూతి
దాయకుండవు నిన్నెంచఁ దగు మహాత్మ! 114

క. సంసారదర్పణస్థిత
హింసాకృతులనఁగఁదగు మాకు నిపుడు మునిలోకో
త్తంస! ప్రియమొదవ కంస
ధ్వంసి సుమంత్రౌషధంబు దయనొసఁగఁ గదే! 115

చ. మునికులధామ! నిర్జరులు మోదముతోడ ననేకధర్మవా
హినులు తరించనట్టి వెఱవేమియు గానకయున్న నిత్యశో
భనులు భవత్సమానులగు భాగవతుల్ హరిభక్తిసత్పథం
బునఁ దరియింపఁ జేసిరి యపూర్వము నీ చరితంబు బ్రాహ్మణా!

వ. అదియునుంగాక మీవంటిసత్పురుషుల సేవంజేసి మావంటి కఠిన చిత్తులు దుష్కృతంబులంబాసి సమస్తార్థంబులం బొందుదురని శ్రుతి స్మృతుల వినంబడుంగావున యుష్మదాదులయందు యజ్ఞంబులయందు గోగణంబులయందు నేకారణంబున మాధవుండైన విష్ణుండు సంసార భూతి నపహరించు భవత్సదృశుల సాంగత్యంబున ననేకజన్మార్జిత దురితనాశంబగు మహానుభావులు సమదర్శనులైన భగవద్భక్తులు గదా

లోకదుర్లభులనం బరగుదురు. క్షేత్ర తీర్థదేవతాంగణంబులు సేవచేతం
బావనంబులుగా నొనర్చు విగతపాపులు మదవర్జితులయిన మహాత్ములు
దర్శనంబున లోకపావనంబ సేయుదురు. సత్పురుషసాంగత్యంబు
రక్షణంబున శుభంబిచ్చు నిట్లు గావున 117

క. నినుఁ గాంచినఁ గలుషంబులు
చనియెను సంపదలు గల్గె జననుత! యనినన్
విని(ముని) పుత్రుఁడు వారల
వినయంబుల కలరి పల్కె విశ్రుతబుద్ధిన్. 118

సీ. వెఱవకుం డింక శ్రీవిష్ణుప్రసాదంబు
వలన మోచనమయ్యెఁ గలుషచయము
అశరీరి పల్కిన యనువున నరసింహ
మంత్రరాజంబు సమ్మతిఁ బఠించి
కాదె యింతకు మున్ను కఱఁగి మీ రొదవించు
భయముఁ బాసితి హరిభక్తిఁ జేసి
కావున మీరును కాశికానదియందు
నెనయ మాఘావగాహన మొనర్పఁ
ఆ.వె. దతుల శుద్ధభాగవతులకు శ్రీరమా
పతి యొసంగు నిఖిల భద్రచయము
లనుచు వేఱువేఱ నందఱఁ గులగోత్ర
నామకములు వర్తనములు నొడివి. 119

వ. మృత్తికాస్నానంబులు చేయించినంజేసి మహాతేజోవిరాజితులై తత్ క్షణం
బున పూర్వకర్మసంచితదేహంబులు విడిచి శుద్ధకర్మజ్ఞానులై పూర్వ
దేహంబులు ధరించి యొండొరుల ముఖంబులు వీక్షింపుచు నత్యంత
సంతోషచిత్తులై తమ తమ గోత్రనామంబులు చెప్పుకొని యమ్ముని
హృదయుపుత్రునకు వందనంబాచరించిన సుయజ్ఞుండును వారల
లేవనెత్తి యాలింగనం బొనరించె. తదనంతరం బాశాండిల్యాశ్రమ
సమీపంబున 120

ఉ. నక్కలుగూసె ఘూకములు నాదమొనర్చె మహాద్భుతంబుగా
దిక్కుల ధూళి గప్పె సముదీర్ణతఁ బర్వెను రక్తవృష్టియున్
జుక్కలు పెల్లుగా నురలెఁ జోద్యముగా నవియెల్లఁ జూచి పెం
పెక్కిన ప్రేమ మౌని తరళేక్షణ వల్లభుఁజూచి యిట్లనున్. 121

క. మునినాథ! దుర్నిమిత్తము
లనేకములు గాననయ్యె నకట! సుయజ్ఞుం
డెనయన్ గడు బాలుఁ డొకఁడు
వనమునకుం బోయె నెపుడు వచ్చునొ యెఱుఁగన్. 122

క. పులిచేఁ జిక్కెనొ యేనుఁగు
లలవటగాఁ గదిసెనో మహాభుజగంబుల్
గలవచట యేమి యయ్యెనొ
తెలియఁగరా దనిన ముని సతీమణితోడన్. 123

క. తలఁకఁగ నేటికి యబలా!
బలిబంధనమూర్తి వానిపాలఁగలఁడు నేఁ
దెలిసి యిటువత్తునని శి
ష్యులు పుత్రులు నతని జాడ చొప్పుఁ దెలుపఁగన్. 124

క. క్రమమున మునిపతి యచలమ
తి మహాటవి యందుఁ గాంచె దివ్యపురుషమ
ధ్యమునన్ గ్రస్తవిముక్త హి
మ మయూఖునికరణి నున్న మౌనికుమారున్. 125

వ. ఇట్లు గాంచి గ్రుచ్చి యాలింగనంబుసేసి మూర్ధఘ్రాణంబొనర్చి శాండి ల్యుండు శిష్యవదనం బవలోకించి నీవువచ్చి తడవయ్యె నేమి కారణం బున నాలస్యంబయ్యె మదీయాశ్రమాంతరంబున దుర్నిమిత్తంబు లనేకంబు లుద్భవిల్లె నదిగావున నిన్నిట్లరయవచ్చితి ననిన సుయజ్ఞుండు తాను సమిత్కుసుమఫలార్థం బడవికిం జనుదెంచిన తెఱంగును నచ్చటి పిశాచగణంబుల వలననైన యుపద్రవంబులు

ఇక్కడ 79 సంఖ్య గల ఒక తాటియాకు గ్రంథము లోపించినది

శాండిల్యుని తత్త్వబోధ

ఆ.వె. ఉముకతోడి విత్తు సమకూడి మొలకయై
యదియ పిదప బీజమైన యట్లు
ప్రకృతి బిందుయుగము పరగంగ సంసృతి
కారణంబుఁ జెందు ఘనతతోడ. 126

వ. దగ్ధతుష మంకురత్వంబుగాని కరణి దగ్ధప్రధానాఖ్యలింగదేహికి జన్మంబు లేదు తన్మాత్రయుక్తభూతంబులు మనోబుద్ధ్యహంకారమహత్తులు దశేంద్రియంబులుంగల్గి సూక్ష్మంబును సత్యంబగు జగద్బీజంబు విష్ణుచే రక్షితంబగు కొందఱష్టావింశతి యనియును కొందఱు సప్తవింశతి యనియును మఱికొందఱు పంచవింశతియనియును కొందఱు త్రయ వింశతి యనియును తత్త్వప్రశంసయొనర్తు రివ్విశ్వంబు తత్త్వాత్మకంబని పలుకంబడు 127

సీ. స్ఫురదగ్నిశిఖలచే క్షోభమంది హిరణ్య
మలినంబడంగిన మాడ్కిఁ దోఁప
సత్కర్మకృత్యసుజ్ఞానంబు చేతను
గామంబు హతమయి క్రాఁగిపోవుఁ
దెలియఁ బ్రధానంబువలన జీవుఁడు బద్ధుఁ
డయి సుఖదుఃఖము లనుభవించు
వలనుగ సుఖదుఃఖములు హేతుకములుగాఁ
(బ్రతి) జీవి దేహాంతరములు దాల్చు
ఆ.వె. మును సుకర్మశీలమునఁ జెంది జీవంతుఁ
డగుచు నొక్కదివసమైన నొనర
నతఁడు దేహదశక యుతకారణముఁ జెంది
పొందుఁ దత్ఫల మనుభోక్తయగుచు. 128

వ. తాదృక్బంధమహాగుల్మమూలంబు సత్కర్మసంతతిచే నిర్మూలంబుగా దహించు ననలంబు వేణుగుల్మంబు దహించుపోల్కి కర్మంబువలన కర్మోత్పత్తియగు. తదీయ నిష్కృతికై భావితాత్ములగు మునులచే ప్రాయః చిత్తంబు పలుకంబడు నది జ్ఞానరాహిత్య జడజంతువుల కుపయుక్తం బగు జ్ఞానయోగంబుచే బంధగుల్మంబు సమూలంబుగా నదృశ్యంబగుం గావున 129

మ. అల గ్రీష్మర్తువు చేతఁ బంకము నిరాహారంబు సూర్యోదయా
కలనన్ జీకటి మాడ్కి జ్ఞానమొదవంగాఁ గర్మవిచ్ఛిత్తియౌ
విలసద్జ్ఞానము కర్మమూలమను ప్రావీణ్యోరువాక్పద్ధతిం
జలుపంగా వలయున్ నిరంతరము విశ్వాసంబు సంధిల్లఁగన్. 130

గీ. పూని కర్మవిహీనుఁడై జ్ఞానిగాంచు
నున్నతస్థాన మతిశయోద్వృత్తి నమరి
భువి నహంకార విహీనుఁడౌ పురుషవరున
కఖిలఫలములు చేరినయట్టి కరణి. 131

క. జీవుఁడు కర్మవిహీనుం
డై వరలిన నేమిఫలములంటవు నరునిన్
వావిరి ఫలభక్షణకృ
ద్భావన మోచాఫలములు వట్టిన కరణిన్. 132

సీ. గరిమ నభీష్ట మాకాంక్షించువారికి
కర్తవ్యమొక రెండుగా నెఱుంగు
సంధ్యాద్యనుష్ఠాన జడదేవపూజయు
నురుతరసంజ్ఞానియోగిచర్య
కర్మంబుచే క్షీణగతిఁ జెందు మృత్యువు
చిద్యోగి మోక్షలక్ష్మిని వరించుఁ
గారయితయును దత్కర్తయు ప్రేరకుం
డన సాక్షిచేతనుఁ డచ్యుతుండ

గీ. కర్మఫలదుండు భోక్తయుఁ గారకుండు
హరియని మనంబులోనమ్మి హర్షమొందు
నమ్మహాత్ముఁడు ప్రభవాబ్ధి నపహసించి
కర్మబంధాళివదలి మోక్షమును గాంచు. 133

వ. అది గావున సర్వవిద్యాకోవిదుండును నిస్సంశయుండును నగు గురునిం జేరి సర్వశాస్త్రాభ్యాసం బొనర్చి కర్మంబు లెఱింగి యాచరించి కర్మఫల త్యాగం బొనర్చి విష్ణ్వర్పణంబు సేయందగు దత్కర్మత్రయంబు గుణ భేదంబుల షడ్విధంబులై చెల్లు సాత్విక శుద్ధసాత్వికంబులు రాజస శుద్ధరాజసంబులు తామస శుద్ధతామసంబులు నన భిన్నరూపంబులై ప్రవర్తిల్లు రాజమనుష్యదేవగంధర్వపితరుల జ్ఞానకర్మంబులవలన నుద యించువారు సాత్వికులు హరియందు ననన్యమనస్కులై యాశ్రయించి యోగాభ్యాసవర్ధనులగువారలు శుద్ధసాత్త్వికమతులు తత్స్వాభిమాను లగు బ్రహ్మాదిదేవతలు రజోవిశ్ర(మంబు)పిదప గురుప్రసాదంబున శుద్ధభావంబునుం జెందిన జీవులు రాజసులనంబడు(దురు) ముక్తి కాములగు నరోత్తములు నిత్యసంసారులయ్యును సర్వారంభవిహీనులగు వారలు శుద్ధరాజసులు సత్యశౌచదయావిహీనమిశ్రమబుద్ధిచే ప్రగల్భ పరులగువారలు తామసులు ఇవ్విధంబున సంసారబద్ధులగుజీవులు మానుషసంజ్ఞం జెందుదురు దయావిహీనులై క్రూరాకారంబున భక్తిలేశ వివర్జితులగువారధోలోకవాసులగు శుద్ధతామసులు వీరలు యాతుధానా దులై దైత్య దానవయక్షరాక్షసులగుదు రివ్విధంబున బ్రత్యేకంబ షడ్విధంబులని విబుధులు చెప్పుదురు ప్రకృతిజీవులు వీరలు స్వాను రూపగుణరతులై తత్క్రియలు నిర్వర్తించి నిజగతింబొందుదురు సద్గతి ప్రాప్తికి నిశ్చయించుపురుషుండు ప్రయత్నంబున వర్ణాశ్రమాచార కర్మం బులయందు కర్తయు కారయితయు విష్ణుండని స్వతంత్ర వివర్జితులై సమర్పింపఁ దత్తత్ఫలంబులు తదాకారంబున నొసంగు. పిపీలికాది బ్రహ్మపర్యంతంబగు జీవులయందొకనియందు స్వాతంత్ర్యంబు లేదు

భక్షణమన నాఘ్రాణమన శ్రవణస్పర్శనంబులు భగవదధీనకృత్యంబులు నింక బహువాక్యంబులేల సర్వస్వతంత్రదేవేశుండగు పరమేశ్వరుండు గలుగ నహంకర్తయను జనుండు సుఖదుఃఖంబులయందు ననుసరించు చుండు నది గావున సర్వఫల నిస్పృహుండై స్వాతంత్ర్యకృత్యంబుమాని తత్కర్మఫలం బీశ్వరార్పణం బొనర్చు విచక్షణుండు కర్మపాశవిముక్తుం డగు దేశకాలక్రియలను విష్ణుసేవార్థంబు పరిచర్య లొనర్తునని సంకల్పం బునఁ జేసి కర్మంబు లొనర్పవలయు భగవదర్పణంబని సర్వక్రియలం బలుకవలయు శ్రుతిస్మృతిపురాణంబులు భగవదాజ్ఞాప్రామాణ్యంబు లగుట నివ్విధంబున విష్ణుధ్యానం బొనర్చుచు ననన్యమనస్కు లగువారు కర్మసిద్ధిం బొందుదురని తెలిపి మఱియును 134

గీ. భువిని రాజ్యాంగములచేత భూభుజుండు
కార్యతంత్రంబు నడిపించు కరణి శౌరి
తాను రాజయ్యుఁ దత్త్వాభిమానదేవ
తాఖ్య తనువులచే కర్మ మమరఁ జేయు. 135

వ. అది యెట్లనిన నవ్యక్తతత్త్వరూపధరులు భారతీసరస్వతులు బ్రహ్మ వాయువులు మహత్తత్త్వనియామకులు శచీపతి మనోభవులు మనస్తత్త్వ రూపంబులు. అవిద్యావ్యక్తతత్త్వంబని లక్ష్మి వచియింపంబడు మృగా హంకృతుండగు బ్రహ్మ హతత్వాత్మకుండు మనస్తత్త్వంబు పార్వతి కామేంద్రు లర్ధరూపిణులు దిగ్దేవతాచంద్రులు శ్రోత్రతత్త్వాభిమానులు .... ప్రాణతత్త్వాత్మకుండు సూర్యుండు చక్షురింద్రియాధిపతి వరుణుండు జిహ్వాఘ్రాణస్వరూపుండు పుణ్యాత్మ దక్షుండు పాదాత్మ జయంతుండు మిత్రుండు వాయ్వాధిపతి ఉపస్థాత్మమనువు శబ్దాత్మ బృహస్పతి అపానుండు స్పర్శతత్త్వాత్మ వ్యానుండు రసాత్మకుం డుదానుండు గంధాత్మకుండు సమానుండు వ్యోమాత్మ . . . గజవక్త్రుండు పవనుండు వాయుతత్త్వాత్మకుండు తేజస్తత్త్వాత్మకుండు వహ్ని జలాత్మకుండు వరుణుండు పృథివ్యాత్మ యుర్వి యీ దేవతలు విష్ణ్వధీనంబులై యుండు దురు 136

మ. చను విద్యామతి కాలశత్రులు ప్రతిష్ఠాపూరుషాభిప్రవృ
త్తి నుతి స్ఫూర్తియు మాయయున్ నియతియున్ కాలాహ్వాయం
బను పండ్రెండు హరిస్వరూపములు నవ్యక్తాభిధాత్యంతమౌ
ఘనతత్త్వాత్ములు దేవదానవు లనంగాఁ జెల్లు నార్యోక్తమై. 137

గీ. తగ శరీర శరీరస్థతత్వములను
ప్రేరణమునొంది హరిచేఁ దపింపఁ జేయు
క్రియల నీసత్వములను శరీరములను
నిలిచి విష్ణుండు క్రీడించు నిత్యుఁడగుచు. 138

క. హరి వాయుపురస్సరుఁడై
చరియించున్ సర్వభూతజాలంబులలో
నరసి జగత్కార్యంబులు
నిరతిం జేయించుఁ జేయు నిర్మలమతియై. 139

క. నరనాథుఁ డమాత్యునిపై
ధరణీసామ్రాజ్యభారదంబిడి కార్యా
చరణము లరసినగతి హరి
మరుదాయత్త ప్రపంచ మహిమఁ జెలంగున్. 140

సీ. అర్థి జీవాది విష్ణ్వంతంబు హరియుత్త
రోత్తరకర్తయై యొనరియుండు
సర్వక్రియావృత్తజనులకు వాయూప
హీనమై యుండిన వేనికరణి?
నఖిలజీవులు రమేశానుగ్రహము లేక
నిత్యస్వతంత్రులై నెగడఁ గలరె
యధికారహేతువు నగు ముక్తి వారల
కది ప్రేరణంబైన..... గల్గు

ఆ.వె. తత్త్వనామదేవతలకెల్ల హరి తాన
తన్మనోంబుజములఁ దగ రమించుఁ
గడిమి నెఱుఁగఁ దగునొ కర్తృత్వ మాక్రియా
ఫలముఁ గోరఁజనదు భావమునను. 141

ఆ.వె. ధర్మములకుఁ దల్లిదండ్రియు శ్రద్ధ యా
శ్రద్ధలేనియట్టి జనుల క్రియలు
తెలివిహీనమనిరి తెలివి నాస్తికబుద్ధి
గలిగి చేయవలయుఁ గర్మములను. 142

ఆ.వె. తగఁ గ్రియాళి యన్యథాభావమని సదా
యాడుచుండు నా నరాధముండు
నరకమున వసించి పరివేదనలఁ బొందు
కులజయుక్తుఁ డగుచు ఘోరముగను. 143

వ. శ్రుతిస్మృతివిచారంబును శ్రద్ధా సత్సంగతి దేవతాభక్తియుఁ గృత్యాకృత్య వర్జనంబును నియమంబులను షడంగంబులు సేయందగు కర్మంబులు ప్రతికాలప్రబోధనంబును శక్తివిమర్శనంబును మనఃస్వాస్థ్యంబును శుచిత్వంబును ననుచత్వారంగంబులు కర్తవ్యంబులు సకలకర్మంబులు విష్ణ్వర్పణంబు సేయుట ప్రధానంబు గండూష దంతకాష్ఠ శౌచస్నాన వస్త్రపరిధాన పుండ్రంబులు నను సప్తక్రియ లొనర్చి యంత కర్మాచరణం బొనర్పవలయు కర్మణాజ్ఞాయతే జ్ఞానాదేవ మోక్షంబను వాక్పద్ధతి జ్ఞానరాహిత్యకర్మకృత్యంబులు పూర్ణంబు కానేరవు వేదస్మృతిపురాణోక్త ఫలకర్మవిముఖులు మందబుద్ధులు నిస్సంగులు సర్వసుఖులనంబడు దురు లోకంబున జనని శిశు దోషప్రశాంతికై యౌషధంబిడందలంచి మున్ను గుడంబిడి యనంతరంబ యోషధిప్రయోగంబు చేయుమాడ్కి నిగమశాస్త్రంబులు కర్మ ఫలప్రతిపాదకంబులై ప్రవర్తిల్లు వేదత్రయం బులు సర్వక్రియసర్వ వర్ణస్వరంబులు సమాత్రావిసర్గానుస్వారపదం

బులు సుగుణసాంద్రుండగు విష్ణువునందు గౌరవప్రతిపాద్యంబు చేయు నితరదేవతాధీనంబులగుట యథాక్రమంబున సత్కర్మంబు లొనర్ప వలయు నది యెఱింగి వేదోక్తవిధి నెవ్వండాచరించు నతండు కర్మఫలా వాప్తుండగు నితరక్రియలనొందండు గావున కులీనుండయి యాది యందు సర్వంబువిమర్శించి యజ్ఞాదిసర్వధర్మంబులకు గురుసేవా పరుండు గావలయు నది గురుప్రసాదంబున క్రియాజ్ఞానయోగంబు లతని యనుజ్ఞచే నెఱింగి తద్యోగంబు సాధింపవలయు జ్ఞానంబుచే విష్ణుప్రసాదంబున మోక్షంబు ప్రాపించు. 144

క. అనయము విషయంబులయం
దనుగతివర్తించు నింద్రియంబులు వానిం
గినుకను జయించి పిదపన్
ఘనవైరాగ్యమున యోగిగాఁ జను గరిమన్. 145

చ. మును రిపుషట్కమున్ గెలిచి మోదముతో గృహమాశ్రయింపఁగాఁ
జను పురమాశ్రయించి నిజశత్రులనోర్చి సుఖంబుగాంచు నొ
య్యన విషయేంద్రియంబుల నయస్థితితోఁ గుదియించి చాలనే
ర్పున ఘనయోగి యోగగతిఁబొందు సుతత్త్వవిభూతిసంపదన్. 146

క. హరిదశ్వముఖ్యదేవత
లరయన్ గర్మాధికారులయ్యు నిజాత్మ
స్థిరవర్తికి హరికర్పిం
తురు మనుజులొనర్చు బలివిధులు సద్భక్తిన్. 147

క. హరిపూజావిరహితముగ
నరుఁ డన్యులఁ బూజసేసినన్ వాఁడు మహా
దురితాంభోనిధిలోపలఁ
బొరిపొరి దుఃఖానుభవముఁ బొందుచు నుండున్. 148

సీ. నరులెల్లఁ దమకర్పణము చేయుపూజయు
హరికర్పణము చేసి యమరగణము
దండించి వారలఁ దగు భవాంబుధిలోనఁ
బడద్రోయుదురు రాజభటులు చోరు
లను బట్టి వారల ధనమెల్లఁ గొని నాథు
ననుమతి దండించు ననువుమెఱసి
యది గావునను దేవతాంతస్థుఁడైనట్టి
హరికి నర్పించు పూజాదివిధులు
గీ. హరికి సిద్ధించు నితరదేవాళి విడిచి
విష్ణుని భజించి మదిని సేవింపవలయు
నెపుడు హిత మభిలషించు వా రెల్లశాస్త్ర
సముచితాచారవర్తనల్ సలుపవలయు. 149

మ. పరమేశాంశజు లీనిలింపులనుచున్ భావించి పూజాసమా
చరణల్ సేసినఁ దత్క్రియాఫలము లాచందాన సంప్రాప్తమౌ
నరుఁడీబుద్ధి యెఱింగి యోగమతి నానాధర్మకర్మంబు లీ
శ్వరసంతర్పణగా నొనర్చినను మోక్షప్రాప్తుఁడౌ పెంపుగన్. 150

గీ. గరిమఁ బూర్వోక్తమార్గుఁడై కర్మయోగి
భూరిమహిమను నిర్మలబుద్ధిచేతఁ
బరగు సుజ్ఞానమభ్యసింపంగ వలయు
నదియు సజ్జనసాంగత్యమైనఁ గలదు. 151

వ. వారలు సాధులు సమచిత్తులు మహాత్ములని యెన్నందగి యుండుదురు

సీ. ఇంద్రియంబులఁ గుదియించి నిస్పృహుఁడయి
భక్తిమంతుఁడు ధర్మపరుఁడు నగుచు
విశ్వాసపరతను విష్ణువునందుల
జిజ్ఞాస సేయంగఁ జెల్లునదియు

నంగశ్రవణ మననాధ్యానముల హరి
ఘనశాస్త్రముల నెఱుగంగఁ దగును
నలువుగా నితరమానముల సాధ్యుఁడు గాఁడు
(వేద)గమ్యుఁడు జగద్విభుఁడు నగుట

గీ. నిగమవేద్యుండు తెలియంగఁ దగినవాఁడు
చెలఁగి వేదానుగతశాస్త్రములను మఱియు
నతఁడు తర్కానుమానద్వయంబు వలన
నితరమగు ప్రమాణంబుల నెఱుగఁబడడు. 153

వ. ఈ జీవాత్మ యీపురుషు నొకప్పుడైన నవలంబించబడదు. ఎఱుగంబడ నివి యెఱుంగుటకతంబున వేదంబులు వేదంబులన విఖ్యాతంబయ్యె.

గీ. అరయ నుపక్రమాది చిహ్నములతోడఁ
దగ విచారించబడుచు వేదములు తామ
తామ సంఘర్షణమొనర్చుఁ దగ నెఱుంగఁ
జేయు నవియును దెల్పెదఁ జెలఁగి వినుఁడు. 155

గీ. అరయ నుపక్రమోపసంహారములను
బూర్వతాభ్యాసయుక్తులు పొరి సమాఖ్య
నా ప్రకరణంబు స్థానంబులన ఫలంబు
లనఁగ నివి మహావాక్యంబు లనిరి మునులు. 156

గీ. ఆ మహావాక్యములచేత నార్యజనుల
చేతఁ దాత్పర్య మెఱుగంగఁ జేయబడిన
యర్థములు శౌరి జిజ్ఞాస్యుఁ డనుచుఁ దెలుపు
నితరులకుఁ గాదటంద్రు విశ్రుతము గాఁగ. 157

వ. స్వాతంత్ర్యంబు లేకుండుట వలనను జ్ఞాననాశంబు వలనను దుష్టత్వాల్ప శక్తులవలనను ఇతర దేవతా జిజ్ఞాసాపరాధంబులు గలిగియుండుఁ

దత్పదంబులయందుఁ బలు తచ్చిహ్నములచేత విష్ణుండు సమన్వయుం డని యెఱుంగందగు ముఖ్యశబ్దంబులచే జనార్దనుండు వాచ్యుండు బహువిధంబులగు శబ్దంబులకు ముఖ్యవృత్తిచే హరికి వాచకత్వంబగుం గావున నదియ శబ్దంబన్వయంబు చేయంబడుచుండు నితరుండు జిజ్ఞాస్యుండుగాడు సర్వనామధేయంబులు గల్గి సర్వదోషవివర్జితులకు విష్ణుండుపాస్యుం డదిగావున నేకారణంబుచేనైన ప్రవృత్తినిమిత్తంబు విష్ణువునందు చేయంబడుచుండుసర్వనామధేయంబు లీశునందుం బ్రవేశించియుండు సర్వగుణాకరుండగు విష్ణునకుషడ్గుణపూర్తిత్వంబు సమన్వయంబై చేయంబడు జీవులచే నెంత యధికాదరణంబు చేయం బడుచుండు నంతకంటె నధిక గుణంబులు బహువిధంబులై యెఱుంగం బడు వేదజ్ఞులు గత సంశయులని యెఱుంగందగును. 158

మానిని :

దాంతియు శాంతియు గల్గిసునిస్పృహతన్ వరభక్తి దృఢవ్రతుఁడై
యంతయు నీశునకై యపవర్గము నాత్మఁదలంచుచు నుండెడు సు
స్వాంతుఁడు, మోక్షముగోరని బుద్ధివిశాలుఁడు ధారుణి నెన్నఁదగున్
సంతత ముత్తముఁ డాయధికారి సుసంజ్ఞను దేవవరుం డరయన్.

గీ. ఆత్మఁ బూర్వోక్తగుణయుక్తుఁడగుచు ముక్తి
కొఱకు విష్ణునిఁ గోరెడి నరుఁడు మధ్య
మాధికారి యనందగు నతఁడు లోక
దుర్లభుండంచు నార్యు లెంతురు నిజముగ. 160

క. నిగమాధ్యయనవిహీనుం
డగుచున్ బూర్వోక్తగుణసమగ్రత గలవాఁ
డగు మధ్యమాధికారి త
త్వగుణక్షేమంబు (తఱచి) తర్కింపఁబడున్. 161

సీ. స్త్రీశూద్రులకును చర్చింపంగ తంతుమా
త్రాధికారిత్వంబు హాలికులకు
తంత్రమాత్రంబె గ్రంథపురస్సరము లేదు
బ్రాహ్మణస్త్రీలకు గ్రంథముఖ్య
కంబగుఁ దంత్రసుజ్ఞానాధికారంబు
కల్పసంకరులకుఁ గథలవినికి
యర్హంబనిరి యుత్తమాధికారులు సురల్
పితరులు ఋషులు భూపతులుమధ్య

గీ. ములు దలంప మనుష్యోత్తములును నధమ
సంజ్ఞఁ దగు నధికారులు శౌరిభక్తి
హీనులకు నధికారులందేమిలేదు
గనుక విష్ణుప్రసాదాప్తిఁ గలుగు ముక్తి. 162

క. నియతి జగమునకు జన్మా
దియగును నెవ్వండు బుద్ధిఁ దెలియు నతఁడె బ్ర
హ్మయనియు హరియు నటంచును
నయముగ నిగమములు నొడువు నానాగతులన్. 163

గీ. జనన పోషణ సంహృతి సత్ప్రకాశ
కా ప్రకాశకాబంధమోక్షాదులకును
నియమమున కెవ్వఁడధిపతి నెమ్మి నాతఁ
డరసిచూడ పరబ్రహ్మ మనిరి మునులు. 164

గీ. తలఁపగను కర్మవిద్యాప్రధానగుణము
లకు నొకప్పుడు గలదు కతృకత వాని
కంటె నుత్తరక్రియకర్తలు గలుగు కతన
ననుచు శాస్త్రాంతరంబులు వినఁగ నొడువు. 165

చ. వనరుహగర్భరుద్రముఖవర్యులు సంభవమొందిరాది నె
వ్వనివలనన్ మహోన్నతి నవత్వతగల్గి క్రియత్వతాఘనం
బనువగు తత్స్వరూపుఁడయి (యాత్మఁ) బ్రవేశముఁ జెంది లోకవ
ర్తనములు చేయుచుండు సతతంబును జక్రి వినోదలీలలన్. 166

ఉ. ఈవనజోద్భవాదులు రమేశ్వరుచేత నియుక్తులై జగ
త్పావనులై ప్రపంచవిధిఁ దత్క్రియలెల్ల నెఱుంగదక్షు లా
దేవునియాజ్ఞలేక విధిదిక్పతులైన నశక్తులంచు వే
దావళిపల్కు నెప్పుడు నిజాత్మలసంశయమెల్లఁ దీఱఁగన్. 167

సీ. అర్థి సూత్రప్రోతమగు బొమ్మ చాలనా
దికకర్మము లొనర్చు తెఱఁగు గాఁగఁ
జక్రహస్తుఁ డొనర్చు సకలకర్మంబులు
వ్యాప్తమౌ హరిచేత నఖిలజగము
తనకాత్మహితకర్మ తంత్రంబులెల్లను
జేయించుఁ జేయును శ్రీవిభుండు
వాసుదేవుఁడు పరవాచ్యుఁడు గాకున్న
నెట్లుగా వశమగు నీజగత్తు

గీ. ఈశువశములు జగములు నీశ్వరుఁడు జ
గములకు వశుఁడు గాకున్నఁ గలదె సంత
తంబు నానందమగు టెట్లు తలఁచి చూడ
నతని లీలావిశేషంబు లఖిలమునులు. 168

క. ధరణిని వటబీజంబును
పరిసేచన నాటితగు నుపాయంబులు నే
ర్పరితనము గలిగినను నం
కురమగు నొక్కార్తవాంబుఁ గూడకయున్నన్. 169

చ. తలఁపగ నూర్ణనాభి ఘనతంతువులన్ సృజియించి బంధనం
బులకును లోనుగా కచట పొందుగనుండియుఁ దాన జీవులం
దెలివిని జేయు బంధనమదిం తుదమ్రింగును తత్క్రమంబునన్
బలిదమనుండు లోకపరిపాలము చేయు గ్రసించుఁ గ్రమ్మఱన్. 170

వ. విష్ణుండు తా నచింత్యాద్భుతశక్తిమంతుండై చింతామణి కల్పకపర్వతం
బులు సృజించె జడంబు చేతనంబుగా నజడంబు జడంబుగాఁజేయ
సమర్థుండైన జగద్వ్యాపకుండగు విష్ణుగుణంబులు సుమంగళంబులై
శ్రుతిబంధంబులై యకాంక్షితంబులై జ్ఞాతాజ్ఞాతంబులై శ్రుతా శ్రుతం
బులై యుండు ననంతగుణములు గలుగుటంజేసి గుణప్రవృత్తి నివృత్తి
కంబులైన సమస్త శబ్దంబులు విష్ణుం బ్రశంసచేయుచుండు నన్యోన్య
ముఖ్యంబులుగా వివరింప నొక్కొక్క గుణయోగంబుచే ముఖ్యరహితవృత్తి
వాక్కులచేఁ జిజ్ఞాసగోచరంబు గానేరదు అట్టి విష్ణుప్రసాదంబువలన
దుఃఖముఖ్యంబైనసంసారంబు వలనగు కర్మపాశంబులచే ముక్తుండగు
నితరోపాయంబులచేతం గాదు కావున ముముక్షులచే ననర్థప్రదకర్మ
పాశంబులవలన నారాయణుండు జిజ్ఞాస్యుం డతండు పరమవిభుం
డవ్యయుండు గావున 171

**హరి విరాడ్రూప ప్రకారము**

సీ. కర్మసంశ్రవణ సాక్షాత్కారములచేత
జాతమౌ విష్ణు ప్రసాద మరయ
నధమ మధ్యమ మహదాఖ్యల విలసిల్లు
హరిసంప్రసాదాప్తి నధముఁడొందు
స్వర్గాదిలోకసంశ్రయము మధ్యమునకు
బ్రహ్మలోకంబు సంప్రాప్తమగును
ఘనుఁడుత్తముఁడు మోక్షమును జెందు నిజముగా
వరగుణోత్కర్షము లెఱుఁగు నరున

గీ. కగును ప్రత్యక్ష మహిమ సత్యంబు గాcగ
నా గుణోత్కర్ష శబ్దసమన్వయంబు
లేక కల్గదు కల్గను జోక వినికి
చేతను మనంబుచే నవి చేయవలయు. 172

గీ. తలcప బ్రహ్మాదిమానుషాంతంబు గాcగc
దమ మనంబులు దెలియ హరి మహిమంబు
లెపుడు నిష్కళంకములని యెన్నబడును
గావున వినుండు తద్భేద కారణములు. 173

శా. సూనుల్ పౌత్రులు మిత్రులుం గొలువ నస్తోకప్రభాశౌర్యని
ష్ఠానిర్వృత్తి జయార్థసంపదల సప్తద్వీపముల్ వైభవ
శ్రీనిష్పత్తిని నేలు భూపతికి నిర్దేశింప సౌఖ్యంబునె
ద్దానం గల్గునదే ప్రసిద్ధమగు నుద్యన్మానుషానందమై. 174

వ. అది మోక్షంబంద ప్రతిపాద్యంబగు నంతకంటె శతగుణాధిక్యంబు మహేశ్వరానందంబు క్రమంబునం దెలియంగ నొక్కొక్కటికి శతగుణాధిక్యంబులు మానుషాత్మక గంధర్వ పితృగణాజానజకర్మ ధనపతి దుర్గాగణాధిపతి ఋషిగణ భృగు విశాఖ నారదాబ్జచంద్రసూర్యమానవీ యమ వాయు దక్ష గురు మను శచీంద్రానిరుద్ధరత్యుమా వారుణి సౌపర్ణాహీంద్రభారతులు వీరలకంటె కోటిగుణాధిక్యంబు లక్ష్మీరమకంటె ననంత గుణానందాధిక్యంబు ప్రభుండగు హరి యసంఖ్యాకావయవ యోగంబులవలన నిరంగుండని జను లెఱుంగుదురు. అక్లిష్టకర్మంబులచే విష్ణుం డకర్తయని పలుకంబడు జ్ఞానానందస్వరూపియగు నితనికి నశుభం బొకప్పుడు లేదు రోధకంబు దుఃఖంబును వేధయు బలహీనత్వంబునుం గల్గువానింగా పాపాత్ములై మాయాపహృతచిత్తులైన యబుధులు పలుకుదురు పూర్ణషాడ్గుణ్య విగ్రహుం డొకానొకండైన తత్వంబువలన నెఱుంగనేరండు సర్వవేదంబులయందు విష్ణుగుణం

బులు మంగళంబులని పలుకంబడు భగవంతుండగు బ్రహ్మ తపోధి
కంబులగు గుణంబులంబొంది యెఱుంగంబడు నట్టి విష్ణునితోడ
సదృశంబును నధికంబును నగు దైవంబు భూతభవిష్యద్వర్తమానంబుల
వినం గనంబడదు. 175

మ. గరిమన్ శౌరి చరాచరప్రకటలోకక్షేమకార్యార్థియై
దురితోద్ఛేదముచే నభిన్నమహిమాస్తోకంబులై నిత్యసు
స్థిరరూపాప్తి సహస్రసంఖ్యలగుచున్ జెల్వొందురూపంబులన్
భరియించున్ విహరించుచుండు సకలోపాయప్రసంగాత్ముఁడై. 176

మ. హరిమాహాత్మ్య మెఱుంగఁజాలక యవిద్యాసక్తచేతస్కులై
నరులూహింతు రనేకరూపవిలసన్నానాక్రియాయుక్తుఁగా
స్థిరతన్ జ్ఞానవిశేషమానసులు భక్తింగొల్తు రద్వైతుఁగాఁ
బరమేశాఖ్యునిఁగా నభిన్నతనుఁగా బ్రహ్మణ్యుఁగా నాద్యుఁగాన్. 177

ఉ. భూతములం దనేకవిధపూరుషులందును జీవులందు వి
ఖ్యాతిగఁ జూచుచున్ బ్రతతియందు హృషీకములందు వేదసం
జాతులయందు వేదబహుశాస్త్రములందు ననంతరూపవి
ద్యాతిశయుండు సత్యమహిమాఖ్యకు డేకకుఁడై ప్రవర్తిలున్. 178

క. లీలాంతర్యామి యనం
గా లలి బింబాఖ్యహృదయకమలస్థుండై
వాలాయము హరిచెలఁగున్
స్థూలాంగుష్ఠప్రమాణ శోభితుఁడగుచున్. 179

గీ. అర్థిఁ బూరుష నామాఖ్యుఁ డగుచు జీవు
లందు హరినిల్చి ప్రేరకుండై వెలుంగు
నట్లుగావున జిజ్ఞాస్యుఁ డతఁడు మోక్ష
మాత్మఁ గోరినవారల కనిరి బుధులు. 180

వ. అని యెఱింగించి వెండియు 181

సీ. క్షితి నిమిత్తత్వంబుచే నెఱుంగఁగఁ దగు
సర్వసృష్ట్యాదికి స్వామి నీశు
జంగమాజంగమసంజ్ఞకంబగు తత్త్వ
మదిగాన విజ్ఞేయమగుఁ దలంప
బధ్యబంధకములఁ బరగు తత్కర్తను
జింతించవలయు నిశ్చింతముగను
జడులజీవాత్మల చందంబు జీవేశ్వ
రుల భోగగతియుఁ బెంపలర నెఱిఁగి
ఆ.వె. ముక్తి గోరు నతఁడు మును జడజీవభే
దములఁ దెలియవలయుఁ దత్త్వవిధము
నది స్వతంత్రమనఁగ నర్థిని బరతంత్ర
మనఁగ రెండు తెఱఁగు లయ్యెఁ బిదప. 182

వ. రూపజ్ఞానప్రవృత్తులయందు నరు లపేక్షింపనితత్త్వంబు స్వతంత్ర తత్త్వం బని పలుకుదురు. ఆ తత్త్వంబున భగవంతుండును విభుండును నగు హరి యస్వరూపప్రవృత్త ప్రమితులయందు పరాపేక్షంబగు నది పర తంత్రం బది భావాభావస్వరూపంబులన ద్వివిధంబయ్యె. విధిప్రతీతి విషయంబు భాంవబనియును నిషేధాత్మయభావంబని యెఱుంగందగు. అయ్యభావంబు త్రివిధంబు. ప్రాగభావంబును సత్తాభావంబును నత్యంతాభావంబనంగ నయ్యత్యంతాభావంబు చేతనాచేతనత్వంబన ద్వివిధమతంబు. అవి దుఃఖాస్పృష్టాక్షరంబనియును స్పృష్టదుఃఖం బనియును నెఱుంగనగు నందు ముక్తాముక్త భేదంబున దుఃఖస్పృష్టంబు ద్విధామతంబు నందుముక్తంబు ముక్తి యోగ్యంబయోగ్యంబన ద్వివిధం బయ్యె తన్ముక్తియోగ్యంబు పంచవిధంబు దేవతా ఋషి పితృ గంధర్వ మనుష్యోత్తము లనందగు నముక్తంబు తమో యోగ్య శ్రుతిస్థితంబులనఁ

జతుర్విధంబులయ్యె నందుతమోయోగ్యంబు రక్షఃపిశాచమర్త్యాధములు వీరలు ద్వివిధ మతంబు చేకొందు రంధతమఃప్రాపులు కొందరు సంసృతిబద్ధులగుదురు. అసంసృతిబద్ధులు ద్వివిధంబున స్వర్గనరక యాతులగుదురు. కొందఱు స్వర్మార్గంబులయందుఁ గొందఱు నరకంబుల యందుఁ జెందుదురు. అచేతనంబు నిత్య మనిత్యంబన ద్వివిధంబు నిత్యంబులు సమస్తవేదంబు లంబరంబు కాలంబు ప్రకృతియు కార్య కారణ రూపంబుల వలన నంగస్మృత్యాదు లర్థంబులవలన నిత్యంబులు వ్యత్యస్తంబులయిన నవి నాశనంబగు సంసృష్టపుష్టంబులు నిత్యా నిత్యంబులు ద్విధాగమంబులందు బుద్ధీంద్రియదశకంబును తన్మాత్ర యుక్తంబగు పంచమహాభూతంబులుం గూడ త్రయోవింశ దసంసృష్టంబు సంసృష్టంబు ద్విధామతంబులందు బ్రహ్మాండంబు తద్గతంబు నని తత్త్వవేత్తలు నొడువుదురు వెండియు 183

క. చతురత సృష్టిస్థితిసం
హృతినియమజ్ఞానబోధ లెసగెడు బంధం
బతిసుఖదుఃఖంబులు నా
వృతిజాతులు వ్యాప్తమగును విష్ణువుచేతన్. 184

గీ. అరయనివి మానవేద్యంబు లవిచతుర్వి
ధాఖ్యఁ బ్రత్యక్షమనుమాన మాగమంబు
జ్ఞాన మనఁగను ద్రివిధంబు జ్ఞానమరయ
నందు నాదియె పరమేశ్వరాహ్వయంబు. 185

గీ. అక్షరజ్ఞానము ద్వితీయమంద్రు దుఃఖ
స్పృష్టముతృతీయమనఁగను జెల్లు నదియు
యోగజాయోగజంబన నొనరు నందు
జ్ఞానమాత్మపరాధీనమౌను తలఁప. 186

సీ. ఆది స్వసత్తాన్యదాధీన మది స్వప
రాఖిలగోచరంబగు ద్వితీయ
ముసు దృతీయంబనంగను పరికీర్తితం
బగు బుజుతాత్వికాఖ్య ద్విమతంబు
లలసర్వవిషయంబు లాలోక్య మొనరింప
హరికంటె నితరం బయార్జితంబు
నందు స్వరూపబాహ్యంబన ద్వివిధ మ
నాదినిత్యంబు తదాఽవియోగ

ఆ.వె. మనఁగఁ దాత్త్వికులకు హ్రస్వసంయుక్తంబు
అదియపూర్వవిధి ద్విధాఖ్యమయ్యె
నర్థి నీప్రమాణ మమరు ప్రమితమన
జగము హరికధీన మగుచునుండు. 187

క. అతులిత మోక్షోపాయ
స్థితి ఘనవైరాగ్యమహిమచే నగు దృఢస
మ్మతి నిత్యానిత్యవివే
కత మమత పరిత్యజించగాఁ దగు నెపుడున్. 188

క. మమతయ సుఖదుఃఖములకు
క్రమమునఁ గారణము పుట్టగలిగినఁ గని దాఁ
బ్రమదమొదవించు హ్రస్వ
త్వము ఖేదమొనర్చు మమతఁ దగిలిన వానిన్. 189

క. కావునను సమస్తంబులు
భావమునఁ బరిత్యజింపఁబడి యోగివరుం
డై వెలయు వాఁడు మమతయుఁ
గావింప ననర్థ మొందఁ గలఁడు జడుండై. 190

క. నిరతిన్ మమత్వబుద్ధిన్
భరతుఁడు ఘనయోగియయ్యు భవమొందెను మున్
హరిణీగర్భంబున దు
ష్కర మదియె పరిత్యజింపఁ గను మోక్షంబున్. 191

మ. సమతాత్ముల్ నియమవ్రతుల్ బుధజనాసక్తుల్ విమర్శింప ని
ర్మమతాజ్ఞానతమోహతుల్ దృఢముగా రాజీవనేత్రుండు ప్రే
మమునన్ దత్ హృదయాంబుజంబుల నిధామంబై(తగన్) నిల్చు నా
క్రమముల్ సంతతభక్తియోగమున వే కల్గున్ బుధుల్ దెల్పఁగన్.

వ్యాసుడు జనకుని వద్దకు వచ్చుట

మ. జనసంపూజ్యుఁడు చిత్రభావిదితరాజర్షీశ్వరఖ్యాతిచే
జనకక్ష్మాపతి బాదరాయణునిచే జ్ఞానంబు సాంగంబుగాఁ
గని రాజయ్యు మమత్వచింతను తిరస్కారంబు గావింప న
మ్మునినాథాగ్రణి తత్పురంబునను సమ్మోదంబుతో నిల్చినన్. 193

క. వ్యాసుఁడు మిథిలాపట్టణ
వాసుండై జనకరాజవరునకు విద్యా
భ్యాసంబుఁ జేయ మదిలో
నీసు జనింపంగ మౌను లెల్లరుఁ దమలోన్. 194

క. నెఱయఁ దపోవృద్ధులు కొం
దఱు వృద్ధులు జ్ఞానమునఁ దలపఁగ మఱి కొం
దఱు తెలియ వయోవృద్ధులు
తఱి నందఱు దాసులరయ ధనవృద్ధునకున్. 195

గీ. తలఁప రాజాధిరాజని ధనికవృద్ధుఁ
డనుచు వ్యాసుండు జనకుని ననుసరించె
నట్లు మౌనులు సన్న్యాసు లశనవస్త్ర
కాంక్షతోఁ బతిఁ గొల్చుట కష్టమగును. 196

క. తమలోన విచారింపగఁ
క్రమమున విని నిఖిలయోగిగణ్యుఁడు వ్యాసుం
డమలిన మగు జనకుని చి
త్తము మౌనుల హృదయ కలుషితము తెలియుటకున్. 197

సీ. మాయగావింప నమ్మౌనివరేణ్యుని
పంపున జనకుని పట్టణంబు
దరికొని కాల నత్తరిపుర రక్షకుల్
విభుని కా తెఱఁగెల్ల విన్నవింప
నవ్వుచు ధారుణీనాథుఁ డగ్నిభయంబు
కనిపించ దిదియేమి యనుచుఁ బల్క
నభిమానులగు యతు లప్పుడు మఠశాటి
కాదిసంరక్షణకై చెలంగ

గీ. నంత భృత్యులు శీఘ్రత నరుగు దెంచి
సౌధకాదులు వహ్నిచే సమసె ననఁగ
మనుజపతి మిథ్యయనియె నమ్మౌను లెల్ల
కదలి రాకులమంది నల్గడల కపుడు. 198

క. పురజనులార్తిం జెందుచు
ధరణిపునకు విన్నవింపఁ దలఁకక ఘనసు
స్థిరమతి మమత్వశంకా
పరిహారమనస్కుఁడై శుభస్థితినుండెన్. 199

క. మునివరులు యతులు గూడుక
జనవిభునకు జెప్పిరిట్లు శాటీదండా
జినసూత్ర కమండలములు
ఘనపావకశిఖల నడఁగెఁ గనుగొనుము నృపా! 200

ఆ.వె. ఇప్పుడైన  మీర లేతెంచి నిల్చిన
నగ్నిభయము  శాంతమగునటన్న
నార్తజనుల పల్కు లాలించి మదిలోన
భ్రమయొకింతలేక పల్కె నపుడు. 201

క. పరమేశానుగ్రహమున
కరిహయరథకనకధేను గణములు పూర్వా
చరితమగు కర్మవశమున
బరగున్ లీనంబు నొందుఁ బరిపరిగతులన్. 202

క. హరివలన సిరులు గల్గుట
వరలాభం బదియు వహ్నివశమగుట  మహ
త్తరలాభ మతులలాభం
బరయఁగ కోట్యధికలాభ మయ్యెనటంచున్. 203

ఆ.వె. మిథిల దగ్ధమగుట మిథ్యయై తోచెడి
నాకుఁ జూడ  నిజమనంగ నేర
ననఁగ జనకు నిశ్చలాత్మకు మదిమెచ్చి
మాయమాన్పె బాదరాయణుండు. 204

వ. అప్పుడు రాజానుచరులు బరతెంచి వ్యాసుంగని నమస్కరించి మహాత్మా! పురంబునగల వస్తువ్రాతంబు వెండియు దగ్ధంబగుట లేదు వహ్న్యుత్పాదకంబును మిథ్యయయ్యె ననవుడు నిర్మమతాత్మకుండగు జనకరాజు చిత్తశుద్ధికి మెచ్చి ప్రశంససేయఁ ద్రపారంభులైన యతి మునిజనంబులు భయంబంది బాదరాయణు బహుస్తోత్రంబులొనర్చి మహాత్మా! భవదీయ మహిమ మాకెఱుంగశక్యంబె వేదవేద్యుండగు పురాణపురుషుండగు నారాయణుండవు లోకోపకారార్థంబు జంబూద్వీపంబునందుఁ గళింగ కుమారి గర్భంబున నుదయించిన జగత్ప్రసూతినిధానంబగు వ్యాసుం

డవు భవత్కృత్యంబు లెఱుంగ మాకు శక్యంబె గర్వాంధులము వృథా పండితమ్మన్యుల మగు మమ్ము సంసృతిసాగరంబువలన రక్షింపు రక్షింపుమని వినుతింప మేఘ గంభీరనినదంబున నిట్లనియె. 205

గీ. లోలమగు మీమనస్థకాలుష్య మపన
యించుటకు నిపుడు వహ్నికల్పించఁబడియె
మమత సుఖదుఃఖహేతువై మలయు నెచట
నదియె దృఢమయినిల్చె నాయందు నిపుడు. 206

క. జనకుఁడు యోగిశ్రేష్ఠుం
డనఁదగు మమతావిహీనుఁడగు కతనను నే
ననిశము సుజ్ఞానింగాఁ
గని ఘనవాత్సల్యమున నతనికడ వసియింతున్. 207

క. కావున మీరు మమత్వము
భావంబునఁ బొరయనీక ప్రబలు డటంచున్
వేవిధముల బోధించుచు
నావేదవ్యాసమౌని యచ్చటనుండెన్. 208

వ. అని శాండిల్యుం డెఱింగించిన నమ్మహాపురుషులు తరువాతి వృత్తాంతం బడిగిన. 209

**ఆశ్వాసాంతము**

శా. అంభోసంభవతారహారగణ జంభారిద్విపావిద్విష?
త్కుంభీనేశ్వరభోగినీయప వియత్కూలంకషాశ్రీర్వధూ
శుంభత్ స్వర్ద్రుమ దేవసైంధవ శరస్తోమప్రభాస్వచ్ఛసం
రంభారంభనివారణక్షమ మహత్ప్రఖ్యాతి సద్భూషణా! 210

తోటకము :

హరిపూజనభాజన హారికథా
వరతా......... క్రమవైరిహరా
ధరసత్వసుతత్వ విదారపరా
స్థిరకీర్తివికీర్తిత ధీరవరా! 211

దోదకము :

ధీమహనీయ వితీర్ణకనిశ్చిం
తామణి విష్ణుకథాహితచిత్తా!
శ్రీమహితాద్యవిశేషకవీంద్ర
స్తోమహితాశ్రిత తోయజమిత్రా! 212

గద్య. ఇతి శ్రీవరాహగిరిలక్ష్మీనృసింహవరప్రసాదలబ్ధసారస్వత విచిత్రాపస్తంబ సూత్ర కాశ్యపగోత్రపవిత్ర వడ్లపూఁడి వెంకటమంత్రిపుత్ర సకలసుకవి జనవిధేయ పెద్దయనామధేయప్రణీతంబైన వాయుపురాణంబునందు మాఘమాహాత్మ్యంబను మహాప్రబంధంబున బ్రహ్మరాక్షసాది మహా భూతంబులు మాఘస్నానంబువలనఁ గర్మచ్యుతులై పూర్వశరీరంబులు ధరియించి తమ తమ వృత్తాంతంబులు సుయజ్ఞున కెఱింగించుటయు సమిత్కుశఫలార్థంబు సుయజ్ఞుండు చని రాక మసలుటకుంజింతించి శాండిల్యుండు భార్యాబోధితుండై చని వనంబున శిష్యాలోకంబు సేయుటయు హరివిరాడ్రూప ప్రకారంబును జ్ఞానాజ్ఞాన కర్మ విశేషంబుల తెఱంగును జనకునిప్రశాంతగుణ లక్షణంబును వ్యాసప్రభావంబును నను కథలు గలయది తృతీయాశ్వాసము.

శ్రీః

# మాఘమాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము

క. శ్రీసాగరకన్యాసం
వ్యాసవ్యాకోచనేత్ర వారిజ! తరుణో
ద్భాసేక్షాలంకారా!
దాసరి చినగంగధీర! ధనదోదారా! 1

వ. అవధరింపుము వివిధ పురాణేతిహాస ప్రసంగవిఖ్యాతుండైన సూతుండు హరికథాశ్రవణసమ్మోదులగు శౌనకాదుల కిట్లనియె నట్లష్టావింశతి పురుషులకు శాండిల్యుండు వెండియు నిట్లనియె 2

### శాండిల్యుడు చెప్పిన యోగ లక్షణములు

క. మానితమగు నిష్ఠన్ దద్
జ్ఞానారూఢులగు యోగిగణ్యులు మదిలోఁ
బూని యమాదివిధంబుల
ధ్యానపరులు (యోగివరులు) తము గావలయున్. 3

వ. అవి యెయ్యవి యనిన యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులను నష్టాంగయోగంబులచే విద్వాంసుండు యోగసిద్ధిం బొందు. తద్విధంబు లుపన్యసించెద. 4

గీ. సత్యమును శౌచ మింద్రియక్షమము శమము
నర్థి మానసనిగ్రహంబనఁగ నైదు
యమవిధంబులు తత్సాధనార్థసువ్ర
తాదులెల్లను నియమంబులనిరి బుధులు. 5

సీ. స్వస్తికములును పూర్వకములాసనములు
వివిధములని వేదవేత్తలనిరి
వినుడు ప్రాణాయామవిధ మెఱింగించెద
పూరకరేచకములును కుంభ
కములు వాయునిరోధకంబు నివృత్తియు
నారోహణావరోహణము సేయు
నది సగర్భ(మగర్భమ)ను రెండు విధములు
ధ్యానహీనమగర్భమౌ సగర్భ
గీ. మెందును ధ్యానయుతమగు నందు కోటి
గుణితఫలమున గర్భమెక్కుడు దలంప
సొరిది సో (పాంశువు ననపాంశు) వనఁగను ద్వి
విధమగును బ్రాణాయామవిధికిఁ దలఁప. 6

వ. కుంభకంబువలన వాయునిరోధంబుచేసి యావచ్ఛక్యంబుగా హృదయంబు నందు హరి ధ్యానంబుచేయుచు న్యస్తనాసికాదృష్టిచే విషయంబులందు నింద్రియంబులు ప్రవర్తింప(నీక) ధ్యేయవస్తువునందు ప్రత్యాహారంబుగా నీశ్వరేంద్రియంబుల స్వకీయేంద్రియసంధానంబుచేసిన నది ప్రత్యాహారంబనంబడు స్వకీయహృదయంబున ననంతమూర్తియగు హరి భజనంబుచేయ నేరూపంబు ధ్యానగోచరంబగు నది ధ్యానంబనం దగు. అనంతరూపియగు విష్ణురూపంబు మనోగోచరంబగునది ప్రతిమాకారంబొనర్చి యుపచారవిధులొనర్చి ధ్యానంబు ప్రతిమ యందుంచి ప్రతిమారూపంబు ధ్యానయుక్తంబుగా విమర్శించి నాసాగ్రన్యస్తదృష్టిచే ధ్యానంబుచేయుచు నంగుష్ఠాదికేశాంతం బవయవంబుల నానంద

మనస్కుండై ధ్యానంబొనర్ప సర్వాంగసంపూర్ణుండగు హరి నిజాంగం బుల ధారణంబొనర్చు నది ధారణంబు. ఇది శాంతసుశీలుండైన గురు కటాక్షంబునంగాని లభింపదు తదీయధ్యానంబున భక్తవత్సలుండగు భగవంతుండు స్వప్రకాశసచ్చిదానంద విగ్రహుండును కోటిసూర్య ప్రకాశుండును సస్మితానందుండునునై కృపావిలాసంబుచే నావిర్భవింప తదవలోకనంబున నానందబాష్పాకులితరోమాంచితుండును సంభృతా నంద పరిపూర్ణుండునునై తదీయానుసంధానంబుచే బాహ్యక్రియా పరిత్యాగియై నివాతాచల దీపంబుపోల్కి నుండు. ప్రారబ్ధంబులన్నియు సద్యోనాశనంబగు "ప్రారబ్ధకర్మణానస్యాత్ జ్ఞానాదేవమోక్ష" మనిన వాక్యప్రమాణంబునఁ బ్రారబ్ధకర్మహీనుండై బాహ్యజ్ఞానవివర్జితుండై పరాసక్తచిత్తుండగుటఁ దదేకత్వప్రాప్తి సమాధియనంబడు. ప్రారబ్ధకర్మం బులు భోగంబులయిన లింగశరీరంబు విడిచి యోగి జన్మమృత్యు వినాశంబగు మోక్షంబుఁజెందు నితరుండు యోగకర్మపరిత్యాగియై యనాదిమహాదుఃఖంబులంబొందు నిది సంశయరహిత జ్ఞానహేతు కంబు గంగాస్నాన విష్ణుకథాలాపంబు లాదిగాగల్గువిశేషంబులు గావున

( సీ. మును పుణ్యధామాఖ్యుఁడను భూసురుఁడు దీర్ఘ
తపముచేతను బృహత్తపసుఁడనెడు
ముని వలన శతాబ్దములు విష్ణుసత్కథా
లోలుపబుద్ధి విలుప్త సర్వ
కర్మాచరణుఁడయి గంగానదీస్నాన
మును మాని గురుసేవయును సుతీర్థ
యాత్రాపరాయణాద్యర్చనంబు లొనర్చి
శ్రీరామచరితవిశేషసాంఖ్య

గీ. పాంచరాత్రక్రమంబుల బహుపురాణ
వేదశాస్త్రేతిహాసముల్ వినుచునుండు
తంతుమాత్రంబు సంధ్యావిధాన జపము
సల్ప నొకనాఁడు తద్విప్రసద్మమునకు. 8

క. ధర తీర్థాచరణమునన్
స్థిర(తర)దృఢవ్రతుఁడు జ్ఞానసింధుడు నను భూ
సురవరుఁడు పుణ్యధామునిఁ
బరికించి మృదూక్తినిట్లు పలికె నతనితోన్. ) 9

సీ. తలఁప దేహుల కన్యథాభావమున ముక్తి
గలుగునే చర్చింపఁ దెలియ వినుము
స్థావరంబులకంటె జంగమంబులు ముక్త
లంతకంటెను నరు లరయముక్త
లంతకంటెను ద్విజులధికులు వారల
కంటె ముక్తులు తత్వఘనులు వారి
కంటెను ముక్తులు కాముకుల్ వారల
కంటెను భూపాలగణము ముక్త
గీ. లవనిపునికంటె పితృదేవతాళిముక్త
లంతకంటెను మునివరు లధికులంద్రు
వారికధికులు కనజాల వారియందు
నరయ సప్తర్షు లతిముఖ్యు లనిరి బుధులు. 10

ఆ.వె. వారికంటె వహ్ని వహ్నికంటెను గురుం
డతనికంటె యింద్రుఁ డమరవిభుని
కంటె గౌరి గౌరి కంటెను శంకరుం
డతనికంటె ముక్తుడంద్రు విధిని. 11

క. కమలజు కన్నను ముక్తులు
గలుగరు జీవతతిలోన గణుతింపఁగ న
జ్జలరుహభవు కంటెను న
త్యలఘుమహిమగలుగ ముక్తుఁ డంద్రు రమేశున్. 12

వ. దేవా! నిష్కామమతులగువారలకు మార్గద్వయంబులు కీర్తితంబులందు సంసారభ్రమితుల మార్గంబు దక్షిణాయనం బది ధూమ్రాధికంబనియు బితృయానంబనియును జెప్పుదురు విపశ్చిన్మార్గంబు ద్వితీయం బుత్త రాయనం బది యర్చిరాదికంబని చెప్పుదు రిట్లు మతద్వయంబు దేవయాన బ్రహ్మయానంబులంద్రు. దేహంబున నిడా పింగళ సుషుమ్న లను నాడీ త్రయంబు లధిష్ఠించియుండు దక్షిణంబున పింగళయును వామంబున నిడయును నాడీద్వయమధ్యంబున సుషుమ్నయును నని వేదపారగులచే వచింపంబడు సుషుమ్నానాడి పార్శ్వస్థంబై యిడా పింగళాభిధా (ననాడులుండు) పింగళ దక్షిణనాడి నామంబున నిడా వామ సంజ్ఞఁ బ్రకీర్తితంబగు పింగళ శతపంచనాడికాచయంబు దక్షిణాయనంబన వామభాగంబునఁ దిర్యక్ర్పసారితంబులైయుండు నిడానాడియు తత్సంఖ్యనాడీయుక్తం బుత్తరాయణంబన దక్షిణ భాగం బునఁ దిర్యక్ర్పసారితంబులై యుండు నుత్తరాయణమార్గస్థులు కళేబర నిష్క్రాంతులై దక్షిణకర్ణంబువలన వెలువడి ముక్తులగుదురు. దక్షిణాయన మార్గస్థులు కళేబరంబులవలన వామకర్ణంబున వెలువడి నరకవాసు లగుదురు రోమాదిమార్గనిర్గతులగు కర్ములు పితృయాన మార్గస్థులు రాత్రిశబ్దాహ్వయ నరులు పితృమేధజలంబులను క్రమంబునను పునః ప్రాప్తులై ధరణియందు నానా యోనిసంభవులై ఘోరకర్మంబులుచేయ నుదయింతురు. ఉత్తరాయణమార్గస్థులు కళేబరంబులవలన నిర్గతులై యాదియందర్చిషం బొందుదురు. వహ్నివలన వాయువు, నందువలన పూర్వపక్షంబునం దయన వత్సరపితృవరుణ ప్రభాసూర్యవైశ్వానర చంద్రాకాశవాయువులం బొంది పరమపురుషుండగు పురుషోత్తముం జెందుదురు. ఇవ్విధంబునఁ గ్రమక్రమంబున హరిపదప్రాప్తులగుదురు లింగశరీరాఖ్యభంగకాలంబు ప్రాప్తంబగుచుండ సుషుమ్నానాడి మార్గంబు వలన హరిం బ్రాప్తింతురు మహాత్ముండగుయోగి శక్తిచే నాత్మయందు ప్రవేశంబుచేసి భూమి యుదకంబుల, నుదకం బగ్ని

యందు, నగ్ని వాయువులయందు వాయు వాకాశంబునందుఁ గ్రమ క్రమంబున మాత్రాయుక్తంబుగా నియమించి యాకాశంబు మనస్త త్వంబు నందు నియోగించి మనస్తత్వంబు బుద్ధియందు బుద్ధి యహం కారంబునందు యహంకారంబును యాదివ్యక్తియందుఁ జేర్చి తత్వాభి మానక్రమంబున యోజించి తదంతరస్థుండగు హరితోఁగూడ విష్ణు పురస్సరుండై బ్రహ్మరంధ్రంబుచేఁ బ్రాణనిష్క్రమణంబు చేసి విష్ణు పదంబునుం బొందు. తన్మార్గత్రయంబు లందున సర్వకిల్బిషవిముక్తుం డగు. తదీయానుష్ఠానవంతులగు నరులకు ముక్తి కరతలస్థితంబగు. అకృతాత్ములకు దుర్లభంబని చెప్పి వెండియు 13

క. జ్ఞానమునకు కర్మమునకు
వీనుల శ్రీవిష్ణుకథలు విన్నదియె గుణం
బే నియమంబుల విను మ
ట్లైనను దోషములు వొరయ వదియెట్లన్నన్. 14

ఆ.వె. హరికథావిరహితమైన కృత్యములు ని
రర్థకంబులును మహాస్థలముల
నైన విష్ణుసుచరితామృతవాణితోఁ
బరగ నుండునదియె బ్రహ్మపదము. 15

చ. దళముగ నిందిరావరకథానది యెచ్చటనుండు నచ్చటన్
దెలివిగ నుండు నిర్ఝరనదీసరయూయమునాసరస్వతీ
సలలిత గౌతమీనిఖిలశైవలినీతతులున్ గయాప్రయా
గలు నురుజాంగలప్రముఖగౌరవతీర్థములున్ బ్రసిద్ధిగన్. 16

క. ధీరత బ్రహ్మేశ్వర కే
దార ద్వారావతీశతద్రుత కాశీ
చారుప్రభాస పుష్కర
హారిసుతీర్థంబులుండు హరికథ యుండన్. 17

వ. మఱియు బ్రహ్మాదిదేవతలు సమస్తధర్మంబులు వివిధ యజ్ఞంబులు సాంఖ్యాదియోగంబులు లక్ష్మీవిష్ణుకథాప్రసంగంబుల వసియించి యుండు. కర్మలేశ దుఃఖలేశ భూతపిశాచగ్రహపీడలుం బొరయనేర విందులకు సాదృశ్యంబైన యితిహాసంబు చెప్పెద వినుండు తొల్లి కృత యుగంబున 18

పుణ్యధాముని చరిత్రము

సీ. పుణ్యధాముం డనెడు భూసురప్రవరుండు
(వర) గంగతీరాన వరలు సత్య
వ్రతమనుపురము నివాసంబుగా నుండు
నచట దీర్ఘతమాఖ్యుఁ డనఁగఁ బరగు
జాత్యంధుఁడు వసించి శతవత్సరంబులా
యనకు తత్వనిరూఢి ఘనతఁ దెలిపె
నంతట నొక్కనాఁ డతిథులై సూర్యాస్త
మయమున దూరంపు పయనగతుల
గీ. (సిద్ధులు) దృఢవ్రతజ్ఞానసింధు లర్క
తేజ(సన్నిభు) లిరువు రేతేరఁ జూచి
వినయమును సంభ్రమంబును బెనగొనంగ
నా గృహస్థామహాత్ముల నాదరించి. 19

క. కూరిమి సాష్టాంగనమ
స్కారంబులు సేసి పూజఁగావించి సవి
స్ఫారమతి భోజనాద్యుప
చారంబులఁ దనిపి ప్రియము సలుపఁగఁ బలికెన్. 20

ఉ. ఎందులనుండి యెచ్చటికి నేఁగుచు నెట్టివ్రతంబు పూన్కి మీ
రిందుల కేఁగుదెంచితి రహీనగుణాకరులార! యిట్లు నా
నందముతోడ వచ్చుకతనన్ జననంబు ఫలించె భాగ్యముల్
చెందె సమస్త పుణ్యములు చేరెఁ గృతార్థుఁడ నైతి నింతటన్. 21

గీ. బహుభవార్జిత దోషముల్ వాయు కొఱకుఁ
గలుగు మీవంటి సుజనసాంగత్య మింది
రాధినాథకథాశ్రయు లైన సాధు
లరయ ముల్లోకదుర్లభు లనిన వారు. 22

ఉ. భూనుత! తీర్థయాత్రకయి పూన్కిమెయిం జనుదెంచినార మీ
జానపదంబునన్ సుజనసంగతి యేమి యొనర్పుచుండు గం
గానది యెంతదూర మవగాహమొనర్తుమటన్న వారితో
మానితభక్తి భూమిసురమౌళి ప్రియం బలరార నిట్లనున్. 23

గీ. పూని నూఱేండ్లబట్టి సుజ్ఞానబోధ
దీర్ఘతముఁ డొనరింపంగఁ దివిరి నిఖిల
కర్మములు మాని శ్రీహరి కథలు విందు
గంగ యిట కెంత దూరము గలదొ యెఱుఁగ. 24

ఆ.వె. అనిన చెవులు మూసికొని హరి పరమాత్మ!
యిట్టి పాపకర్మునింటఁ గుడువ
వలసె నమరతటిని జలములఁ గ్రుంకని
సుకృతరహితు నితనిఁ జూడఁ దగదు. 25

సీ. జనుఁడు భాగీరథీ యనుచు నూఱామడ
నుండియైనను భక్తియుక్తి మెఱయఁ
దలఁచిన నఖిలపాతకములు చనుఁ దుది
నంబుజనేత్రు లోకంబు గలుగు
నిట్టి పావనగంగ నెలమి సేవించని
జడునకుఁ బితరులు శాపమీరె
దేవతల్ హరియును దృష్టిఁ బొందుదురె గం
గాస్నానమున ముక్తి గలుగు టరుదె

గీ. యెట్టి దుర్మార్గుఁడైనఁ దా నెఱుకలేక
చేరి గంగాజలస్పర్శ చేసెనేని
కలుషతతుల దహించు నీఖలుఁడు తీర
భూమినుండియు దర్శింపఁ బోవడెట్లు. 26

క. అని దూషింపుచు దద్భుహ
మున నిలువక యొండుకడకు ముదమునఁ జని పెం
పెనయఁగ నన్నిశి గడచిన
ననిమిషనదిఁ గాంచి మ్రొక్కి యత్యుత్సుకులై. 27

వ. అవగాహనంబు సేయ నుద్యోగించు సమయంబున గంగ వారికి దృష్టి
గోచరంబు గాకున్న విస్మితులై సాగరపర్యంతంబు నరయవలె నని
చని చని ముందట. 25

మహాస్రగ్ధర :
కనిరంతన్విప్రు లుద్యత్కమఠ ఝషతిమిరగ్రాహసందోహ హేలా
జనితోత్తుంగోరుభంగస్వనిత జలకణాసారసంసక్తతీర
స్థ నవామోదప్రసూనచ్ఛదఫలభరిత స్వాదకాళీగుణాళీ
వనపాళీ రమ్యశాలీవ్యవహితమహిమా వ్యాప్తిభద్రున్ సముద్రున్. 29

వ. ఇవ్విధంబునంగాంచి గంగాదర్శనంబు సేయనేరక మగుడి హిమవ
త్ప్రాంతంబునకుంబోయి యచ్చటను సర్షపమాత్రంబు జలకణంబునుం
గానక మరలి కాశీస్థలంబునకువచ్చి స్నానంబుసేయుజనంబులం
జొచ్చి తమకు లేకున్న విన్నంబోయినచిత్తంబుల బహుస్తోత్రంబుల
గంగ నుద్దేశించి యిట్లనిరి. 30

చ. శివుమకుటంబునం దధివసించి భగీరథుప్రార్థనంబునన్
భువి ప్రవహించి యాసగరపుత్రులఁ జేర్చితి మోక్షసీమ కే
శవ పదపద్మసంభవ వజ్రవిశేషతరైకపుణ్యరా
శివి నినుఁ బ్రస్తుతించెదము చిత్తమునన్ గరుణించు జాహ్నవీ! 31

క. ఘనతరమగు నీయవగా
హనమునఁ గైవల్యసిద్ధి యనివిని దూరం
బుననుండి భక్తినిన్నుం
గనుగొన వచ్చితిమి లోక కళ్యాణనిధీ! 32

గీ. తనయు లపరాధమొనరింపఁ దల్లియెవ్వి
ధమున రక్షించు నట్లు దుస్తరమహోవృ
జిన నియుక్తులమగుమమ్ము చిత్కృపా వి
లోకనమున విలోకింపు లోకజనని. 33

క. హరి లోకజనకుఁడగు గతి
నరరక్షకురాలవీవు నలువుగ నిన్నున్
గరమాశ్రయించితిమి మ
మ్మరయంగాఁ దగుఁ బ్రసన్నవై కళ్యాణీ! 34

వ. అని బహుప్రకారంబులఁ బ్రస్తుతించిన 35

సీ. పూర్ణశశాంకవిస్ఫురితవక్త్రంబుతో
విలసితహరినీలవేణితోడఁ
బాటలద్యుతిరత్నతాటంకయుగముతో
రమణీయబింబాధరంబు తోడఁ
గుంభికుంభస్తనకుంభద్వయంబుతోఁ
గంబుసమాన కంఠంబుతోడఁ
గటి విరాజిత్కాంచికాదామకంబుతోఁ
గమలినీపత్రనేత్రములతోడ
గీ. సలలితాంగద రుచిరహస్తములతోడ
విమలనూపురతారహారములతోడ
నాశ్రితావనపావన యైనగంగ
ధరణిసురులకు నపుడు ప్రత్యక్షమయ్యె. 36

గీ. అటులు ప్రత్యక్షమైన ధరామరేంద్రు
లలరి సాష్టాంగదండంబు లాచరించి
కరములు మొగిడ్చి పులకితగాత్రులగుచు
నున్న నద్దివ్యనదియుఁ బ్రసన్నమతిని. 37

మ. ఘనగంభీరవచోనియుక్తి వెలయంగాఁ బల్కె నప్పుణ్యధా
ముని నిందించితి రమ్మహాత్ముఁడు కడున్ముఖ్యుండు లక్ష్మీధవుం
డనయంబున్ నిజదాసదూషకుల మాయంజేయు నాధర్మమూ
ర్తిని సేవింపుడు సర్వదోషములు నర్థింబోవు తత్సేవనన్. 38

గీ. హరికథాకర్ణ నాసక్తు లరయ నెచట
నుందు రచటనె పాయకయుండు సకల
తీర్థచయములు దీన సందేహమేల
భక్తదూషణదోషముల్ పాయవెందు. 39

వ. అపరాధసహస్రంబులైనను హరి క్షమించుంగాని భక్తిపరాయణుల నవమానంబు చేసినఁ గించిదైనను సహించడు. కల్పకోటిశతంబులను దూషకునకు గతి యొదవ దదికావున భక్తుల నేమరక పుండరీకాక్షుండు ప్రవర్తించుటంజేసి వారలు సకలలోకపూజ్యులు. అగణ్యపుణ్యకలితుండైన పుణ్యధాముని కడకుం జనుండని విష్ణుం డాజ్ఞాపించినవాఁడు గావున

సీ. విష్ణుపాదముల నావిర్భవంబైన నన్
గూర్చి బృహత్తపగుణగణాఢ్యుఁ
డలరు మత్తీరంబునందు శిష్యులతోడ
నున్నవాఁ డచటికత్యుత్సవమునఁ
బోయి యాయనచేత బోధతత్వజ్ఞులై
ధృతిఁ బుణ్యధాముఁ బ్రార్థింపుడనుచుఁ
బలికిన జాహ్నవి పలుకులువిని బృహ
త్తపసుని కడకు మోదమున వచ్చి

గీ. యతఁడు తెలుప సమస్తవిద్యలు నెఱింగి
వినయమున నమ్మహాత్ముని వీడుకొనుచు
భూమిసురులు సత్యవ్రతపురమునకును
భూరి సుజ్ఞానకలితులై పోయి యచట. 41

ఉ. వీతసమస్తదోషు నరవిందదళాక్షకథానురక్తుఁ గం
జాతభవాన్వయాగ్రణిఁ బ్రశస్తగుణాశ్రయుఁ బుణ్యధాముఁ బ్ర
స్ఫీతమనస్కులై ప్రణుతిచేయుచు సంభ్రమలీలమీఱఁగాఁ
జేతులు ఫాలభాగమునఁ జేర్చి ప్రియంబునఁ బల్కి రెంతయున్. 42

గీ. స్థిరగుణాధార! నిన్ను నిందించు కతన
గంగ దండించె మమ్ము సత్కరుణతోడఁ
గావవే యపరాధులఁ గమలనయన
భజననిరతులఁ జెందునే పాపతతులు. 43

క. ఎఱుఁగక యజ్ఞానంబునఁ
దెఱవొప్పక నిందచేసితిమి మముగావం
దఱియని యనవుడు నయ్యి
ద్దఱ నాతఁడు కౌగిలించి తలకొను భక్తిన్. 44

గీ. వారితోడ బృహత్తప వరమునీంద్రు
కడకునేతెంచి వీరిపైఁ గలుగ దలుక
గుణగరిష్ఠుల వీరలఁ గొని నిలింప
సింధుసన్నిధి శుచులుగాఁ జేయవలయు. 45

వ. అనిన విని యా మునిచంద్రుండు జ్ఞానసింధు దృఢవ్రతులం దోడ్కొని
గంగకుం జనినన్ గంగయు బృహత్తపమునీంద్రునకు సన్నిహితంబై
ప్రత్యుత్థానంబు చేసి సంభ్రమంబున నిలిచిన నమ్ముని యనుమతి
నవ్విప్రు లిఱువురు గంగాస్నానంబు చేసి స్నానసిద్ధింబొంది శుభప్రదం
బైన విష్ణుకథలను కృతార్థులై రిట్లు సకలకర్మంబు లొనర్చియు విష్ణుకథా
విముఖులైనవారి జీవం బజాగళస్తనంబుల చందంబు 46

క. ఎక్కడ విష్ణుకథలు గల
వక్కడనే యుండు సకలయజ్ఞంబులు పెం
పెక్కగ సమస్తతీర్థము
లెక్కుడు హరికీర్తనంబు లిలఁ జర్చింపన్. 47

మ. అని శౌండిల్యుఁడు వెండియుం బలికె నత్యాసక్తి యోగీశ్వరుం
డెనయన్విశ్రమవేళ మానసమునం దీక్షింప భద్రంబె కో
రినమే లట్లనినన్ జనంబులకు నర్థిన్ బంధమోక్షంబు లె
ల్లను చేతోజయవృత్తి చక్కనగు నుల్లాసంబు సంధింపగన్. 48

క. అది గావున యత్నముచే
హృదయంబె జయించెనేని యీహితములు పెం
పు దలిర్ప నొందుఁ జిత్తము
కుదురుకొనక యొదవుటెట్లు కోరిక లెందున్. 49

క. చతురగతి నిది నిమిత్తం
బితిహాసం బొకటి గల దహీనమనీషన్
వితతముగ వినుఁడు శుభసం
గతమై సంతోషహేతుకంబగు మీకున్. 50

సువృత్తవృత్తోపాఖ్యానము

శా. కాశీదేశమునందు నందిపద సద్గ్రామంబునన్ వేదవి
ద్యాశీలుండు సుశీలుఁడన్ ధరణిదేవాగ్రేసరుం డొప్పు నా
ధీశోభాన్వితునందనుల్ సుగుణవర్ధిష్ణుల్ దినాధీశసం
కాశుల్ ధాత్రి సువృత్తవృత్తవిమలాఖ్యుల్ గల్గు ధీరోత్తముల్. 51

క. ఒకనాఁడు తీర్థయాత్రో
త్సుకులై వైశేష్యకర నిధులు నదులు శుభ
ప్రకటిత గతిఁ గనుచుఁ బ్రయా
గకుఁజని హరిఁజూచు వేడ్క కదలుకొనంగన్. 52

మ. పురవీధిం జన నాదినాంతమున నంభోవృత్తము ల్లోకభీ
కరలీలన్ గగనంబుఁ గప్పి కరకాఖండోపలోదగ్రని
ర్భరగర్జాపృథులార్భటీప్రబలధారాశ్రేణివర్షించ న
ద్ధరణీభాగమునందుఁ (బర్వె) బహుళధ్వాంతం బనంతంబుగన్. 53

వ. అంత నిబిడాంధకారంబున నొండొరులు తెరువులు దప్పి యెడఁబాసి వృత్తుండు దేవగృహంబునకు సువృత్తుండు వేశ్యాగృహంబునకుంజని రంతవృత్తుండు మాధవమందిరంబునఁ గృష్ణాష్టమీదినంబుగావునఁ బురజనంబు లత్యుత్సవంబొనర్పుచున్న దుర్బుద్ధింజేసి తదుత్సవ విముఖుండై యాత్మగతంబున 54

చ. కడఁక సువృత్తుఁ డట్లు గణికాసదనంబున కేఁగ నప్పు డ
ప్పడఁతి మెఱుంగు గుబ్బలను పైకొని కౌఁగిటఁ జేర్పఁ గన్నెపు
ప్పొడి వెదజల్లు చెంగలువ పువ్వులునించిన శయ్యపైఁ దగ
న్విడె మనురక్తినిచ్చి ననవిల్తుని కేళికి డాయకుండునే. 55

ఉ. నేర్పున నేనునొక్క నళినీదళలోచన యింటికేఁగి పెం
పేర్పడ నాసువృత్తుగతి నిందునిభానన నిండుకౌఁగిటన్
జేర్పఁ దదాధరామృతవిశేషరసంబులు గ్రోలుకొంచుఁ గం
దర్పసుఖోక్తిఁ జెందక వృథామతి నిచ్చటి కేలవచ్చితిన్. 56

క. అని చింతింపుచు మాధవు
గనియును వందనమొనర్పక తదీయ కథల్
వినక తగుపూజసేయక
మనసునఁ దద్ధ్యానుతులు మఱచె జడుండై. 57

క. హరిముందఱ భక్తులు ప్రియ
కరముగ నాట్యంబు సేయఁగాఁ జేయక త
ద్వరపుణ్యకథాసక్తులఁ
బరిశీలించక యతండు పరహృదయమునన్. 58

క. ఇత్తెఱంగున ఠేయెల్లను
జిత్తరువున నున్నప్రతిమ చెలువుననుండెన్
హత్తి గణికాగృహమున సు
వృత్తుఁడు వసియించియుండి విమలమనీషన్. 59

సీ. తనలోన నిట్లని తలఁచు జన్మసహస్ర
ముల వృత్తుఁడేమి నిశ్చలతపంబుఁ
జేసెనో యెట్టి విశేషపుణ్యమున మా
ధవపదపద్మసందర్శనంబు
గలిగె వానికి నార్యగణము మెచ్చంగ న
ర్ఘ్యంబిచ్చు లోచనకమలములను
బూజించు భక్తితోఁ బుష్పాంజలి యొసంగుఁ
బ్రతియామమునను సంభ్రమము మెఱయ
గీ. నలరి సాష్టాంగదండంబు లాచరించు
బహువిధస్తోత్రము లొనర్చు విహితజనుల
తోడ నృత్యంబు తగసల్పు ధూపదీప
చయము లొడగూర్చి పూర్ణప్రశస్తిఁ జెందు. 60

క. నారాయణ కథ వినుచున్
ధీరోన్నతి నుండు నెవఁడు దేవగృహమునన్
గోరి యటుచనక వేశ్యా
గారంబున నుంటి నేను కడుహీనమతిన్. 61

చ. కమలదళాక్షుఁ గన్గొనని కన్నులు కన్నులె శార్ఙ్గపాణి స
ద్విమలచరిత్రముల్ వినని వీనులు వీనులె సింధుకన్యకా
రమణున కర్థిమ్రొక్కని శిరంబు శిరంబె జనార్దనాభిధా
నము నొడువంగలేనియది నాలుకనాలుకయే తలంచఁగన్. 62

ఉ. అక్కట! గోకులాష్టమిఁ బ్రయాగ మహాస్థలి కేఁగుదెంచియుం
గ్రక్కున మేఘమున్ దమము కార్కొని యేటికిఁ గప్పె నప్పుడా
దిక్కున వృత్తు వెంబడిని దేవగృహంబున కర్థిఁ బోక నే
నిక్కడి కేలవచ్చితి రమేశునిఁ జూడక మోసపోయితిన్. 63

క. హరిఁ బూజించని కరములు
కరములె నిర్మాల్యపుష్పగంధాఘ్రాణ
స్ఫురణఁ దనరి తత్సేవా
పరతఁ గనని నరుని బ్రతుకు బ్రతుకే ధరణిన్. 64

వ. అదియునుంగాక సత్పురుష సాంగత్యంబుకంటె నితరకర్మంబులు పాటి గావని పెద్దలెంతురు. తత్సమాధానంబున హరికిం బ్రదక్షిణ నమస్కార విశేషణీయంబులు సలుప నస్మాదృశులైన కర్మజీవులకు సిద్ధించునే వృత్తుండును నేనును నొక్కట జన్మించి యొకపథంబున ముక్తిస్థానంబైన ప్రయాగకుం జనుదెంచ దైవయోగంబునఁ గృష్ణాష్టమి నొక్కరికి మాధవ సందర్శనంబును నొక్కరికి వేశ్యాభవన వర్తనంబును సంధిల్లె. పూర్వజన్మ (పుణ్య) ఫల స్వల్పంబు గాకేమి యని యన్నిశియంతయు విచారించు చున్న సమయంబున 65

మ. మునిసంఘంబులు మ్రొక్కఁ దామరలు సమ్మోదమ్మున న్నిక్కఁ గో
కనికాయంబుల కింపులెక్కఁ గుముదౌఘంబుల్ రుచుల్దక్క యౌ
వనగర్వంబులు చింతదక్క మది జీవంజీవముల్ స్రుక్కఁ దూ
ర్పున మార్తాండుఁడు గానిపించె భువనంబుల్ రంజిలన్జేయుచున్

వ. ఇట్లరుణోదయంబైన సహోదరుండైన వృత్తుండు చనుదెంచిన నతనిం గూడి సువృత్తుండు నిజపురీయాత్రోన్ముఖుండై పోవుచున్నఁ గతిపయ దినంబులకు నొక్కసమగ్రన్యగ్రోధసమీపంబున నశనిపాతంబునంజేసి యిరువురు పంచత్వంబు నొందిన 67

క. హరికింకరులును యమకిం
కరులును జనుదెంచిరపుడు కమలేశుభటో
త్కరము సువృత్తుని నాఁగిన
ఖరకరసుతుభటులు వృత్తుఁ గట్టిరి పెలుచన్. 68

ఆ.వె. అట్లు వృత్తుఁ గట్టి యమపురంబునకుఁ ద
ద్భటులు గొనుచుఁ బోవు పగిదిఁ జూచి
యిందిరేశ భటుల నీక్షించి పలికె సు
వృత్తుఁ డధికభక్తివినతుఁ డగుచు. 69

చ. నరనుతులార! వృత్తుఁడు ఘనంబుగఁ గృష్ణజయంతినాఁడు సు
స్థిరతఁ బ్రయాగమాధవుని సేవయొనర్చినవాఁడు వారసుం
దరిసదనంబుఁ జేరి సుకృతంబు లొనర్చినవాఁడగాను వాఁ
డిరవుగ దండభృత్యతతి నేఁగెడుఁ గారణమేమి నావుడున్. 70

క. హరిభటులు సువృత్తునితో
వెరవొందగ బలికి రతఁడు విష్ణునివాస
స్థిరుఁడయ్యె నన్యచింతా
పరిశీలుండగుటఁజేసి పాపముఁ జెందెన్. 71

గీ. వారకాంతాగృహాంతర వర్తియయ్యె
నీవునాఁ డంబుజోదరు నీలవర్ణు
మాధవుని మానసంబున మరువవైతి
కావున హృదయశుద్ధియె కారణంబు. 72

క. అంతఃశుద్ధి గలిగి హరిఁ
జింతించితి కనుక ముక్తి సిద్ధించెను నీ
కంతఃశుద్ధిరహితు బర
చింతాత్ముండతఁడు జముని చెంతకుఁ బోవున్. 73

చ. హరి కరుణించె నిన్ను సుగుణాకర! పుష్పక మెక్కుమన్న నా
ధరణిసురాన్వయుండనియెఁ దమ్ముని బాసి చనంగనొల్ల స
త్పురుషులు మీ కటాక్షమున దుష్పథవర్తనుఁడైన తమ్మునిన్
స్థిరమతులార! యా జముని చెంతకుఁ బోవు విధంబు మాన్పరే! 74

వ. అనుచుం బెక్కువిధంబులం బ్రార్థించిన నాశ్రితజనరక్షకుఁడైన భక్తవత్స
లుని దూత లతని కిట్లనిరి. 75

ఆ.వె. అనఘ! పూర్వతనువు నందు మాఘస్నాన
మాచరించినాడ వందు ఫలము
ప్రకటబుద్ధి వృత్తునకు నొసంగిన మోక్ష
సిద్ధి చెందు ననిన చెలఁగి యతఁడు. 76

క. వారలు చెప్పిన రీతిగ
ధారాపూర్వకముగాఁగఁ దత్ఫల మొసఁగెన్
గోరి యనుజునకు నంతసు
ధారోచిస్ఫురితకాంతిఁ దగ వృత్తుండున్. 77

వ. యమకింకరులచేత బంధమోచనుండై యున్నయెడ నయ్యిద్దఱను దివ్య
విమానారూఢులం జేసికొని విష్ణుకింకరులు వైకుంఠపురంబునకుం
గొనిపోయి రిట్లుగావున దానతపస్స్వాధ్యాయపితృతర్పణ నిత్యనైమిత్తికాది
విధులు విష్వక్సేనార్పితంబుగా నొనర్చిన మోక్షంబు గలదు. ఇంద్రియ
భ్రాంతిఁ బొందినవారికి ఫలితంబులుగావు కావున నెఱుక గలవారు
హృదయంబున కుదురుగ నిలుపవలయు నట్లైన శాస్త్రశ్రవణంబునఁ
జిత్తశుద్ధి నెలకొనునని చెప్పి 78

క. చేకొని చిత్తస్వాస్థ్యము
లేకుండిన నరుఁడు దివ్యలీలాన్వితమౌ
శ్రీకరవిరాట్స్వరూప ప
దాకాంక్షాసాయమున నియతి నిల్పంగన్. 79

క. నియతి సునిస్సంగుఁడయి హృ
దయమునను జితేంద్రియుఁడయి తన్మాహాత్మ్యా
శ్రయుఁడగు(నెడఁ) దద్రూప మ
రయఁగఁజను (నుసుస్థిరముగఁ బ్రతి) నిత్యంబున్. 80

వ. విరాడ్విగ్రహస్వరూపంబునందు భూతభవ్యంబులుగానంబడు తద్ధారణం బుచే మనోమలక్షీణంబగు. తన్మహిమారూపం బెట్లనినఁ బాతాళంబు పాదమూలంబు మహీతలంబు గుల్ఫంబు తలాతలంబు జంఘలు సుతలంబు జానువులు వితలం బూరువులు కుతలంబు జఘనంబు నభస్థలంబు నాభి జ్యోతిర్గణంబు లురంబులు మహర్లోకంబు గ్రీవ స్థానంబు జనర్లోకంబు వదనంబు తపోలోకంబు లలాటంబు సత్య లోకంబు శిరస్సు నింద్రాదిబహుదిగ్దేవతలు శ్రోత్రేంద్రియంబులును శబ్దంబు నాసికం బశ్వినులు ఘ్రాణేంద్రియంబులు గంధంబు ముఖంబు నందగ్ని సంభవంబయ్యె శశి దివాకరులు నేత్రంబులు మూర్ధ జలంబులు హృదయంబవ్యక్తంబు ఇంద్రియంబులు హనువులు మతి విజ్ఞానశక్తి గంధర్వచారణులు స్వరంబులు వేదశాస్త్రంబులు పల్కులు, నసురసంతతి స్మృతంబులు సముద్రంబులు కుక్షి పర్వతంబు లస్థి చయంబులు (తరువులు) తనూరుహంబులని పల్కుదురు ముఖ బాహూరుపదంబుల బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు ననంతరంబ సంకరు లుదయించిరి గుహ్యంబు ప్రజాపతి వృషణంబు మిత్రుండు ఉదకంబు తాలువులు రసంబు జిహ్వ, .......శీర్షంబు (మాటలు) ఛందంబులు దంష్ట్రలు యమమృత్యువులు, (దంతంబు) లుడు గణంబులు ..... మాయాహాసంబులు జగత్ సృష్టి అపాంగమోక్షణంబు ఇవియన్నియు విష్ణ్వంగంబులని భావింపనగు నదియునుంగాక. 81

ఆ.వె. కలియుగంబునందు కలుషమనస్కులై
యల్పబుద్ధులగు నరాధములకు
జలజనయన సుగుణ సంకీర్తనంబులు
వేదపాఠమనిరి వేదవిదులు. 82

క. హరినామ మొక్కటొకటియుఁ
బరికింప ననేకవేదఫలమని నొడువన్
దిరమగు తత్పథమునఁ జే
కురు బహుసుకృతములు, భారకుఁడు గాఁడు కడున్. 83

సీ. హృతభర్తయగుసతి వితతసౌందర్యంబు
నిర్గతప్రాణివర్ణిత్వగరిమ
విజ్ఞానయోగి దుర్విషయపరిభ్రాంతి
షండుని కామినీసంగమంబు
గుణహీనుఁడగుపుత్రకునిఁ గన్నవంశంబు
పగిదిని శ్రీహరిభక్తి లేని
యతని జన్మంబు నిరర్థకంబని మున్ను
నిగమాగమములు వర్ణించుఁగానఁ
గీ. బాపకుండేని హరినామ పఠనవలన
దోషనిర్ముక్తుఁడై కాంచుఁ దుదిని ముక్తి
నారదుఁడు యమపురినుండు నారకీజ
నులను ముక్తులఁజేసె సన్మునులు వొగడ. 84

నారదుడు నరసవాసులను ముక్తులుగా చేయుట

క. అనవిని శాడిల్యమునిం
గనుగొని తత్పురుషులనిరి కలహాశనుఁడే
యనువున నరకావాసుల
ననిపెన్ సద్గతికిఁ దెలియనానతి యీవే. 85

వ. అనవుడు శాండిల్యుం డిట్లనియె శారదనారదోల్బణుండైన నారదుం డొక్కనాఁడు వైకుంఠంబునకరిగి యందుఁ జిన్మూర్తియైన నారాయణుని దర్శించి వందనంబాచరించి యిట్లని స్తుతియించె 86

దండకము :

శ్రీమజ్జగన్నాథ! సత్యత్రయీబోధ! లోకేశ్వరస్తుత్య! నాకాధిపాద్యాదిదేవావళీ భూరిభాస్వత్కిరీటస్ఫురద్రత్నదీప్తాంఘ్రిపీఠా! కఠోరామరారాతికుత్కీలవజ్రాయుధా! శంఖచక్రాయుధా! నీ మహత్త్వంబు వర్ణింప నేనెంతవాడన్ విరించ్యాదులన్ బ్రోవఁగాఁ బూని మీనంబవై డంబకంబొప్పఁగా నంబుధింజొచ్చి భీమాసురుం డైన యాసోమకున్ భీతికృన్నామకున్ జీఱవే, మీఱ వేల్పుల్ బలానల్పులై విస్తృతంబైన యామందరాగంబు భోగంబు శౌర్యానురాగంబునన్ జుట్టి దట్టించి యిట్టట్టు మల్లాడుచుండన్ రహింబట్టి బెట్టల్కతో వారిధిన్ సార ధైర్యోన్నతిం జొచ్చి యచ్చంచలద్గోత్ర మచ్చోన యుచ్చంబుగానుంచి నన్నిచ్చ గుండిచ్చులన్(?) మెచ్చులేకొంచు కొంచెంబుగా నవ్వియచ్చారులెన్నన్ బ్రసన్నాత్ములై యున్న యన్నిర్జరశ్రేణి మన్నించి యన్నీటిలోఁ బాపి పాఠీనమున్ చాటుకున్‌రా నిరాఘాట నీరాటకోటిం గరాటోపకోటిం బ్రపాటించు లీలాఢులీనాథ సన్మూర్తితో వర్తులంబైన దివ్యత్త్రికాగ్రంబునం దానవా, దానవారాతిజాతా గ్రహోగ్రక్రియా వ్రాతుఁడైనట్టి హేమాక్షదైతేయుఁ డత్రాస్య జైత్రాత్ముఁడై భూతధాత్రిం విచిత్రంబుగాఁగొంచు నంభోధిలో దాఁగినన్ వేగ సద్యోగలీలా గతిన్ గ్రోడమై పోడిమిన్ బోణిమై నాణెమొప్పార గీర్వాణకశ్రేణి నిస్త్రాణపారీణులై భీరులై పాఱఁ దోరంబుగా రక్కసున్ ఘోరపున్ బోరిలో మీఱుచున్ ధీరతన్ గేరుచున్ గోఱలం జీఱి యాధారమింపార నాధారుణిన్ శూరరూపాతిశృంగారతన్ నిల్పి రక్షించవే, మించి వైరించి చంచద్గదోదగ్రజాగ్ర త్ప్రభూతాగ్రహుండైన యాహేమనేత్రాగ్రజుండుగ్రుఁడై దేవతాకోటికిన్బాటియౌ తేట నానాఁటికిన్ నీటితోనాటి వాటింప నాటోపనోత్తాలకూటప్రకూటంబు బోటారికంబంబునన్ గుంపులై పెంపుసొంపిల్లగం బోయి దింపన్ నిలింపుల్ మిమున్ వేడినన్ వాఁడియౌ వేఁడిమిన్ వాని గర్వంబఖర్వంబుగాఁ బర్వు దుర్వారనిర్దాహమున్ వంపఁ దత్సూనునిన్ విష్ణుసేవామితధ్యానునిన్ దుస్స హైనస్తమోభానునిన్ సజ్జనవ్రాతసన్మానునిన్ సత్యధర్మప్రశస్తేంగితజ్ఞానునిన్ బోధగావింప నా బాలుఁ డాలోలకేళీకళాలీలసంశీలవాచాలుఁడై పూని

విద్యాపరీక్షా ప్రసంగంబునన్ దండ్రియొద్దన్ బ్రసిద్ధంబు గావింప సుత్రాముఁ డున్ సోముఁడున్ బద్మసంభూతుఁడున్ వారఁడున్? జిత్రభానుండు భానుండు పంచేషుఁడున్ శేషుఁడున్ సప్తవారాశులున్ దారకారాశులున్ వాణియున్ శంబరం బంబరం బద్రులున్ రుద్రులున్ యక్షులున్ బక్షులున్ సిద్ధులున్ సాధ్యులున్ గిన్నరుల్ బన్నగుల్ ఖేచరుల్ భూచరుల్ చారణుల్ వారణంబుల్ నిమేషక్షణాదుల్ నిశాహర్ముఖాహంబులున్ బక్షమాసర్తుసంవత్సరంబుల్ సమస్తంబు నీవంచు వర్ణించఁ దాపించయై? వంచనంబుంచి నక్తంచరుం డించుకంతైన నర్చించగా లేక ప్రహ్లాదు వైకుంఠభక్తేతరవ్రాతసంరక్షణాహ్లాదు దూషించి లక్ష్మీధరుం డెందులేడంచు భాషించి బాలా వివేకింపవేలా పయోరాశివేలావనిన్ లోకపాలస్థు లాలోలకేళీపురాళిన్ శుభాలోకనవ్యాళ లోకావళిన్ మత్ప్రతాపంబు దీప్తోద్ధతింజెంది కోపాదిలోపంబుచేఁ బూని పాపంబు ప్రాపించు నీపల్కు లేపారునా తాఱునా శౌరిమద్భూరిధాటిన్ వృథామాటలింకేల నాకేల నీస్తంభమున్ దంభినై వాఁడి శౌర్యంబునన్వైతు నీతో హితోదీర్ణపూర్ణాత్ముఁడై వచ్చునా యచ్యుతుం జూపుమాయంచు కేయూర చారూరు హస్తంబునన్ వైవ నాశ్రేటుతో నమ్మహాస్తంభమధ్యంబునన్ గోటిసూర్యప్రభాభాసమానైక శశ్వత్కిరీటంబు ఖండేందు తుల్యోజ్జ్వలచ్చారు హస్తంబులన్ సటాభీలనృత్యస్ఫుర ద్భ్రూయుగంబున్ గటాదృష్టియుగ్రేక్ష ణాత్యక్షయంబున్ గనత్పూర్ణచంద్రోపమానాననంబున్ గళన్మార్దవోద్యత్కపోల ద్వయంబున్ జపారాగసారప్రసూనాధరంబున్ గరాళాతిశాతోగ్రచంచ న్నఖంబుల్ దిశాహస్తిహస్తాభరంగత్కరంబుల్ లసత్కౌస్తుభోద్భాసి వక్షః స్థలంబున్ గదా శార్ఙ్గచక్రాబ్జఖడ్గాదినానాయుధాకీర్ణమున్ శారదాంభోధరా ధారశూరాంగమున్ మేఘగంభీరగర్జాకహారావభీమంబునై బంధురంబై నృసింహాకృతింబొల్చు నీమూర్తి వీక్షించి శిక్షించు దక్షత్వమున్ లేక రక్షోధి నాథుండు పక్షక్షమాద్రంబు లీలన్ గరాళంబుఁ దాఁబట్టి దట్టించి కట్టల్కతో బింకమైతాఁకినన్ గాఁకతో నాగఁ గైకోక రాకాసి నాకాశవీధిన్నిరీక్షించి శిక్షించు పక్షీంద్రు డోనాఁగ ఝుంకించి యంకించి లంఘించి యంకంబు నందుంచి వొంకంబునన్ భూమియున్ వ్యోమమున్గాని యూరుప్రదేశంబు నందున్

నిశాహంబునుంగాని సంధ్యాసమాచర్యవేళన్ బహిర్గేహముంగాని ద్వారంబు నన్ శాతశస్త్రాస్త్రముల్గాని చంచన్నఖాగ్రంబులం జీల్చిచెండాడి తత్సూనుఁ బ్రహ్లాదు సౌజన్యసమ్మోదు భంజీకృతోద్యన్మనుష్యాదుతో సాదరామోద మింపొంద భాషించి వైశేష్య వైష్ణవ్య శుద్ధాత్ముఁడౌనట్లు పోషించినన్ రాక్షసేంద్ర ప్రసూతుండు ప్రేమన్నిమున్ ద్రినేత్రార్చితా! కామితార్థప్రదా! కిన్నరేంద్రస్తుతా! కీర్తినిత్యోదయా! కుంభినీభారకా! కూహదైత్యాంతకా! కోశవాక్యస్థితా! పార వాక్యాంబకా! కోటిసూర్యప్రభాకార! పాపాపహా! కంధికన్యాధినాథా! కహారావభీమా! యటంచుం బ్రశంసింప నావేళ లక్ష్మీసమేతుండవైయున్న శూలాయుధాంభోజ గర్భేంద్రముఖ్యామరుల్‌వచ్చి దేవా మహాదేవ! దివ్యావతారా! శతానీక ముఖ్యావనా! భావనాతీత! దైతేయు మర్దించి భూతావళిం బ్రీతిగావించితో వేదవేద్యా! చిదానందమూర్తీ! గదాచక్రధారీ! యటంచున్ బహుస్తోత్రముల్ సేయ వారిం గటాక్షించవా! వామనాకారమై ప్రేమ నాయాగవేళన్ రహింజూచి నన్ లోచనానందమైయొప్పు వైరోచనున్ భూమి పాదత్రయం బిమ్ముగావేఁడి బ్రహ్మాండభాండంబు పూర్ణంబునొందించు విశ్వాకృతింబొంది యాదైత్యుఁబాతాళలోకాంతరావాసుగాఁజేసి నాకాధినాథున్ ద్రిలోకాధికారత్వమేకాకృతిన్ జోకయౌనట్లుగాఁజేయవే, డాయవే హైహయున్ భార్గవానర్గళస్ఫూర్తిమై వేయి హస్తంబులం ద్రుంచి చంచత్కుఠారోరుధారల్ విరాజిల్లగాఁ బైతృకార్థంబు ముయ్యేడుమారుల్ ధరిత్రీశులం ద్రుంపవా, పెంపువాటిల్ల గారాముతో రామ నామంబు భూమిం బ్రసిద్ధంబు గావింపఁ గౌసల్యకుం బట్టివై పుట్టి యాచిట్టి ప్రాయంబునన్ గాధిపట్టిం గటాక్షించి తోబుట్టువున్నీవు చేపట్టి యాయాగమున్ రాగ లీలాగతోద్యోగమున్ గావఁ గాఁ బూని మౌనీంద్రువెంటన్ రహిం బోవుచోఁ ద్రోవలో నిత్యకృన్మానవా ఖేటకన్ విస్ఫురచ్ఛాంబరీఘోటకన్ శౌర్య భృన్నాటకన్ దాటకన్ సూటిబాణంబు లన్ గీటణంగించి దుర్భాషణాభీల దుర్దూషణున్ దూషణున్ బొల్పునం గెల్చి ప్రాణేశకోపోగ్రశాపాతి శృంగార వైకల్యయౌ నాయహల్యన్ బదాంభోజరాజ ద్రజోరాజిచే పూర్వభాద్దేహగాఁ జేసి యావంక నత్యంత యాగోత్సుకస్వాంతుడౌ నా విదేహక్షమా నాథు చాపంబు శశ్వన్మదోన్మత్తమాతంగపోతంబు శుండా బృహచ్చండదండంబుతో నిక్షుదండంబు ఖండించులీల న్వేసం ద్రుంచి

శృంగారలజ్జాసమేతన్ శుభాకార నుద్యద్గుణవ్రాత సానందచేతఃపయోజాత సీత న్వివాహంబు మోహంబుతోనై యయోధ్యాపురిన్ సౌఖ్యలీలారతిం దేలుచున్ గేకయాపత్యకృత్త్రైకవాక్యోన్నతిన్ దూలు భూపాలు పెంపొప్పఁగాఁ జేయఁగాఁ బూని వైదేహియున్ దమ్ముఁడున్ దోడరాగా నరణ్యావనిన్ మౌనిబృందంబు లానందముంబొంది వందిం పఁగా నేఁగి కూలంకషా భంగరంగత్తరంగన్ విహారాగతక్రౌంచపాళీరథాంగన్ సరోవిస్ఫురద్వాస నామోదభృంగన్ దరస్ఫారహింతాళతాలామ్లికా చూతనా రంగగంగన్ నిరీక్షింపుచున్ దాఁటి గాటంబుతో దండకారణ్యవాటీ విశాలోటజం బాశ్రయం బొప్పఁగానుండి యాగాంతరీకృన్నిశాటాఢ్యుఁడౌ నీచు మారీచుమాయించి బాహాబలాభీలలీలావికారాధిదేహున్ సుబాహున్ విదారించి భంజీకృతానేక నాథున్ విరాధున్ మనుష్యాశనున్ దుర్మదాంధున్ కబంధున్ ధరంగూల్చి వైదేహిజాడల్ ఖగేంద్రుండు దెల్పన్ వెసన్‌బోయి పంపాసరస్తీరమున్ దోరమున్ మీఱఁగాఁజేరి యాచేరువన్ సౌఖ్యలీలారతిన్ మారుతిం గాంచి సుగ్రీవుతోఁ జెల్మి వాటించి వాలిన్ మహాశౌర్యశాలిన్ సదారాధితోద్యత్కపాలిన్ రహింగూల్చి భూపుత్రి చందంబు సామీరి తామీఱి విన్పింపగా శౌర్యదర్పోద్ధతుల్ వానరాధీశ్వరుల్గొల్వఁగానేఁగి వారాశిబంధించి దేవేంద్రజిత్కుంభకర్ణాదులన్ లోకవిద్రావణున్‌రావణున్‌బంధుయుక్తంబుగాఁదూల్చి యక్షేశ్వర శ్రీకరంబైన యాపుష్పకంబెక్కి విశ్వంభరాపుత్రి సౌమిత్రియుం దోడరా నిర్జరస్తోత్రపాత్ర క్రియాశాలివై సంతతశ్రీకరంబైన సాకేతమత్యద్భుత స్ఫీతవిఖ్యాతలీలం బ్రవేశించి విశ్వంభరాభార ముద్యద్గతిందాల్పవే! రోహిణీదేవికిం బుట్టి యాజట్టిమల్లున్ ఖలున్ ముష్టికాద్యుగ్రదైతేయులన్ గొట్టవే! బుద్ధరూపంబునన్ దానవస్త్రీలనీమంబు ప్రేమంబుతో మాన్పవే! కల్కివై నిల్కడల్ దప్పి దర్పోద్ధతిన్ మించు దౌర్జన్యులం ద్రుంపవే! బాలకేళీ విహారంబునన్ లీలగోపాలసన్మూర్తి విస్ఫూర్తిఁ జాణూర కంసాది దుష్టావళిన్ రూపు మాయించి భూభారమున్ మాన్పవే యిట్టి మీభవ్యలీలావతారంబు లింపొంద వర్ణింపఁగా భారతీ నాయకుండున్ సమర్థుండు గాఁడేఁ బ్రశంసింపగా నేర్తునే దేవదేవా మహాదేవ రక్షింపు రక్షింపు నన్నున్ నమస్తే నమస్తే నమః. 87

వ. అని మఱియును 88

శా. శ్రీనాథున్ భుజగాధినాథుశయనుం జిద్రూపునిన్ దేవతా
ధీనున్ దీనజనావనుం బ్రవిలసత్కేయూరహారాన్వితున్
నానానూనతపోనిధాను మునిహృన్నాళీకసద్భానునిన్
భానున్ సూరసహస్రతేజగుణ విభ్రాజున్ హరిం గొల్చెదన్ 89

మ. మును లెవ్వానిభజించి కాంతురజునిన్ మోక్షంబు లోకేశుఁ డె
వ్వనినాభీకమలంబునన్ జననమై వర్తిల్లు నెవ్వానిప్రా
పున నింద్రాదులు ధన్యులైరి సుజనాప్తుండెవ్వఁ డప్పుణ్యుని
న్ననఘున్ భవ్య ననంతు నచ్యుతు నమేయాకారుఁ గీర్తించెదన్.

వ. అని విష్ణుదేవుని బహుప్రకారంబులం బ్రశంసింపఁ దదనుగ్రహంబునఁ గృతార్థుండై క్రమ్మఱి యింద్రలోకంబునకు వచ్చి యచ్చట నారాయణుం గాంచి బహుస్తోత్రంబు లొనర్చి యింక నేనేలోకంబుఁ జూచువాఁడ ననిజోకన్ బుద్ధినూహింపుచు 91

మ. యమలోకస్థితిదర్శనార్థమని యూహాపోహగావించి ని
త్యమహావైభవవిశ్రుతంబగుచు నూత్నస్ఫూర్తిఁ జెన్నొందు న
య్యమునావాసముఁ గాంచి ఘోరనరకప్రాప్తిన్ బరీభూతులై
భ్రమచేఁ జిక్కి బహుప్రరోగయుతులౌ పాపాత్ములం జూచుచున్. 92

సీ. తామ్రకటాహసంతప్తుల నొకచోట
నుత్క్షుధాయుక్తుల నొక్కచోటఁ
దైలయంత్రనిపీడ తనులను నొకచోట
నుపలభిన్నాంగుల నొక్కచోటఁ
గ్రకచాసి(కుంత) నిర్దళితుల నొకచోట
నురుఖడ్గహతులను నొక్కచోట
వహ్నిశిఖాశస్త్రవర్షసంతప్తులై
యురలు శరీరుల నొక్కచోటఁ

గీ. గాకబకమత్స్యకూర్మాహి ఘూక ఘన జ
లూకలపటాక (?) పీడితలూనదేహ
యష్టికా క్షారకర్దమాయాన ఘోర
యోగదుఃఖితజనముల నొక్కచోట. 93

సీ. భీకరవ్యాధినిర్భిన్నగాత్రుల భగ్న
పాదభుజోరుదృక్పాణితతుల
శార్దూలసింహపిశాచరక్షోభూత
భక్షమానాంగుల బహులతాడ
నములను పై తర్జనములను భర్జన
బాధల విభ్రాంతిఁ బడెడిజనులఁ
గంఠపర్యంతంబు ఘనతప్తకర్దమ
పచ్యమానాఘోరపాతకులను

గీ. పూర్వజన్మార్జితానేక భూరిదోష
వర్తనలు నొడివిపొరలెడి వారిఁ జూచి
రహి దయాక్రాంతమతిని నారదుఁడు చిద్వి
శారదుఁడు పల్కె నిట్టుల జనులు వినఁగ. 94

క. అలసులకు దురాత్ములకు స
కలకర్మవిహీనులకును కష్టాత్ములకున్
గలదె హరినామజీవన
మిలఁ దద్వ్యతిరిక్తమార్గ మేమియుఁ గలదే. 95

మ. అని దుఃఖించి కృపారసంబు ని . . . . 96

*(ఇక్కడ 114వ సంఖ్య గల తాటియాకు లోపించినది)*

. . . . . . . . . యిమానుగస్వర్గము చేరి రిమ్ముగన్. 97

గీ. ఏను చేసిన నేరమిందేమి చెపుమ
నన్ను నిందింప నీకిటు న్యాయమగునె
యెపుడు నీపురిచూడ మే మింతనుండి
యనిన శమనుండు కలుషితస్వాంతుఁడగుచు. 98

చ. నరులకు మేలుచేసితివి నారద! నేఁటిదినంబుదాఁక నీ
వరసి జగంబు లెల్ల కలహాశనుఁ డీతఁడనంగఁ గీర్తిచేఁ
బరగుము నేఁటినుండియని పన్నుగశాపమొసంగి ధర్మరా
జరిగెను పట్టణంబునకు నమ్మునిచేరెను సత్యలోకమున్. 99

క. కావునఁ గర్మక్షయమగు
శ్రీవిష్ణునినామపఠనచే మృత్యువు తా
రా వెఱచును హరిభజనము
గావించిన యేని ముక్తిఁ గాంచుఁ దిరముగా. 100

మ. సతతాచార విహీనుఁడై ఘనతపోచర్యాలసుండై మహా
వ్రతసుజ్ఞానవివేకదూరుఁడగుచున్ వర్తిల్లువాఁడైన సం
తతమున్ విష్ణుకథాసుధానుభవ తాత్పర్యంబునం జెంద సం
గతుఁడౌ యోగివరేణ్యుఁడొందుఁ బదవీకైవల్యసంస్థానమున్. 101

క. ఏ నరు జిహ్వాగ్రంబున
శ్రీనాయకునామపఠన చేకురుచుండున్
మానుగ శ్వపచుండైనను
వే నుతిఁదాఁ గాంచునంద్రు వేయును నేలా! 102

వ. అనిన విని యష్టావింశతి పురుషులిట్లనిరి మహాత్మా! ఆది భూరికర్మం
బులు మాచే చేయంబడియె సుయజ్ఞం దనాయాసకృతకర్మంబులచే
మద్దోషంబులు నష్టంబు నొందించె నది విస్తరించి పల్కుమనవుడు
శాండిల్యుం డిట్లనియె. 103

క. ఏయెడల (మనుజు మరణ) మ
నాయాస మహోయసంబునగు నాసర్వో
పాయంబులఁ గర్మములను
జేయు న్మానవుఁడటంచుఁ జెప్పిరి సుజనుల్. 104

గీ. అతిగురుత్వలఘుత్వము లప్రయోజ
కములు ఫలహేతువులుగాఁ దలంప
క్షితిననాయాసమునను గోక్షీరసాధ
నంబు గావించి చెలఁగు మానవుని మాడ్కి. 105

సీ. గృహములో దీపంబు కింగిరై యుండిన
నతుల తమోనాశమగుఁ దలంప
నతిధౌతమై స్థూలమగు కంచుపాత్రచే
నణుమాత్రమును తమమణఁగఁ గలదె
సరవిగా మాఘమాసము వారిసంస్పర్శ
స్వల్పమయ్యును నఘసమితి నణఁచు
మకరసంయుక్తుఁడై మార్తాండు డుండంగఁ
బూర్వోక్తవిధిని యద్భుతము గాఁగఁ
గీ. బేర్మిని జలావగాహము (విధియుతముగ)
నెవ్వఁడొనరించు హరిభక్తి హితము చెలఁగ
నతఁడొనర్చిన వాఁడగు నఖిలధర్మ
ములును గృతకృత్యుఁడై కాంచు ముఖ్యపదము. 106

ఆ.వె. మకరమాఘమునను మధువైరి చరితము
వినుచు నీటఁగ్రుంకి విష్ణుపూజ
సేయువాని కవ్విశేషఫలము కోటి
యజ్ఞఫలసమాన మండ్రు బుధులు. 107

సీ. కేతకీ కుసుమాలచేత సకృత్తుగా
హరినర్చన లొనర్చు నతఁడె సకల
కోరికలను జెంది చేరు వైకుంఠంబు
తులసీదళముల నుజ్జ్వలసువర్ణ
పుష్పంబులను విష్ణుపూజ చేసిన నేక
పత్రంబె కోట్యబ్జఫలము నిచ్చు
మాధవప్రతిమఁ బ్రేమ మహీసురునకు దా
నంబొసంగినఁ బద్మనాభపురము

గీ. గలుగుటరుదె యుషః స్నానఘనతఁ జేసి
బాల్య యౌవనవార్ధకప్రాప్తదుష్ట
చర్య దురితంబులును జను సత్సహాయ
వర్తుఁ దద్బలమేచెందుఁ గీర్తిమెఱయ. 108

వ. మఱియుఁ గ్రియాలోపవర్తనలు గలవారలు తద్దోషంబున దుర్దశలం
బొందుదు రెట్లనిన 109

లక్షణ యను వారవనితా ప్రభావము

క. కలదార్యావర్తనమహి
తలమున లక్షణయనంగఁ దగు వారవధూ
తిలకంబు దాని వల్లభుఁ
డలఘుఁడు శూద్రుండు దాసుఁడనువాఁడలరున్. 110

గీ. అది ఋతుస్నాతయై వల్లభాన్వితముగఁ
బొసఁగ గోదావరీతీరభూమినుండి
నిర్గతప్రాణ భర్తసన్నిధిని దుఃఖ
తాపమును జెందు నొక విప్రతరుణిఁ జూచి. 111

క. చేరంజని తత్పరివృత
పౌరజనము దాని దుఃఖభావము గని చిం
తారతి నుండఁగ నధిక వి
చారంబున విటుని వారసతి కని పల్కెన్. 112

గీ. బాల్యమున నీయవస్థలు ప్రాప్తమైన
మరణపర్యంత దుఃఖముల్ మగువలకును
తరళలోచన దుర్దశ తలఁగుకర్మ
మెవ్వరొనరింతు రేని చేయింతు నేను. 113

వ. అదియునుంగాక లలనకు విధవత్వంబును మృతసంతానంబును దుర్భరంబు లందులో బాల్యంబునఁ బతిహీనయయిన నుత్కృష్టఖేదం బది తొలంగు నుపాయంబు చింతింపుమనిన నతం డిట్లనియె. తొల్లి కమలసంభవుండు జనరక్షణార్థంబు మంత్రవిదులైన బ్రాహ్మణులం బుట్టించె వారలు శాస్త్రంబుల వలనను స్వభావంబుల వలనను జీవుల కర్మంబులెఱుంగు (దురుగాన) మంత్రవిదులైన భూసురోత్తములం దెలియుమనిన నవ్వారాంగన తీర్థార్థంబచ్చుటికి వచ్చియున్న యాజకుం డగు భూసురశ్రేష్ఠుంగని వందనంబాచరించి ప్రియపూర్వకంబుగ నిట్లనియె 114

గీ. వల్లభుని దండ తనవంకవారిఁ గూడి
చేయునది లేక యున్నది చింతనొంది
యీతరుణి బాల్యమునఁ బతిహీనయైన
వివర మనురక్తి నెఱిఁగింపవే మహాత్మ! 115

క. ఏకర్మం బొనరించిన
నీ కాంతవిభుండు బ్రతుకు నిచ్చుట గుణర
త్నాకర! యుపశమనక్రియఁ
జేకొనవే యనిన నతఁడు చేడియ కనియెన్. 116

మ. అళినీలాలక! దేవతాపితృలతో యత్నంబు గావించు వే
ళలఁ గాంతల్ సదనాంతరంబులఁ బనుల్గావించుచోటన్ రజ
స్వలలై భాండచయంబులంగలసి యోజన్ లోభలజ్జాభయం
బుల గోప్యంబొనరింపకుండు కతనన్ బుట్టున్మహాదుర్దశల్. 117

సీ. ఆదోషమునఁ దత్క్రియలు దూష్యములు తత్ క్రి
యాలోపముల లతాంగులకును
నియ్యవస్థలు చెందు నెపుడు ఋతుస్నాత
యై బాలుఁ జూచిన యతివ విగత
సంతానయగు రజస్వలయయ్యు డింభకు
నర్థిఁ గన్గొను కాంత యౌవనమునఁ
బతిహీనయగును బుష్పవతియై భాండసం
కరముఁ జేసిన వార్ధకమున నాతి
గీ. యగు వితంతువు పతి సేయునట్టి ధర్మ
ములకు ననుకూల గాని యాలలన బాల్య
మునసె నిజనాథరహితయౌ నెనసి యట్టి
తెరువు లెఱిఁగి నడువందగుఁ దెఱవలకును. 118

క. దీనికిఁ బ్రాయశ్చిత్తం
బైనది ఋషిపంచమీ మహావ్రత మది య
బ్జాననలు నియతవర్తన
తో నొనరిచి కడతు రెట్టి దుఃఖములైనన్. 119

గీ. లక్షవర్తివ్రతము నకలంకభక్తిఁ
జేసిన రజస్వల లొనర్చు చిరమమౌఘ
తతులు నిశ్శేషమగునన్నఁ దపసికపుడు
వందనమొనర్చి యావార వనిత పలికె. 120

క. హితమునను లక్షవర్తి
వ్రతము విధానంబు భవ్యవర! కరుణాసం
గతమతిఁ దెల్పవె నావుడుఁ
జతురమతిని యాజకుండు జలజాననతోన్. 121

<u>లక్షవర్తి వ్రత విధానము</u>

వ. లోకహితార్థంబు లక్షవర్తివ్రతస్థితియెల్ల నిట్లని వివరింపం దొణంగె. కార్తీక మాఘ వైశాఖంబులలో నేమాసంబుననైనను జేయవలయు. సర్వ మాసంబులకన్నఁ గార్తీకంబు పుణ్యకర్మంబులకు సహస్రగుణితంబు మాఘంబు. అంతకంటె వైశాఖం బనంతగుణఫలదంబు. తద్విధానం బెట్టిదనిన నొనరించుమాసపౌర్ణమికిం గ్రితంబు నూఱుదినంబులు గల్గుదినంబునఁ బ్రారంభించి నిత్యంబును వేయువత్తులు నియమంబు చేసి ఘృతంబైనను తైలంబైనను సంగ్రహించి విష్ణునకర్పితంబుగా దీపంబులం బెట్టవలయు వ్రతాదిఁ బ్రాతఃస్నానంబుచేసి పుణ్యాహంబు గావించి యాచార్యుని బ్రహ్మను ఋత్విక్కులను వరించి తిలాక్షతల తర్పణం బొనరింపవలయు. వర్తులలోన దశాంశంబు తర్పణంబులును తర్పణంబులలోన దశాంశంబు హోమంబును హోమంబులలో దశాంశంబు మంత్రవంతంబుగా పాయసంబును ఫలసమిచ్ఛయంబును ఘృతంబుతో విష్ణుగాయత్రినొడువుచు వేల్చవలయు. కలశస్థాపనంబు చేసి వస్త్రంబుమూసి తదధిదేవతను మాధవస్వరూపంబుగా స్వర్ణంబునఁ బ్రతిమనొనర్చి తన్మూర్తింబూజించునప్పుడు కాలాయనమః విష్ణవేనమః వహ్నినేనమః దీప్తాయనమః దిశాకరాయనమః రుద్రాయనమః శేషాయ నమః జగద్వ్యాపినేనమః తేజోరూపిణ్యేనమః జగత్ప్రభవేనమః స్వప్రకాశాయనమః స్వయంజ్యోతిషేనమః చతుర్వ్యూహాయనమః జనార్దనాయనమః పరబ్రహ్మణేనమః అని పూజించి వెండియు. 122

సీ. పాదముల్ (బూజింతుఁ బన్నగ) శాయికి
జానువుల్ పూజింతు శౌర్యనిధికిఁ
గటిపూజ సేయు దుద్భటదైత్యజితునకు
నాభిఁ బూజింతు శ్రీనాయకునకు
నుదరంబు పూజింతుఁ ద్రిదశరక్షకునకు
స్కందంబు పూజింతు శంకరునకుఁ
గంఠంబు పూజింతు గరుడవాహనునకుఁ
గరములు పూజింతు మురహరునకు
గీ. భుజము లొప్పంగఁ బూజింతు నజనుతునకు
ముఖము పూజింతు మందరశిఖరిధరున
కక్షువులు పూజసేయు దబ్జాక్షునకును
శిరము పూజింతు వైకుంఠపురపతికిని. 123

క. అని యంగపూజ యొనరిచి
ననుపొందఁగ ధూపదీపనైవేద్యాదుల్
ఘనభక్తి నొసఁగి యాచా
ర్యుని బ్రహ్మను ఋత్వికులఁ బ్రయోక్త విధోక్తిన్. 124

సీ. పూజలు గావించి భూరిదక్షిణల గో
దానంబొసంగి యుక్తముగఁ గాంస్య
పాత్ర వింశతినవమాత్రంబు గల యందు
లోన నాజ్యము నించి పైన బెందు
వత్తిహత్తించి యత్యుత్తమంబైన యా
చార్యున కిచ్చి భోజనము విప్ర
పుంగవుల కిడినఁ బూర్తియౌ వ్రతము భా
సురముగ నిది సేయు సరసిజాక్షి

గీ. ప్రాణపర్యంతమును మను భర్తతోడఁ
బౌర్ణమికి సాంతమైనఁ దద్ఫలము వినుఁడు
మంచి వాక్యంబులకు నుచ్చరించరాని
పాపపుంజంబు లెల్లను బాయు నపుడు. 125

క. అల ముప్పది పలముల కం
చలవడ లేకున్న నందు నర్థంబైనన్
వలయు నది తూఁగకుండిన
వలనొప్పఁ దదర్థమైన వలయుం జేయన్. 126

వ. ఇమ్మహావ్రతరాజంబు ప్రభావంబున చండాలగమనియు రజకగామినియు దుష్టచారిణియు మాతులగమనియు జనకసహోదరగమనియు భ్రాతృవర్తనియుఁ బుత్రవర్తనియుఁ బతిహంతబాలహంతలును బితృమాతృ హంతలును గోవధూహంతలును జోరిణియు రజస్సంకరాకారిణియు గృహదాహియు విషదాయకియుఁగలహకృత్యయు భర్తానంతర సంతానియు క్షత్రియార్యప్రసరియు మొదలయిన కామినీజనంబులీ వ్రతమాహాత్మ్యంబునంజేసి బ్రహ్మహత్యాదిపాతకయుక్తంబైన సమస్త దురితంబులం బాయుదురు పురుషులొనరించిన ననంతమహాకోటి పాతకంబుల నివృత్తులగుదురు కావున లక్షవర్తిదీపంబులు విష్ణుకర్పితంబు సేయునంతకంటె వ్రతంబులేదని లక్షణతో యాజకుం డిట్లనియె. 127

క. ఇది యొనరింపుము నీ విది
యొదవించిన సిద్ధియౌను ఏలడిగితి ప
ద్మదళాయతాక్షి! యనవుడు
నది వెండియు నమ్రయై మహామునితోడన్. 128

చ. అనఘవిచార! యింతటి ప్రయత్నము చంచలచిత్తురాల నే
నొనరుప నేర్తునే కరుణ నొందువిధంబు దలంపుc డంబుజా
నన కడుబాల దీని నిజనాథుcడు జీవితుcడౌ వ్రతంబు గ్ర
క్కునc గలదేని యిప్పుడ యకుంఠితభక్తి నొనర్తు నావుడున్. 129

చ. ఇదె మకరస్థుc డయ్యెను దినేశుcడు నేc డవగాహ మిమ్మహా
నది నొనరించి స్నానము ఘనంబుగ విష్ణునకర్పితంబు పెం
పొదవcగc జేసి తత్ఫలమనూనతc జేడియకిచ్చినన్ వడిన్
గొదవ యొకింతలేక బ్రతుకున్ గడు నద్భుతలీలc గోమలీ! 130

క. క్షయరోగంబున నీతcడు
నియతింబ్రాణములు బాసె నీవు పరహిత
క్రియ నొసcగు మాఘపుణ్యో
దయమున నీక్షణమె బ్రతుకుc దామరసాక్షీ! 131

గీ. ఈ లతాతన్వియును బ్రియంబెసcగc గాంస్య
పాత్రలో వర్తిc దగనుంచి పద్మినీద
ళేక్షునకును హారతి(భక్తి) నిచ్చెనేని
ప్రాణపర్యంతమును మను భర్తతోడ. 132

చ. అనవిని వారవారిజదళాంబక యన్నది వారిcగ్రుంకి యిం
పెనయ జలావగాహము రమేశున కర్పణమొప్పc జేసి త
ద్ఘనఫలమిచ్చె నాక్షణమె గ్రక్కున నాసతి భర్తలేచె స
న్మనులును బంధువర్గమును మోదము విస్మయమున్ జెలంగగన్.

క. వారసతియంత విటుచే
ధీరత నొకకాంస్యపాత్రc దెప్పించి సవి
స్తారమతి విప్రకన్యకు
సారమతిం దానమిచ్చె సత్కృతి వెలయన్. 134

క. ఏతద్వ్రతప్రభావము
చేతను ధనధాన్యపుత్రచిరతరపుణ్య
వ్రాతములు గల్గి పతితో
నాతన్వి ధరిత్రి మనియె నధికాబ్దంబుల్. 135

వ. అవ్వధూవరులును వారి బంధుజనంబులు స్నానార్థంబు వచ్చిన తటస్థులు బహువిధంబుల వారాంగనం బ్రశంసించిరంత నా గణికయు విటుండును సుస్నాతులై లక్షవర్తివ్రతంబాచరించి కొన్ని వర్షంబులు మని కాలవశంబునఁ బంచత్వంబునొందిన మాఘస్నానమహిమంజేసి యా విటుండు భూచక్రంబునం జక్రవర్తియై పరాక్రమంబున నఖిల ద్వీపంబులు పాలించుచు గయుండనాఁ బరగె లక్షణయును సర్వలక్షణ సంపన్నయై గయుపట్టపు మహాదేవియై యుదయించి కీర్తిగాంచె నది గావున పరులకు సహాయంబుసేయుట యుత్తమంబు స్నానంబునకు శక్తుండు గాడేని మాఘశుద్ధసప్తమి ద్వాదశి పౌర్ణమియను నీ త్రిదినం బులు స్నానంబు సేసినవాఁడు పూర్ణఫలంబు గల్గి విష్ణులోకప్రాప్తుండై వర్తించుఁ ద్రిదినంబులకుంజాలండేని పౌర్ణమినైనను నొనర్చిన ముక్తి సిద్ధించు రోగార్తుండేని పాదప్రక్షాళనంబు చేసికొని ధౌతవస్త్రంబు ధరి యించి త్రిరాచమనంబొనర్చి గాయత్రి చేత మంత్రించి యుదకంబు శిరంబునంజల్లుకొన్న స్నానఫలంబు సిద్ధించు మోక్షంబునుం గల్గునని మఱియు నిట్లనియె. 136

గీ. మకరసంయుక్తమగు మాఘమాసమునను
స్నానమొనరించి తులసికాచ్ఛదములను ర
మేశు నర్చించి మఱియుఁ బఠించవలయు
మాధవస్తవరాజంబు మనుజులెందు. 137

సీ. నీలవర్ణుని నొక నెలను పూజించి త
త్ప్రతిమ నీయందగు బ్రాహ్మణునకుఁ
బొసఁగ నిట్టివ్రతంబు పూర్తిగావించిన
యతని పుణ్యము కడ యడుగనేల

కోటిజన్మముల మిక్కుటమైన బ్రహ్మహ
　　　త్యాదులు దుస్తరాఘౌఘములును
దూల మగ్నికణంబుచే లీనమగుగతి
　　　నణఁగు నిహంబున నధికభద్ర
గీ. కలితుఁడై పుత్రపౌత్రులుగల్గి దుష్ట
రోగబాధలఁ జెందక భోగమహిమఁ
బ్రబలి తోటికులజులతోఁ బన్నగేంద్ర
తల్పు నిజధామమునను మోదమున నుండు. 138

గీ. కలియుగంబున వివిధ దుష్కర్మములకు
ఖరకరోదయ మాఘావగాహనంబు
సర్వదుఃఖోపశమనంబు సకలభయని
వారణము భద్రములకెల్లఁ గారణంబు. 139

సీ. శీతార్థులగువారి చెంగట నెగడిడు
　　　నతఁ డగ్నిలోకంబు నందునుండుఁ
గరమొప్పఁ జిమ్మిలి హరికర్పితముగానొ
　　　సవిన యతఁడు మృత్యువు జయించు
వెలయఁ గుంచెడు నెయ్యి విప్రునకిచ్చిన
　　　నపమృత్యుదోషంబు నతఁడు గడచుఁ
దగ నిత్యతాంబూల దానంబొనర్ప ద
　　　రిద్రుఁడుగాక సిరిం దనర్చు
గీ. గోపికాచందనధరుండు కోటి వేల
బారువులు గురుజాంగల ప్రాంతమునను
పరగ దానంబు సమకూర్చు ఫలముగాంచుఁ
జెలఁగి యివి మాఘదినములఁ జేయవలయు. 140

గీ. వరలు తండులములచేత వైశ్వదేవ
మర్థి మాఘంబునం జేయునతఁడు నరక
వసతిచూడఁడు నూరేళ్ళు వసుధఁ బ్రబలి
యంతమున నిత్యసుఖుఁడగు నమరపురిని. 141

గీ. మాఘపౌర్ణమి మధువైరి మందిరమున
తైలమునదీపమిడ్డ సద్ధర్మమూర్తి
యబ్జనయను నసుజ్ఞచే నంతమునను
దలఁపఁ గులకోటితో నుండుఁ దత్పురమున. 142

క. ఒకదినమైనను మర్త్యుఁడు
మకరస్నానంబుచేసి మధువైరి కథా
ప్రకరణము క్షణము విన్నను
సుకరంబుగ విష్ణుపురముఁ జూచునతండున్. 143

క. తిలపాత్ర మాఘదినముల
సలలితముగ దానమిచ్చు జనునకు గ్రహపీ
డలు వొరయనేర వాతఁడు
బలమర్దను లోకమున శుభస్థితి నుండున్. 144

వ. ఇది నిమిత్తంబొక్క యితిహాసంబు గల దవహితమతులై విన్న శత
జన్మార్జితదురితనివృత్తియగునని శాండిల్యుం డప్పురుషుల కిట్లనియె.
పూర్వంబున 145

లుబ్ధకోపాఖ్యానము

ఉ. దారుణ నామ లుబ్ధకుఁ డుదగ్రబలుం డతిసాహసక్రియా
క్రూరుఁడు లోకకంటకుఁడు రూఢిమెయిన్ సరయూసమీప వి
స్తారవనాంతరంబున నజస్రమున న్విహరింపుచుండు దు
ర్వారభటాశ్వ (వార వినివా) రితదూరిత జంతుజాలుఁడై. 146

గీ. కర్కటాండజ మృగపక్షికమఠములను
శశకగవయ కిటివ్యాఘ్రసామజములఁ
గణఁకఁ (జిక్కముల వ) లల గాలములను
జిక్కు వరచి వధించి భక్షింపుచుండు. 147

క. మొఱ్ఱులగు బోయిపోతుల
కిట్టి లెఱిఁగి వెంటఁ దగిలి కినుకను రాత్రుల్
గొఱ్ఱెలను మేకకదుపుల
బఱ్ఱెలనుం బసులఁ జంపుఁ బల్లెలయందున్. 148

క. కాలరులఁ గూర్చి రథికుల
చే లంపులు సాదమ్ము తిను విశేషతురంగీ
జాలముల నపహరించున్
మేలెఱుఁగక తిరుగు నాల మృత్యువురీతిన్. 149

వ. ఇవ్విధంబున విహరింపుచు నొక్కనాఁ డేకతంబున సరయూతీరోపవన సమీపంబునఁ బుణ్యక్షేత్రాంతరంబునఁ గుటీరనికటంబున గాలంబుచేత ఝషంబులం బట్టుచుండి తత్సమయంబునఁ బ్రాతఃస్నానార్థంబు చనుదెంచిన బ్రహ్మవేత్తలైన భూసురులు సరయూమహానది నవగాహనం బొనర్చి నిత్యకర్మంబులుదీర్చి తదీయ తటాశ్వత్థ మూలంబున మాధ వార్చన నొనర్చి గాలవమహామునీంద్రువలనఁ గథలు వినుచున్నంత

క. ఒక సారసవిహగంబును
నొకధాత్రీధరచరము తదున్నతవిటప
ప్రకరముల నుండి దైత్యాం
తకుని కథలు క్షణము వినియెఁ దాత్పర్యమునన్. 151

క. అంతట నారెంటికి న
త్యంతజ్ఞానంబు గలిగె నట మర్కటకం
బెంతయు విహగముఁ బట్టెడు
చింతన్ దచ్ఛాఖకుఱికెఁ జిత్రస్ఫురణన్. 152

క. ఆరీతి నుతికి పట్టిన
సారసమును ఱెక్కలార్చి చకితగతిఁ దదా
ధారంబు దప్పి గ్రక్కునఁ
బారి నదింబడి మునింగి పడెనా రెండున్. 153

గీ. అటు లహర్ముఖమున నదియందు మునిఁగి
ప్రాణములు బాసి దివ్యరూపములు దాల్చి
హరిభటులు దెచ్చినట్టి బంధురవిమాన
మతి ముదంబుననెక్కి ధన్యతవహించి. 154

క. సురకన్యల గానంబులు
కర మిష్టము గాఁగ వినుచు గగనపదమునన్
హరిపురికి నేఁగువారలఁ
దిరముగ నా లుబ్ధకుండు తెలియంజూచెన్. 155

గీ. చూచి దుష్టస్వభావంబు దాఁచిపెట్టి
వినయమున గాలవునికి వందనమొనర్చి
తాపసవరేణ్య! యొకటి చిత్రంబు గంటి
ధీరమతి నది వినుము నేఁ దెలియ నిచట. 156

క. మీనములఁ బట్టుచున్న న
నూనత నీచెట్టు కొమ్మనొకపక్షిని బల్
వానరము పొదువ రెండు మ
హానదిఁ బడి దివ్యమూర్తులాయె మహాత్మా! 157

వ. ఆక్షణంబ విమానారూఢులై యిరువురుఁ బుణ్యలోకంబున కరిగినవారిం జూచి మహాశ్చర్యంబు బొంది దుష్టభావంబు విడిచి మిమ్ము నడిగెద నను తలంపున వచ్చితివారలెవ్వరు పూర్వంబున నేకర్మంబున దిర్యగ్యోను లందు జన్మించిరి యెట్టివిశేషంబున ముక్తులైరి పరమ కరుణారసదృష్టి దీనిని విస్తరింపవే యనిన గాలవుండు ప్రశాంతచిత్తుండైన లుబ్ధకునితో స్నానార్థులై వచ్చిన జనంబులు విన నిట్లనియె. 158

సీ. క్రమమున విను వానరము పూర్వభవమున
పైఠినీశీకుల బ్రాహ్మణుండు
కనకాహ్వయుండనాఁ గనఁదగు వాఁడు నె
మ్మదిలోన విదిత ధర్మములు విడిచి
హరికథావిరహితుండై విప్రగణముల
నిందించు హాస్యంబు నెరయ సకల
కర్మముల్ వర్జించి కలుషకృత్యములచే
విహరింపఁగా బ్రహ్మవేత్తలైన
గీ. పెద్దలాతని దూషింపఁ బెంపుఁదక్కి
యణఁగి వానరమైపుట్టి యవని నీ మ
హీరుహాగ్రంబునందుండి శౌరిసత్క
థాశ్రవణమున నెఱుక చిత్తమునఁ గలిగె. 159

క. కల్యమున నిన్నదీ స్థై
కల్యంబున (?) మునిఁగి యపుడ ఘనతరమగు కై
వల్యంబు గాంచె ఘన సా
ఫల్యత నిఁకఁ దెలియ వినుము పక్షి తెఱంగున్. 160

సీ. క్షత్రబంధుండను ధాత్రీవిభుం డనా
రతమును భోగసంగతిఁ జెలంగు
మకర మేష తులలఁ బ్రకటించియెన్నఁడు
స్నానదానంబులు సరకుగొనక
యుండంగ నొక్కనాఁ డుర్వీసురుండు వై
శాఖంబునను పథశ్రమమునొంది
వచ్చినఁ బ్రియముతో వలయుమృష్టాన్నంబు
భుజియింపఁ బెట్టించెఁ బూర్తిగాను

గీ. దానఁ జేసి జాతిస్మరత్వంబు గలిగెఁ
గలుషములకతన జనించె ఖగకులమున
విష్ణుదేవుని చరిత మీ వృక్షశాఖ
నుండి విన్నంత నయ్యె జ్ఞానోదయంబు. 161

గీ. వినుము పూర్వకృతోద్వృత్తి విధివశమున
మర్కటగ్రస్తమై మాఘమాసమునను
ఖగము ప్రత్యూషమున నీటఁ గలసి తత్ప్ర
భావ (మునఁ బుణ్య) లోక సంప్రాప్తిఁ జెందె. 162

క. నను నీవడిగితి గావున
వినిపించితి ననిన వాఁడు వినయంబున నో
ఘనపుణ్యచరిత! జనియిం
చినమొదలు నొనర్చినాఁడ చిరపాపంబుల్. 163

క. కించిన్మాత్రము ధర్మ ము
దంచితమతిఁ జేయ నేను తగమోక్షము సి
ద్ధించు విధమెద్ది యాయువు
చంచన్మతి! యెంతగలదు సంయమివర్యా! 164

వ. అని ప్రియపూర్వకంబుగా నడిగిన గాలవుండు ధ్యానదృష్టిం జూచి బోయతో నిట్లను నీకునాయువు ముహూర్తద్వయంబు మాత్రంబుగాని లేదు నీవింకఁ గొంకక మాఘశుద్ధత్రయోదశి నేఁ డిమ్మహానదియందు మాధవస్మరణ సేయుచుం బ్రాతఃస్నానంబు విధివంతంబుగా నొనర్చిన యనంతరంబ గజేంద్రమోక్షంబు పఠియించి సర్వసంగపరిత్యాగివై చిత్తంబునం బరమాత్ముండైన రమాధీశ్వరుధ్యానంబు చేసిన మాధవాను గ్రహంబున మోక్షంబు సిద్ధించు ననిన నమ్మౌని పలుకులు విని హర్షించి యాక్షణంబ లుబ్ధకుండు సరయూజలంబులం గృతస్నానుండై నిజ హృదయంబున 165

క. హరిఁజింతింపుచు నిశ్చల
గరిమన్ బాహ్యంబు మఱచి గాలవమౌనిన్
గురునింగా భావింపుచు
నురుతర గతినున్న నమ్ముహూర్తము నందున్. 166

క. తనువు దొఱఁగి చనుదెంచిన
ఘనదివ్యవిమానమెక్కి కమలాక్షుపురం
బున కరిగె నా కిరాతుఁడు
మనుజులకు నుతించ వశమె మాఘము మహిమల్. 167

క. వానర ఖగ లుబ్ధకులు మ
హా నియతిని యోగిజనుల కందని పదమున్
స్నానంబున విష్ణుకథా
ధ్యానంబునఁ గాంచి రధికధన్యత వెలయన్. 168

వ. అంత నా గాలవమహామునికి వందనంబాచరించి కుటీరస్థులు బహు విధంబుల స్తోత్రంబులు చేసి మహాత్మా! యీ యర్థంబు పురాతన శాస్త్రంబుల విందుము నేడునీకతంబునఁ బ్రత్యక్షంబయ్యె మాఘస్నాన మాహాత్మ్యంబును హరికథాశ్రవణంబునుంగాని యింతకంటె నధిక ధర్మంబులులేవని మాహృదయంబుల నున్నయది. మీవంటి సత్పురుషుల సాంగత్యంబున జ్ఞానహేతుకంబగు సూక్ష్మదృష్టింజేయబడ్డ ధర్మంబులు విశుద్ధమనస్కులైనజనులం బవిత్రత్వంబు నొందించు. మాఘమాహాత్మ్యం బింకను విన వేడుకయ్యెడు నందుల విశేషంబు లెఱింగింపుము శిష్యులము సేవకులమునైన మాకు సత్కృపాలోకనంబున నీక్షించి వివరించుమన గాలవుం డిట్లనియె. 169

మాఘ మహిమము

గీ. ఎవ్వఁడైనను మాధవహితకరముగ
మాఘదినమున సుస్నానమహిమఁ జెంది
శ్రీధరునిఁ జూచి విరులఁ బూజించు నతఁడు
విష్ణులోకనివాసుఁడై వెలయుచుండు. 170

క. స్నానాంతరమున విష్ణు
ధ్యానము గీతాపఠనము దగఁ జేసిన యా
మానవుని పుణ్యమహిమకు
మానుగ సామ్యంబులేదు మతినూహింపన్. 171

సీ. శ్లోకపాదంబైన శ్లోకార్ధమైనను
భాగవతంబు లోపలిది యొక్క
శ్లోకంబు నరుఁడు సుశ్లోకుఁడై మాఘమా
సమున నహర్ముఖ సమయములను
వరుసఁ బఠించ జీవన్ముక్తుఁ డనఁదగు
నవగాహమొనరించి నపుడు భాగ
వతము పఠించుచు వనజనాభునిఁ బూజ
చేసినఁ గైవల్యసిద్ధియగును

గీ. సరవితోడ గజేంద్రమోక్షంబు స్నాన
మర్థి నొనరించి చదివినయతనిఁ బద్మ
నయనుఁ డెల్లప్పుడును బ్రోవ నియతిఁ దలఁచి
కోరిక లభీష్టతతు లొనగూర్చుచుండు. 172

క. ఇల భాగవత సుశాస్త్రము
పొలుపొంద లిఖించినట్టి పుస్తక మే ని
శ్చలహృదయు నింటనుండిన
వెలయుం దద్గృహము విష్ణువినుతస్థలమై. 173

సీ. ఒనర మాఘావగాహన మొనర్చి విభూతి
విశ్వరూపస్తుతుల్ వెలయఁ జేయ
భవ్యపుణ్య మనంతఫలము తత్పరతను
పాదమైనను భక్తిఁ బఠనసేయు

నతఁడు నిష్పాపియై యమరత్వమొందును
శ్లోకార్థమైనను శ్లోకమైన
వచియింపఁగా నిరువదియొక్క కులముతో
సత్యలోకప్రాప్తి జనుఁడు గాంచు

గీ. నింక పద్యద్వయమ్ము పఠించెనేని
కలుషహరమగు నొకటిచేఁ గడమ మధ్య
మునను సిద్ధంబుగాఁ జెందు మోక్షపదము
మాధవారాధనాసక్త మానవుండు. 174

వ. మఱియు మాఘస్నానంబుచేసి విభూతి విశ్వరూపాధ్యాయములలో సుశ్లోక త్రయపఠనగావింప రెంట సంసారనాశంబును మోక్షంబు నొసంగు తృతీయశ్లోకంబున హరి రుచికుండైయుండు నధ్యాయ పఠన ఫలంబు నొడువ కల్పశతంబులనైన నేరికి శక్యంబుగాదు. అధ్యాయ ద్వయ పఠనఫలంబు బ్రహ్మ విష్ణు రుద్రులకైన వచియింప నలవి గాదు. 175

గీ. అర్కుఁడుదయింపకయమున్న నర్థి మాఘ
మునను సుస్నాతుఁడై మాధవుని భజించి
మాధవస్తవరాజ మేమరక పఠన
సేయ సర్వాఘములును నశించునంద్రు. 176

క. వైజనన మాధవస్తవ
రాజము పఠియించుజనులు రవిమండల ము
ద్వేజగతి విభేదించి వి
రాజితసాయుజ్యపదవిఁ బ్రబలుదు రెలమిన్. 177

క. హరినామసహస్రము సు
స్థిరమతి ముమ్మాఱు పఠనచేసిన ఫలమున్
దొరకొను సుస్తవరాజ
స్మరణంబున ననుచు బుధసమాజము నొడువున్. 178

క. అనినం గుటీరవాసులు
మునితో స్తవరాజ మతులముఖ్యము భవ్యం
బని పలికితి రది తెలియఁగ
వినుపింపుము మాకు వినుత విమలగుణాఢ్యా! 179

వ. అని యడిగిన 180

**ఆశ్వాసాంతము**

మ. హరిదశ్వప్రతిమానతేజ సుషమాహంకార తారాశ (?) స
ద్గురుసేవాపరతంత్ర నైజమహిమాస్తోక ప్రభాభోజ సు
స్థిరసర్వజ్ఞ విశేషపోషితకవిశ్రేణీమరుద్భాస్వర
స్వరసౌభాగ్యసుయోగ భోగసురరాజా రాజమానోదయా! 181

తోటకము :

ధరణీసురరక్షణధర్మమతీ!
సురసానుసమానవిశుద్ధధృతీ!
పరిపూర్ణదయాన్వితబంధుయుతా!
వరసద్గుణశోభిత! వశ్యసుతా! 182

మాలిని :

సురనగసమధైర్యా! శుద్ధహేమోపకార్యా!
నిరతవినుతభూపా! నిత్యతేజఃప్రదీపా!
సరససుకవిపోషా! సాధుసౌశీల్యభూషా!
హరిపదనలభృంగా! హారిపుణ్యానుషంగా! 183

గద్య. ఇది శ్రీమద్వరాహగిరి లక్ష్మీనృసింహ వరప్రసాదలబ్ధ సారస్వత విచిత్రాపస్తంబ సూత్ర కాశ్యపగోత్రపవిత్ర వడ్లపూఁడి వెంకటమంత్రిపుత్ర సకలసుకవిజనవిధేయ పెద్దయనామధేయ ప్రణీతంబైన వాయుపురా ణంబునందు మాఘమాహాత్మ్యంబను మహాప్రబంధంబున యమ నియ మాద్యష్టాంగ యోగలక్షణంబులును పుణ్యధాముని చరిత్రంబును సువృత్తవృత్తోపాఖ్యానంబును నారదుండు నారకి జనంబుల విష్ణులోకం బున కనుపుటయును లక్షణవనితాప్రభావంబును లక్షవర్తి వ్రత విధానం బును ప్లవంగ విహంగ మోక్షణంబును దారుణాహ్వాయ లుబ్ధకుండు ముహూర్తద్వయంబున మాఘస్నానంబుచేసి నిర్మలధ్యానపరుండై కైవల్యంబు నకుం జనుటయు విభూతి విశ్వరూపాధ్యాయ ఫల విశేషంబులు నను కథలు గలయది చతుర్థాశ్వాసము.

శ్రీః

# మాఘమాహాత్మ్యము

## పంచమాశ్వాసము

క. శ్రీమత్కమ్మకులాంబుధి
సోమా! శాస్త్రాభిరామ! శూరవినుతసం
గ్రామ! బుధబాంధవాశ్రిత
తామరసవనీపతంగ! దాసరిగంగా! 1

వ. అవధరింపుము వివిధ పుణ్యపురాణేతిహాస ప్రసంగవిఖ్యాతుండైన సూతుండు హరికథాశ్రవణసమ్మోదులగు శౌనకాదుల కిట్లను నట్లడిగిన కుటీరస్థులతో గాలవమహామునీంద్రుఁ డిట్లనియె 2

మాధవ స్తవ ప్రశస్తి

క. పాదక్షాళన మాచమ
నాదులుఁ దగఁదీర్చి స్వస్తికాసనుఁడగుచున్
శ్రీదయితుని మదిలో సం
పాదితుగాఁ జేయవలయుఁ బఱియించుతఱిన్. 3

గీ. చిన్మయుని స్వస్తికాసనాసీను యోగ
ముద్రికాపుస్తకాంచితు మోదచిత్తుఁ
డైన సద్గురు సాధు హృదంతరమునఁ
దలఁచి వినుతించి ప్రతిమఁ దాఁ దగఁగ నునిచి. 4

సీ. తదనంతరంబున దక్షిణదిశయందు
భావంబులోపల బ్రహ్మహత్య
మస్తకంబుగను స్వర్ణస్తేయమే భుజ
ద్వయముగఁ దాపమె స్వాంతముగను
క్రమమున గురుతల్పగము కటిస్థలముగాఁ
దద్యోగవృత్తి పాదములు గాఁగ
నంగదోషములు సర్వాంగంబులుగ నుప
పాతకంబులు రోమపంక్తులుగను

గీ. రక్తవర్ణంబులై తనరారు నేత్ర
ములును శ్మశ్రువులును గల్గి భూరికృష్ణ
వర్ణమున ఖడ్గధారియై వరలు పాప
పురుషుని జయింపవలయు నేర్పున నరుండు. 5

క. అనువున నాభిస్పర్శన
మును దద్గత వాయు బీజమున్ దలఁచి హరిన్
ఘనవర్ణుగాఁగ షట్కో
ణనిరూపితచక్రనిలయు నతిసేయఁదగున్. 6

క. వాయువుచే ఖలపురుషున్
జేయఁగవలె దూషణంబు శిఖిమండల సం
స్థాయియగు విష్ణు హృద్వన
జాయత్తునిగా నొనర్చి యంతన్ మఱియున్. 7

ఆ.వె. యోగినిఁ ద్రికోణయుక్తుని రక్తాంగు
హరిఁ దలంచి దేహ మాశ్రయించి
యున్న పాపపురుషు నుగ్రాగ్నిబీజంబు
చే దహించవలయు సిద్ధముగను. 8

చ. శిరమున హస్తపంకజము చేర్చి చతుర్దళరూపమై యినా
వరణవిమండలస్థమయి వర్తిలి సుస్ఫటికోపమానమై
పరగఁగ దేహముందలఁచి భావనచేసి సుధారసంబుచే
నరులొనరింపఁగాఁ దగు మనఃస్థిరవృత్తి జనార్దయోగమున్.

వ. మఱియు గాయత్రీమంత్రంబుచేఁ బంచాంగన్యాసంబొనర్చి హృన్మూర్ధ శిఖా నేత్రపదంబులందు మాధవ కేశవ నారాయణాచ్యుత విష్ణవే నమో అస్త్రాయ ఫట్ అని యంగన్యాసంబుప్రయోక్తవ్యంబు నరులకు సర్వకర్మ పాపోపశాంతియు భుక్తిముక్తిప్రదంబును నఖిల రోగనాశనంబునునై చెలంగు. 10

సీ. వినుతార్తిహరణ గోవిందాచ్యుతానంత
భవదీయవినుతిచే భావశుద్ధి
సమకూర్పుమీ కర్మసాక్షి హృషీకేశ
యెపుడు ధర్మములందు నింద్రియంబు
లనుకూలమైయుండు నట్లుగాఁ జేయుమీ
సూర్యగంబైన చక్షువులు గలుగు
శుభగ! సూర్యాహ్వయ! సూరిసేవితమైన
సుకృతిపద్ధతి నాకుఁ జూపవయ్య

గీ. సకలదిగ్రూపకశ్రుతిస్థాయి సర్వ
గోచరుఁడ నీదు కథలు చేకురుగఁ జేయు
శ్రుతివిబోధితమైన మచ్ఛ్రోత్రములకు
హరి సదానంద పరమాత్మ యని మఱియును. 11

క. నాసస్వరూపి విష్ణుఁడు
నాసస్థుం డవ్యయుం డనారతము వర
శ్రీసౌరభయుతముగ మ
న్నాసికముం జేయుఁగాత ననిచిన కరుణన్. 12

సీ. ఇరవొంద జిహ్వాత్మ వరుణస్థుడౌ(హరి)
సన్మాధవుఁడనంత శక్తిధరుఁడు
జిహ్వఁ దపోరుచిఁ జెన్నొందగాఁ జేయు
ప్రాణాత్మకుండనఁ బరగు విష్ణు
డలరు త్వక్స్పర్శల కాద్యుఁడై తత్కృత
పాతకంబులు భంగపఱచు నెపుడు
ఘస్తఘ(?) నామముల్ గల భగవంతుఁడు
హరుఁడు సర్వవ్యాపి యగు విభుండు

గీ. వ్యోమకృతపాతకంబుల నామమణఁచు
వాయుగురువాయు వనుపేర వరలు శౌరి
వాయుగుణదోషములను సర్వంబణంచు
ననుచు మఱియును భజన సేయంగఁ దగును. 13

సీ. వహ్నినామంబున వరలుతేజస్థుఁడై
యతులస్వయంజ్యోతియైన శౌరి
ప్రతిభఁ దేజోభూతకృతపాతకంబుల
నణఁచును తోయస్థుఁ డైన విష్ణుఁ
డఖిలజీవప్రతుం డంబుసంభవపాప
చయములఁ ద్రుంచు భూస్థాయి యగుచు
భూమినామంబునఁ బొల్చు జగన్మూర్తి
భూభూతకృతదోషముల హరించు

గీ. నభవుఁడు జనార్దనుఁడు విష్ణుఁడార్యుఁడును మ
హద్గతుండు మహత్తు తానైన చక్రి
యెపుడు కర్మనిధానంబు లెల్ల నణఁచు
సత్కృపాలోకనమున నిశ్చలతఁ బరగు. 14

సీ. అనుజగద్ధేతు నిరాశ్రయుండౌ యహం
కారి విష్ణుం డహంకార జనిత
కలుషనాశమొనర్చుఁ గామరూప ప్రవ
ర్తకుఁడై మనస్థుఁడై తగు విభుండు
తా మానసకృతపాతకనాశ మొనరుచు
బుద్ధినామంబున బుద్ధియందు
బోధాత్మహరి బుద్ధిపూర్వకృతాఘంబు
లణఁచు వాక్స్థితవహ్ని యగు గుణాశ్ర

గీ. యుండు వాచాకృతాఘంబు లొగి నణంచు
హస్తకుండును హస్తుండునైన విష్ణుఁ
డెపుడు హస్తకృతాఘంబు లెల్లఁ గరుణ
దలకొన నణంచు నని మదిఁ దలఁచి మఱియు. 15

సీ. పాదస్థుఁడై పక్షిపతి వాహనుండగు
భగవంతుఁ డంఘ్రిసంభవకృతాంహ
మణఁచు గుహ్యస్థుఁడై యతిగుహ్యమూర్తియౌ
కృతి రమాపతి శిశ్నకృతమహౌఘ
మణఁగించు (నీరీతి) హరి! కృష్ణ! శంఖచ
క్ర గదాసిధర! సార్వకాలమీవు
రక్షింపుమీ నన్ను రామ! వామన! బలి
ధ్వంసి! విశ్వాత్మ! భూస్థలులయందు

గీ. నెపుడుఁ బ్రోవు త్రిధామ త్రయీమయా! త్రి
విక్రమాఖ్య త్రికాలజ్ఞ వియదధీశ
గగనతత్వమునందు రక్షణము సేయు
మనుచు సద్భక్తియుక్తిచే ననఁగవలయు. 16

సీ. హరివజ్రకల్ప నఖాయుధనరసింహా
దుర్గాంబికాగ్రహాదుల భయంబు
వలన రక్షింపుము వారాహమూర్తివై
ధరణి వహించు మాధవపథంబు
నను బ్రోవుమీ శార్ఙ్గి నారాయణా జయ
దుఃఖప్రమాదముల్ ద్రోచిప్రోవు
మాత్రేయశ్రోత్ర దత్తాత్రేయ యోగవి
హీనునిన్ నన్ బ్రోవుమీ మహాత్మ

గీ. నను హయగ్రీవ కపిల సనత్కుమార
మూర్తివగు నీవు భవబంధములను బాపు
సర్వభూతభయావహ జగదధీశ
ప్రోవుమీ ఘోరనరకాప్తిఁ బొందకుండ. 17

శా. జ్ఞానానందుఁడు విశ్వభేషజుఁడనంగా నొప్పు ధన్వంతరీ
శ్రీనాథాహ్వయ దుఃఖపథ్య భయదుశ్చిత్తంబులం బాపు స
న్మౌనిస్తుత్య తతాత్మ యజ్ఞవృషభానంతా ననుం బ్రోవుమీ
ధ్యానారూఢమనఃప్రయుక్తుని హతద్వంద్వాశ్రయుంగా మదిన్. 18

క. మును కృష్ణద్వైపాయన
మునివై మఱి బుద్ధకల్కిమూర్తివి యగు చి
ద్ఘనసుజ్ఞానప్రద న
న్ననిశము రక్షింపుమయ్య హరి! సర్వాత్మా! 19

గీ. కృష్ణ దామోదరాచ్యుత కేశవేశ
మాధవానంత! ప్రాతస్సమయము సంగ
మంబు మధ్యాహ్నమను త్రికాలంబులందు
రక్షణము సేయుమీ ఫణిరాజతల్ప! 20

వ. మఱియు శ్రీవత్సాంకా!శ్రీమచ్చక్రపాణీ! భవార్తిహా! యజ్ఞానాంధకారంబు వలనను వాసుదేవ! చతుర్భుజ! నాసేయు జ్ఞానకృతపాపంబు వలనను వేదసార! సత్యవిక్రమ! జగత్త్రాణ! యజ్ఞానజనితమహౌఘంబులవలనను సర్వపాతకహరణ! సర్వావస్థనియామక! విస్మృత మహాపాపంబుల వలనను పరానంద! పరబ్రహ్మ! సత్యబోధాత్మక! ధ్యాన రహితమహా పాపంబుల వలనను సర్వసాక్షి! సర్వకర్త! శివప్రద! శివరూప! సుశివ! జ్ఞానరాహిత్యంబు వలనను యజ్ఞకర్త! యజ్ఞభోక్త యజ్ఞస్వరూప! యజ్ఞ సాధన! మాధవ! క్రియాత్యాగ మహాపాపంబుల వలనను భక్తవత్సల! నిఖిలాధార! నిరామయ! పుణ్యకీర్తి! మాధవ! ఆగతమహౌఘంబుల వలనను నిర్గుణానంత! నిశ్చల! నిరాకార! నిరంజన! గుణత్రయ కృతదోషంబుల వలనను దాక్షిణ్యార్థలోభంబులవలనను దుష్టసాంగత్య కృతాఘంబుల వలనను ఆలస్య దుష్టభావంబుచే మోక్షోపాయం బసాధితంబయ్యె నయ్యపరాధంబువలనను అగమ్యాగమ నాభక్ష్యా భక్షణల అకార్యకరణపాపంబుల వలనను భోగలౌల్యదురాచార దుస్సాంగత్య దుష్ప్రతిగ్రహపాతకంబుల వలనను వహ్నిత్యాగదురాలాప సంధ్యాదికర్మలోపభగవత్పూజావిహీన పాపంబుల వలనను ఏకాదశీభుక్త శ్రాద్ధకర్మపరిత్యాగంబు వలనను వేదవ్రతకర్మభ్రంశదురాగ్రహ గురు సాధు నిందా అనాశ్రయ అనధ్యాయ అధ్యయన దోషంబుల వలనను గురుపూజనావిశ్వాసకుల కన్యకా దూషణేశ్వరపూజారాహిత్యవృజినం బుల వలనను భార్యాద్వయంబులో నేకస్త్రీవిశ్వాసదోషంబుల వలనను పరకాంతాభిమర్శన బ్రహ్మహత్యాదిమహాపాతకోపపాతకంబులవలనను మాధవ! రక్షింపుమని యిట్లు నియతుండై మహాపాతకహరంబును బుణ్యప్రదంబును దుష్కరదారిద్ర్యనాశకంబును ఆయుర్యశఃకరంబును నగు నీ మాధవ స్తవరాజంబు మాఘంబునంబఠింపఁ గోటిగుణిత ఫలంబు. నిత్యంబు శుచిర్భూతుండై ప్రాతఃకాలంబున బఠనక్రియలు సేయువాఁడు దేవపూజ్యుండగు గ్రహవ్యధనివృత్తియగు ధర్మాదిమోక్షాంత చతుర్విధ పురుషార్థసిద్ధియగు నంతంబునఁ గల్పకోటి సహస్రంబులు విష్ణుమందిరంబున సుఖియించునని గాలవుండు వెండియు. 21

క. విమలమతులార! యీ స్తో
త్రము పుణ్యఫలప్రదము కరము పుత్రవియో
గముఁ జెందు వసిష్ఠునకుం
గమలజుఁ డుపదేశమిచ్చెఁ గడుహితబుద్ధిన్. 22

క. అనినఁ గుటీరస్థులు స
న్మునిఁ జూచి వసిష్ఠుఁ డేల మునుకొని సుతశో
క నియుక్తిఁ జెందె మఱి యే
యనువున ఖేదంబు మానె నాపుణ్యునకున్. 23

వసిష్ఠ విశ్వామిత్ర వివాదము

క. అత్తెఱఁగుఁ దెలుపవే సమ
చిత్తంబున నవినఁ బ్రియము చేకొని సువచో
వృత్తిఁ గుటీరస్థుల గ
ణ్యోత్తరుఁడగు గాలవుం డనూనతఁ బలికెన్. 24

చ. తనర వసిష్ఠుకంటె ఘనతం బ్రభవించెద నంచు గాధినం
దనుఁడు తపంబొనర్చె సముదగ్రధృతిం బదివేలదివ్యహా
యనములు తొల్లి యంతఁ గమలాసనశాసనమర్థిఁ బూని పెం
పున బుషి సంయమింగలసి భూవినుతోన్నతి నొప్పుచుండఁగన్. 25

మ. ఒకనాడింద్రుఁడు కణ్వకశ్యపపులస్త్యోదంకమాండవ్యశౌ
నకజాబాలి వసిష్టకుత్సముఖనానామౌనులున్ దేవతా
ప్రకరంబున్ గొలువన్ మహావిభవతన్ భాస్వత్సభాసీనుఁడై
యకలంకస్థితి నుండి యిట్లను వినోదాలాపలీలారతిన్. 26

సీ. సురలార! మౌనిశేఖరులార! మిమ్మొక
టడిగెద జీవులయందు నధికు
డెవ్వఁడు బుద్ధినూహింపంగ బ్రహ్మల
లో నెవ్వఁడాద్యప్రధానమూర్తి

బ్రహ్మర్షిగణములోపల ముఖ్యుఁడెవ్వఁడు
దేవర్షిచయములోఁ దెలియ నెవ్వఁ
డుత్తముం డిపుడప్రత్యుత్తరంబిందు మీ
రనిన నింద్రుని పల్కు లాలకించి

గీ. యాసభాసదు లందరు ననుమతించి
నారదుని నియమించిరి నాకవిభుని
సందియము తేటపరుప నాసంయమియును
వినయమున లేచి పాకశాసనునిఁ జూచి. 27

మ. అమరాధీశ్వర! జీవకోటులకు ముఖ్యస్థాని పద్మాసనుం
డమరన్ బ్రహ్మలలో నధీశ్వరుఁడు దైత్యారాతి బ్రహ్మర్షి సం
ఘములో నుత్తముఁడీవసిష్ఠుడును యోగస్ఫూర్తి దేవర్షిపుం
జములో శ్రేష్ఠుఁడనేను నిందరువినన్ సత్యంబుగాఁ బల్కితిన్. 28

గీ. అనిన నారదు పల్కులు విని కరంబు
సంతసించిరి యాసభాసదులు గాధి
నందనుఁడు క్రోధదీప్తమనస్కుఁడగుచుఁ
గటము లదరంగఁ బెదవులు గదిమికొనుచు. 29

క. ఓహో నారద! సభయం
దూహింపక యిట్లుపల్కుటుచితమె బ్రహ్మ
శ్రీహరులఁ జెప్పి తదినిజ
మే హెచ్చున్ బొగడుకొంటి వీతని నిన్నున్. 30

సీ. బ్రహ్మపూర్ణాయువు పరిపాటిఁ గల్గు మా
ర్కండేయమౌనిశేఖరుని విడిచి
యరకాలఁ గన్ను మహాశక్తిఁ జూపి పెం
పెసఁగిన భృగుసంయమీంద్రు విడిచి

యంబుధి నొక్కట నాపోశనము గొని
ప్రజ్ఞమెరసిన కుంభభవుని విడిచి
మొనసి బ్రహ్మర్షిత్వము తపోమహిమ జగ
మెన్నంగఁ గాంచిన నన్ను విడిచి

గీ. యీ వసిష్ఠునిఁ బెద్దగా నెంచి తితని
చనువు విడిచి త్రిశంకుఁడు వినుతపదము
గనఁడె నను నేఁ బొగడుకొనఁ గాదుగాక
యధికబలమునఁ గమలజు నంతవాఁడ. 31

వ. కావున మా యిద్దఱ తారతమ్యంబులు విమర్శింపక యిట్లాడితివి యాత్మ ప్రశంసాదోషంబు కల్పాంతంబునంగాని పాయునే నిన్నునీవ చెప్పు కొంటివి త్రిలోకంబులయందు నారదుండు సత్యవాదియన నసత్యంబు పల్కుదువే పూర్వంబు మఱచితివే యీసభామధ్యంబునఁ గ్రమ్మఱం బలుకుమనిన నారదుండు హాసంబుచే గాధిపుత్రుంజూచి వసిష్ఠునకు నీకు నైనవివాదంబు సంశయం బంతయు హిరణ్యగర్భుం డిప్పు డ మాన్పు లోకేశ్వరుండు సర్వంబునెఱుంగుం గావున యద్దేవుని కడకుం జనుండనిన విశ్వామిత్రుండు తత్తరంబున నదరి పలుకుచు వసిష్ఠుం బిలిచిన నతండు సన్మునియగు గాధినందనుతో నాశ్చర్యకలితుండగుచు బ్రహ్మలోకంబునకుంజని యందుసకల మునిగణసేవితుండయి యున్న పద్మసంభవుంజూచి నమస్కరించి నిలిచినం బరమేష్ఠియు వారివారి వివాదంబెఱింగియు నెఱుంగనట్లు వారితో నిట్లనియె. 32

క. అలఘు తపోబలయుతని
శ్చలమానసు లిరువురుం బ్రశస్తగుణులు రాఁ
దలపెయ్యది యని యడిగిన
నళినోద్భవుఁ జూచి గాధినందనుఁ డనియెన్. 33

గీ. ఈ వసిష్ఠునకును మాకు నింద్రుని సభ
వాదమైనను నారదుం డాదరమున
మీకడకుఁ బంచె సకలము మీకుఁదెలియు
ఘనుల మెవ్వర మనిన ని ట్లనియె నజుఁడు. 34

క. నే మీఘనమేర్పరుపం
గామువ్వురచేతఁగాని కా దహివిభునిం
దామరస హితు నగస్త్యుని
వేమరుఁ జని పిలువుమనిన వినికౌశికుఁడున్. 35

శా. పాతాళంబున కేఁగి శేషుఁగని శోభం బల్కె వాగ్జాని ప్ర
ఖ్యాతున్ నిన్ దయఁ బిల్చె మామకవసిష్ఠాధిక్యముందెల్పఁ బ్ర
స్ఫీతప్రక్రియ వత్తుగా కనిన సాభిప్రాయలీలావచో
చాతుర్యంబున గాధినందనునితోఁ జక్రీశ్వరుం డిట్లనున్. 36

క. సూరినుత! నన్ను విష్ణుఁడు
ధారుణి భరియింపఁ బనిచెఁ దలఁగం దగ దే
రారా దనవుడు గాధి కు
మారుఁడు వెసఁ జనియె నంశుమంతుని కడకున్. 37

వ. అట్లు చని విశ్వామిత్రుండు కమలమిత్రునకు దనవచ్చినపని యెఱిం
గించిన నాదిత్యుం డిట్లనియె. 38

క. శ్రీకాంతుని శాసనమున
లోకహితము నడుచుటిది విలోకింపవె సు
శ్లోకనిధి! తీఱ దనుటయు
నాకుంభోద్భవుని కడకు నరిగె న్మునియున్. 39

గీ. అటులు చని తనువచ్చిన యాతెఱంగుఁ
దెల్లముగఁ దెల్పవిని ముని వల్లభుండు
గాధినందన! విను తొల్లి కనకనేత్రుఁ
డవనిఁ గొనిపోవ హరి కిటియై కణంగి. 40

ఉ. దానవు నోర్చి భూమి యుచితస్థితి నిల్పిన నోరవోవుడున్
దానియమించి నన్నునిచె దక్షిణదిక్తటియందు మాధవుం
డేనటువచ్చు టెట్లనిన నేమియనంగనులేక ఖేదభృ
న్మానసుఁడైన గాధినిజనందనుఁ డేఁగెను బ్రహ్మపాలికిన్. 41

వ. ఇవ్విధంబునఁ జని తను పోయివచ్చిన తెఱంగు సవిస్తరంబుగా నెఱింగించి వారలధికారంబుల నున్నవారు వారలకురాఁ దీఱునే యనిన విరించి వసిష్ఠునింజూచి నీ వేఁగి యమ్మువ్వురం దోడ్కొనిరమ్మనిన నరుంధతీవల్లభుండు సమ్మతి నాగలోకంబునకుంజని పన్నగేంద్రునిం బిలిచిన నతండు. 42

క. తన యధికారము చెప్పిన
ముని దండము నిల్పె ధాత్రిమోవఁగ నపుడా
ఘనభారముడిగి శేషుఁడు
చనుదెంచెను మౌనివెంటఁ జతురమనీషన్. 43

గీ. అటులు శేషుండు చనుదేర నమ్మునీంద్రుఁ
డబ్జమిత్రుని కడకేఁగి యర్థిఁ బిలువ
నినుఁడు తనయధికారవర్తనలు నడచు
తెఱఁగెఱుంగించిన నరుంధతీవిభుండు. 44

క. వెరవున దనపైవస్త్రము
కరమరుదుగనుంచెఁ బ్రొద్దు గడువఁగ నది బం
ధురభానుదీప్తి నిలిచిన
ఖరకరుఁడరుదెంచె మౌనిగణ్యుని పిఱుఁదన్. 45

క. ఆరీతి శేషభాను లు
దారత రా శక్తిగురుఁడు దక్షిణదిశకున్
ధీరమతినేఁగి కుంభజుఁ
గోరి పిలుచుటయు నతండకుంఠితభక్తిన్. 46

వ. వినయంబునం దనయధికారంబు చెప్పిన వసిష్ఠుండు కమండలం బచ్చుట నునిచిన నయ్యుదకపాత్ర తదధికారంబునకుం జాలిన నగస్త్యుం డును వసిష్ఠ పిఱుందనె చనుదెంచె నిట్లు ముప్వుఱం దోడ్కొని వసిష్ఠుండు భారతీవల్లభుపాలికింబోయిన బరమేష్ఠియు శేషసూర్యా గస్త్యులం గూర్చుండనియమించి వసిష్ఠవిశ్వామిత్రుల వాదంబు తెఱంగు చెప్పి దీనికింబ్రతివాక్యంబు తేటపఱచునది యనిన వారలు విరించి యనుమతంబున గాధేయునితో నిట్లనిరి. 47

ఉ. ధీరత మమ్ముఁబిల్చి యిట తెచ్చుటకున్ దగుశక్తిలేదు నీ
కారయ నీ వసిష్ఠుఁడు తపోఽవిషయోక్తి వహింపఁ జేసి మ
ద్భారము దానఁ జేసె విదితంబుగ వచ్చితి మిట్టివాసి యె
వ్వారికిఁ దేటతెల్లము ధ్రువంబుగ నిట్టి ఘనంబు పల్కుమా! 48

క. అనుటయు సిగ్గున నమ్రా
ననుఁడై మఱుమాట గాధినందనుఁ డీకుం
డిన వారు పద్మసంభవు
ననుమతి నిజధామములకు నరిగిన యంతన్. 49

వ. వసిష్ఠుండును జనకుచేత ననుజ్ఞాతుండై నిజాశ్రమంబునకుం జనియె. విశ్వామిత్రుండును తన వివాదంబునకు ఖేదంబు నొందుచు భూలో కంబునకు నేతెంచి బ్రహ్మకుం బ్రతీకారంబును వసిష్ఠునకు నహితం బును గోరుచుఁ గ్రోధంబున 50

క. ధీరుఁడు విశ్వామిత్రుఁడు
భూరితపమొనర్చి యాతపోబలమున వి
స్తారమహాద్భుతగరిమన్
ధారుణి జనులెన్న సృష్టిఁ దగఁగల్పించెన్. 51

గీ. ఆసమయమున సూర్యవంశాగ్రగణ్యుఁ
డమలమతి మిత్రసహ మహారమణుఁడెలమి
నొక్కనాఁ డడవికినేఁగి యుగ్రదనుజు
నుద్ధతిఁ గరాసి ద్రుంచె రణోర్వియందు. 52

క. వాని యనుజుండు శుచియను
దానవపతి కృత్రిమాంగధరుఁడై తగ ధా
త్రీనాథుని గేహంబున
బానసుడయ్యుండి కీడు పరికించుటయున్. 63

గీ. అంత నొకనాఁడు పితృదినం బరుగుదేర
నవనిపతియు వసిష్ఠ నత్యంతభక్తి
నర్చనలొనర్చి వడ్డించు నవసరమునఁ
గపటరూపున నున్న రక్కసుఁడు చెలఁగి. 54

వ. శాకంబులలో మనుష్యమాంసంబు సంగ్రహించిపెట్టిన వసిష్ఠుండు మానవమాంసం ముపలక్షించి రాజుంగోపించి యిట్టి యవజ్ఞంజేసితివి గావున రాక్షసుండవు గమ్మని శపియించి యంతనది యసుర కృత్యం బుగాఁ దెలిసి ద్వాదశవర్షంబులకు శాపమోచనం బగునని యనుగ్ర హించె నప్పు డమ్మహీనాథుండు వసిష్ఠ నుపలక్షించి 55

క. నేరంబు లేక శాప మ
కారణమతి నిచ్చితిపుడు కావున శాపం
బారయ నీవుంగొనుమని
నీరంబులు గొనిన విభుని నెలఁతుక పలికెన్. 56

క. గురునకుఁ బ్రతిశాపంబి
త్తురె నరవర! యనిన నతఁడు దోయిలి జల ము
ద్ధురమతిఁ దన పదములపై
కరమరుదుగఁ జల్లె విహితగతి నెఱయంగన్. 57

గీ. అటులు శాపజలములు నిజాంఘ్రియుగళిఁ
బడిన కతమునఁ గల్మషపాదుఁడయ్యె
నంత నమ్మౌని శాపంబు కంతమహిమ
గురుసురద్వేషరూపునఁ దిరుగుచుండె. 58

క. ఈరీతిఁ దిరుగఁగా దు
ర్వారగతిన్ గాధిసుతుఁడు వచ్చి యసురతోఁ
గ్రూరుఁడు వసిష్ఠుఁడీగతి
నూరకె శాపంబొసంగె నుచితమె తనకున్. 59

గీ. కపటి నిధిగుణసాంద్రుండు గాఁడతం డ
సాధ్యుఁ డాక్రూరచిత్తుని సంయమీంద్రు
డనఁగ వచ్చునె తెలియక యతనితోటి
మైత్రి యొనరించి తిన్నా ళ్ళమర్త్యవైరి! 60

సీ. తొల్లి త్రిశంకు భూవల్లభు శపియించెఁ
జండాలుఁ డనుచు నా జనపతియును
దేవేంద్రలోకంబు ధృతిఁ జేర దేవతల్
మాల డాతండని మగుడఁద్రోవ
నతఁ డార్తుఁడై శిష్యు ననఘ! రక్షింపవే
యనిన నేఁ గరుణించి యమరపురము
పృథు తపోమహిమఁ గల్పించితి నొక్కటి
యందుఁ ద్రిశంకుండు నధివసించె

గీ. నంబరంబున నిపుడు జనంబులకును
గానరయ్యెడు కంటె యా కలుషచిత్తు
గురుఁడనుచు నమ్మవచ్చునె కొసరకీవు
తత్సుతులనెల్ల భక్షింపు తగవు మెఱసి. 61

వ. అని విశ్వామిత్రుండు బోధించిన కల్మషపాదుండు రాత్రివేళ వసిష్ఠాశ్రమంబునకుంజని యతండు ధ్యానారూఢుఁడై యున్నయపుడు తత్సుతుల నూఱ్వుర నిద్రాసక్తుల వధించి భక్షించిచనియె నరుంధతియు నార్తయై బహుప్రకారంబులవనరుచున్న వసిష్ఠుండునుం దెలిసి పంచత్వంబు నొందిన పుత్రుల నూఱ్వురం జూచి ముహూర్తమాత్రంబు మూర్ఛాన్వితుండై లేచి యాత్మగతంబున నిట్లని వితర్కించె. 62

సీ. అఖిల సంపదలకు ననుభవస్థితులఁ బెం
పెసఁగు పుత్రుల నేల యిచ్చె బ్రహ్మ
యట్టి సత్పుత్రుల నభివృద్ధిసేయక
కపటంపు విధి యేల యపహరించె
నాజన్మశుద్ధు లుదారదయాపరు
లిట్టి పుత్రుల కాయు వెట్లు తఱిఁగె
నయ్యయో రక్కసుం డదయుఁడై యొక్కరు
నైనఁ దప్పఁగనీక యణఁచు టెట్లు
గీ. శక్తి యిపుడేలొకో కల్యసమయకృత్య
ములను వర్తించి కుశసమిత్ఫలములకును
చతురగతి నేఁగ డక్కటా! శతకుటీర
తతులు శూన్యతఁ జెందెఁ నద్భుతము గాఁగ. 63

ఆ.వె. అనుచు వగలఁ గుంది యారాత్రి వేగించి
సంయమీంద్రు లతని సాంత్వవచన
ములను దీర్ప నందనుల కందఱకుఁ బర
లోకవిధు లొనర్చె జోక మెఱయ. 64

క. ముని (ప్రియ)సుతులీ మాఘం
బునఁ బంచత్వంబునొంది మోక్షంబునకున్
జనిరి వసిష్ఠుఁడు ఖేదము
మనసునఁ బాయక కలంకమతి విహ్వలుఁడై. 65

క. మరణంబుఁ గోరి మ్రింగెను
గరళము నది జీర్ణమైనఁ గనకాచలమం
దరశిఖికీలంజొచ్చిన
సరసంబునఁ బావకుండు చల్లన నయ్యెన్. 66

వ. మఱి మేరుపర్వతంబెక్కి భూపతనంబొనర్చిన నెద్దియుంగాకుండిన సింహవ్యాఘ్రభల్లూకాదిక్రూరమృగసమాకీర్ణంబైన వనంబుప్రవేశించిన నొక్కమృగంబును దేరిచూడదయ్యె. పృథుతరాసియుక్తంబు చేసి కంధరంబునం గదియించి వారాశింబడినఁ దరంగిణీవిభుండును నభంగతరంగ ఘట్టనంబులఁ దీరంబు జేర్చె నిట్లెందును మృతిగాకున్న భీకరాసి కరంబున ననుసంధించి శిరంబు ఛేదింపంబూనినఁ గమల యోని ప్రత్యక్షంబై నిర్గళితబిందుసందోహ రక్తసిక్తకపోలుఁడై తలవంచు కొని యున్న కుమారుని సాంత్వనవచనంబుల నూరార్చుచు నిట్లనియె.

క. అలఘుతరజ్ఞానులు ని
ర్మలహృదయదృఢవ్రతులు కరము దుఃఖములం
గలఁగుదురె యనుచు వెండియు
జలజభవుఁడు తెలిపె నుపనిషద్వచనములన్. 68

గీ. ఇట్లు తెలిపినఁ దెలిసి మునీంద్రుఁ డలరి
ధాతఁ గనుగొని యాత్మసంజాత శతముఁ
బొలిసె వంశంబునకు నింక పుత్త్రరహిత
మైన నిల్కడ గల్గు టెట్లనిన నజుఁడు. 69

గీ. జననుతంబైన మాఘమాసప్రభావ
మునను నీసుతు లందఱుఁ జనిరి పుణ్య
గతికి నిక వచ్చువారలు గారు శక్తి
యనుఁగు భార్యకు నుదయించు నాత్మజుండు. 70

క. అన్నెలఁతకు గర్భిణియై
యున్నది కౌశికుని బోధ నుగ్రతబలశౌ
ర్యోన్నతి దైత్యుఁడు చెఱుపఁగ
నున్నాఁ డదియెఱిఁగి యరసియుండు మునీంద్రా! 71

క. తేజమున మాధవస్తవ
రాజం బుపదేశమిచ్చి ప్రాభవశక్తిన్
రాజీవనయన నిండు వి
రాజితమతిఁ గాచికొనుము రమణిఁ గుమారా! 72

క. ఆ మంత్రమహిమచే వి
శ్వామిత్రుని మాయవలన నడరెడు దైత్యుం
డేమియుఁ(జేయఁగ) నోపఁడు
ధామంబున సుఖివికమ్ము తలఁకేమిటికిన్. 73

వ. మఱియు మాఘస్నానంబు చేసిన సంతతివర్ధిల్లు నీవంశంబుననంబుజ నాభుండు ద్వైపాయనుండనం బ్రసిద్ధంబుగా నుదయించునని మాధవ స్తవరాజంబుపదేశించి యరుంధతి ననునయించి సురగణనందితుండై శతానందుండు నిజలోకంబునకుం జనియె. వసిష్ఠుండును భార్యా సహితుండై నిష్ఖేదుండై స్తవరాజంబు పఠియించుకొని కోడలిని రక్షించు కొనిన శక్తితేజంబున నమ్ముద్దియ పరాశరుంగనియె నప్పరాశరువలన వ్యాసుండుదయించె నమ్మునికి శుకుండుద్భవిల్లె నిట్లు వంశ విస్తర కారణంబైన మాధవస్తవరాజంబు మీకుంబ్రకటంబుచేసితినని గాల వుండు కుటీరస్థులతో వెండియు నిట్లనియె. 74

విశ్వామిత్రుని బ్రహ్మహత్యలు వెంటాడుట

క. అంతటఁ విశ్వామిత్రుని
యంతము చరియింప బ్రహ్మహత్యలు నూఱున్
సంతతముఁ జుట్టి నిలిచి ని
తాంతముగా బాధసేయఁ దలకొని కినుకన్. 75

క. ఘోరాకారులు తామ్రవి
కారశిరఃకేశు లూర్ధ్వకరు లమితోగ్ర
స్ఫారవికృతాక్షు లొక్కటఁ
జేరి గములుగూడి బాధసేయుచుఁ గడిమిన్. 76

క. శయనించిన శయనించును
పయనంబై వెంటఁబోవ పయనంబగు ని
శ్చయముగ నిలిచిన నిలుచును
నియతిం గూర్చున్న డాసి నెఱిఁ గూర్చుండున్. 77

క. ఈరీతినున్న సాధ్వస
పూరితచిత్తమున గాధిపుత్రుఁడు నిలువన్
నేరక శమనునికడఁ జని
గారవముగ శరణువేఁడెఁ గడు నార్తుండై. 78

క. దినకరసూతియు హత్యలు
చనఁ జేయం దనకు శక్తి చాలదనిన న
మ్మునివరు సదనమ్మునకును
వినయంబుననేఁగి శరణువేఁడిన నతఁడున్. 79

క. తనకు వశము గాదన్నను
దినవాయకు కడకు నేఁగి దీనతఁ బలికెన్
వనజహిత! శరణుఁ జొచ్చితి
ఘనముగ రక్షింపుమనిన ఖరకరుఁ డనియెన్. 80

గీ. మౌనిశేఖర! హత్యలుమాన్ప శక్తి
చాల దనవుడు వెసనేఁగెఁ జంద్రు కడకు
హిమమయూఖుఁడు నవ్విధంబెఱిఁగి తనకు
వశము గాదన్న గాధిభూవరసుతుండు. 81

మ. సురలోకంబున కేఁగి యింద్రుఁ గని రక్షోయక్షగంధర్వకి
న్నరవిద్యాధరసిద్ధసాధ్యముఖనానాదేవతాధీశ! నీ
శరణం బే నినువేడెదం బ్రబలతేజఃస్ఫూర్తిరక్షింపవే
పరమస్ఫారకృపావలోకనమునన్ బాటించు జంభాంతకా! 82

వ. అనిన విని శచీనాథుండు తద్విధంబవలోకించి వారించ శక్తుండుగామి
యెఱింగించిన నెద్దియుం గానలేక కైలాసమహీధరంబున కేఁగి రుద్రుని
శరణంబు వేఁడిన గంగాధరుండును బ్రమథగణంబులతో నదృశ్యుండైన
బ్రహ్మహత్యోద్రేకంబు భరియింపలేక యా కౌశికుం డుమానాథు
నుద్దేశించి యిట్లని స్తుతియించె. 83

ఉ. భర్గ! శశాంకఖండధర! పావన! యబ్జభవాది దేవతా
వర్గసమగ్రశౌర్య బలవత్త్రిపురాసుర భూమిభృచ్చయా
నర్గళ జంభభేద్యమర నమ్రజనోత్కరరక్షణక్రియా
సర్గ! శివా! మనస్సరసిజాతవిరోచన! ఫాలలోచనా! 84

శా. గాంగేయాచలచాప! మారహర! (ప్రాగ్ర) ప్రస్ఫురద్గోప, సా
రంగాంకోరుకళాకలాప! శరచేరభ్రాతిసద్వ్యాప(?) మా
తంగాంకత్రిదశద్విషత్ప్రకట దోర్దర్పాటవీపావకో
త్తుంగజ్వాలరుచిప్రతాప! సుజనస్తోత్రప్రసాదోదయా! 85

ఉ. వందనమో త్రిశూలధర! వందనమో సుగుణస్ఫురచ్ఛుతా
నంద పురందరాది సురనందిత! వందనమో మరుద్ధునీ
చందనకుందచంద్ర ఘనసారనిభప్రభ! నీకు నిచ్చలున్
వందనమో సదాశివ! భవా! తుహినాచలకన్యకాధవా! 86

చ. మొనసినవేడ్క వారసతి మోసలఁ బువ్వులు మోయుచొక్క దు
ష్టనరుఁడు చేతిపూసరము జాఱ శివార్పణమంచుఁబల్కి పెం
పున రజతాద్రిఁ జేరె బహుపుష్పములన్ నినుఁ బూజసేయు పా
వనులెటులుండఁ బ్రాప్తులో శివా! తుహినాచలకన్యకాధవా! 87

వ. మఱియు సంసారనామంబుగల మహారోగంబు నీ నిజనామస్మృతి మార్గంబున దుద్రు నాశంబగుం గావున రుద్రుండవు భవదీయ స్మరణ దురితంబులు శీఘ్రంబ దుద్రువై పోవుటంజేసి ద్వితీయరుద్ర నామంబును క్షయాపస్మారరోగాదులు ద్రావశే యను ధాతువున హరించుటంజేసి తృతీయ రుద్రనామంబును రుజంబన దుఃఖంబుఁ ద్రావి యది నాశనంబు సేయుటంజేసి చతుర్థ రుద్రనామంబును రుదంబన మార్గంబు సత్పురుషులకు రా ఆదానే యను ధాతువున సన్మార్గంబిచ్చి రక్షించుటంజేసి పంచమ రుద్రనామంబును రుద్రా యన వేదంబులు సత్పురుషులకు రాతించుటంజేసి షష్ఠ రుద్రనామంబును జయశీలుండైన మన్మథుఁ డెవ్వరిచేత మంత్రదగ్ధుండయ్యెఁ దత్కారణంబున సప్తమ రుద్రనామంబును రుదంబన నాదరణంబు నజ్ఞానంబును నంతఃపావక విజయంబుచే హరించుటంజేసి యష్టమ రుద్రనామంబును త్రిపుర దైత్యులకు రుదః బాష్పంబులు రాతి కల్పించుటంజేసి నవమ రుద్ర నామంబును రుద్రంబన జ్ఞానంబది దధాతి చేకూర్చుటంజేసి దశమ రుద్రనామంబును రుదంబన శ్రీలు తత్క్రియలకు దాయి నా సాక్షీభూతుండగుటంజేసి యేకాదశ రుద్రనామంబును నీరీతిని రూఢంబులయ్యె నిన్నుం బ్రణుతిసేయ నేర్తునే యని బహువిధంబుల మహాదేవు స్తోత్రంబు సేసిన నీశ్వరుం డంతర్ధానంబున నుండి యవ్విశ్వామిత్రున కిట్లనియె. 88

గీ. సంయమివరేణ్య! మాఘమాసంబునందుఁ
గృష్ణ నవగాహమొనరించి పృథులనిష్ఠ
నమర గాయత్రి జపియించి యాతటంబు
నందు నన్నుఁ బ్రతిష్ఠించు హత్య లణఁగు. 89

సీ. అన విని గాధినందనుఁడు సప్తనదీ స
మాగమంబునకుఁ బ్రేమమున వచ్చి
మకరమాఘస్నాన మకలంకగతిఁ జేసి
గాయత్రిని జపించె ఘనత వెలయ
లింగప్రతిష్ఠ సత్సంగతి నొనరించి
బ్రహ్మహత్యలనెల్లఁ బాసి శుద్ధ
మూర్తియై బ్రహ్మర్షిముఖ్యత వెలసె జ
నవ్రజంబెన్నంగ నాఁటినుండి
గీ. యతఁడు గాయత్రికిని ఋషియయ్యె వేద
మాతఁ బ్రకటంబుగ జపించు మనుజులకును
సకలపాతకములు గడఁజను సమస్త
సంపదలు గల్గుఁ దుదిని మోక్షంబు దొరకు. 90

క. మానవుఁడు మకర మాఘ
స్నానము గావించి దర్భసంజ్ఞల గాయ
త్రీ నిర్మలతర జపము మ
హానియతిం జేసి బ్రహ్మహత్యలఁ బాయున్. 91

గీ. నరుఁడు మాఘంబునందు స్నానంబు సేసి
రాజసూయాది సవనసారపు ఫలములు
గాంచు బహుతరకుష్ఠరోగవ్రజములఁ
గడచు నాయుస్సమేతుఁడై గణనఁ గాంచు. 92

వ. అట్టి మంత్రరాజంబు వలన మాఘస్నానంబున గాధేయుం డధికుండై వసిష్ఠుమీఁది మాత్సర్యంబు వదలక యమ్ముని నతిక్రమించెదనని సహస్రదివ్యవర్షంబు లయశ్చూర్ణంబు ముష్టిమాత్రం బాహారంబుగా ఘోరతపంబొనర్చుచున్న నతనితపోవహ్ని ప్రబలంబై లోకంబులకు బాధగావింప నిలింపపతి తన పదంబునకై యొనర్చుచున్నవాఁడని భయంపడి మన్మథుం బిలిచి యిట్లనియె. 93

క. మనసిజ! నీవు వసంతుఁడు
జని విశ్వామిత్రుతపము చలనము గావిం
చిన మేలగు నాకని పం
చిన మాధవయుక్తుఁడగుచుఁ జిత్రస్ఫురణన్. 94

చ. ననవిలుతుండు గాధి నిజనందనుఁడున్న తపోవనంబు చే
రిన సకలాగమంబులు పరిస్ఫుటమై విలసిల్లినం గనుం
గొని కడుచోద్యమంది మునికుంజరుఁ డంగభవుండు వచ్చినాఁ
డని కని వ్యాఘ్రరూపధరుఁడై భయదాకృతి నేఁగుదెంచినన్ 95

క. చెంతం బలికెడు శుకపిక
సంతతులును నెచ్చెలుఁడు వసంతుఁడు భయవి
భ్రాంతిం గని పోవంగాఁ
గంతుఁడు ననవిల్లువైచి కదలెం దివికిన్. 96

ఆ.వె. అవ్విధమున నేఁగి యంగజాదులు తపో
విఘ్నమాచరింప వెరవు చాల
దనిన ఖిన్నహృదయుఁ డయిన యింద్రుని తోడ
లీలఁ బలికె నూర్వశీలలామ. 97

ఊర్వశి విశ్వామిత్రుని తపోవిఘ్నమొనర్చుట

ఉ. ఇంద్రుఁడ! నీవు దుఃఖపడనేటికిఁ గౌశికమౌని సేయు ని
స్తంద్రతపంబు మాన్పుటకు శక్యము గాదననేల శక్తిచే
రుంద్రమతిన్ సుఖింపుము నిరూఢిగ నేనిది చక్కఁ జేసెదన్
జంద్రముఖీవిలోకన సుసంగతిఁ జొక్కరె యెట్టివారలున్. 98

ఆ.వె. మహి పురూరవుండు మైత్రావరుణుఁడు రు
క్మాంగదుండు నీవు నాత్మజుండు
నాదిగాఁ గలుగు మహాత్ములు కాంతల
వలనఁ జిక్కువడక నిలిచి రెట్లు. 99

వ. సూర్యచంద్రులం బిలిచి నియమింపుము విశ్వామిత్రాశ్రమంబున విశ్వ
కర్మ నిర్మితంబులైనపట్టణంబులనుండి రాజవిద్వరం బొనర్చునటు
దానంజేసి జనంబులు దేశాంతరగతులైన నప్పుడు నేను పతివ్రతా
రూపంబు ధరించి యమ్మౌనియాశ్రమంబునకుంజని పెక్కువిధములగు
మక్కువల నతనిం చక్కెఱవిల్తుని వలలకుం జిక్కువడంజేసి చొక్కించి
చొక్కంబుగ చక్కని శ్వానంబునుం జేసి యిక్కడికి వచ్చునట్లొనరింతు
ననిన విని పాకశాసనుండు హర్షించి విశ్వకర్మ రావించి సూర్యచంద్రు
లకును మాకును భూలోకంబున కృష్ణవేణ్యోభయతటంబులఁ బట్టణ
త్రయంబు నిర్మించుమని పంచిన వల్లెయని విశ్వకర్మ సోమశిల
సూర్యశిల రాచకొండ యను పట్టణంబుల నిర్మించిన దేవేంద్రుండును
సూర్యచంద్రులరావించి వారితో నిట్లనియె. 100

ఆ.వె. ధరణియందు గాధితనయుని తపము వి
ఘ్నంబు సేయ మీరు కణఁగి రాజు
లై తదాశ్రమమున నమరు పట్టణముల
నధివసించియుండుఁ డనుచుఁ బనిచె. 101

గీ. పనిచినను వారు నృపతులై బలము మెఱసి
సోమశిలయను పురమున సోముఁడుండె
సూర్యశిలయను పురమున సూర్యుఁడుండె
రాచకొండను దేవతారాజు నిలిచె. 102

క. ఆలోనఁ జంద్రభాస్కరు
లాలము సేయంగ జనములమితోగ్రత నా
భీలగతిఁ జూచి పఱచిరి
బాలురు భామినులు చెదరి పరభూములకున్. 103

వ. ఆ సమయంబున నూర్వశీలలామ 104

క. మెఱుగుంగన్నుల దీప్తులు
గిఱికొన నొకచేతి వెండి కేల్కడియముతోఁ
గుఱుమాపుచీర కట్టుక
తుఱుమున విరి లావు మెఱయఁ దొయ్యలి యయ్యెన్. 105

క. ఆరీతి మర్త్యవనితా
కారవికారంబు నెఱయ గాధేయముని
స్ఫార తపోవనభూమికిఁ
జేరె భయభ్రాంతయైన చెలువయ పోలెన్. 106

వ. ఇట్లు సాయంకాలంబునంజేరి పతివ్రతయపోలె పతిం బుత్రుల నన్న దమ్ములను బంధుమిత్రులను దలంచుచు పాపంపువిధి తమవారు పోయివచ్చిన త్రోవ తప్పించి యిటేల తెచ్చెనని దూఱుచు నెవ్వరైనఁ బుణ్యాత్ములగపడి నిజనాయకుం గూర్తురొకో యని రోఁజుచు నిక్కడ కేకతంబ వచ్చితి నెవ్విధిమెలంగుదునని వెచ్చనూర్చుచు వచ్చుదాని విశ్వామిత్రుండుచూచి యోడకోడకుమని యాదరించి యానెలఁతుకతో నిట్లనియె. 107

గీ. పడఁతి! యెవ్వరిదానవు భర్తయెవ్వఁ
డేకతమ రాను కారణంబేమి నీకు
నిక్క మెఱిఁగింపుమనిన యా నీలవేణి
వినయమున భీతిగదుర నమ్మునికి మ్రొక్కి. 108

సీ. నారాయణాభిధానముగల భూసుర
పత్నిని నిస్పృహభావమతిని
పేరు కాంతాలత ధీరుండు మాజన
కుండు మజ్జనకుండఖండకీర్తి

రాజవిద్వరముచేఁ బ్రజలెల్లఁ దలఁకి య
    థాయథలై పోవ ధవుఁడుఁ బుత్రు
లెందుఁబోయిరొ వారి నెఱుఁగ మార్గముఁ దప్పి
    యిటకు వచ్చితిని రే పెచటికైనఁ
గీ. జనవలయు నేఁటిమాత్రమో సంయమీంద్ర!
నీ నిజాశ్రమమున నన్ను నిలుపు మిందు
నునికి యెగ్గన రన్య లత్యుత్తముఁడవు
సన్నుత పతివ్రతాభిసంపన్న నేను. 109

క. బాలకులను భయవలితుల
బాలికలను దుఃఖరోగభరితాత్ముల వా
చాలమతిఁ గాచి ప్రోచుట
పోలంగా నీకు నైజములు పుణ్యనిధీ! 110

క. అన విని కానిమ్మని య
మ్ముని బహుఫలతతుల నెయ్యమున నాతిథ్యం
బొనరిచి గుహలోపల న
వ్వనితనునిచి తత్సమీపవసుధాశ్రయుఁడై. 111

వ. క్షణమాత్రంబు శయనించి నిద్రాసక్తుండై యుండునంత. 112

ఉ. కాముని మేనమామ కఱకంఠుని యౌదలపువ్వు తారక
స్తోమము నేలు రాజు మధుసూదను ముద్దుమఱంది బంధకీ
భామలహృద్భయంకరుఁడు పంకజమిత్రునియుద్ది యత్తఱిన్
సోముఁడు తోఁచెఁ దూర్పుదిశఁ జూపఱకున్ నయనోత్సవంబుగన్.

వ. ఇట్లు చంద్రోదయంబైన నప్పుడు 114

ఆ.వె. మలయపవనుఁ బిలిచి వలరాజు కలువల
రాజు గాయఁ దొణగె రాజసమున
నూర్వశికిని లొంగకున్నాఁడు కౌశిక
మౌని యచటికేఁగి మసలు నీవు. 115

మ. అనిమందానిలుఁ బంచి కీరవరవాహారూఢుఁడై తుంటవి
ల్తోని వేఁ దమ్ములు నారిఁ గూర్చి మకరాంకుం డుల్లసత్పుష్పబా
ణనికాయంబులు గాధినందను మదిన్నాటించినన్ సంచలిం
చిన చిత్తమ్మున నమ్మునీశ్వరుఁడు రాజీవాక్షి నీక్షింపుచున్. 116

ఆ.వె. మనసు బిగియఁబట్టి మదనమందానిల
చంద్రకిరణములకు జలదరించి
యిందువదనఁ జూచు నేమని దూఱునో
యనుచు గొంకు నుస్సురనుచు లేచు. 117

క. ఈరీతి గాధిపుత్రుఁడు
మారవికారంబుచేత మనసు నిలుపఁగా
నేరకయ మృషానిద్రా
కారమునను నున్న కాంతఁ గౌఁగిటఁ జేర్చెన్. 118

వ. ఇట్లు కౌఁగిటంగ్రుచ్చిన నచ్చెలువ యుల్కుచు మేల్కని కళంకుచూపుల నతనినిం జుల్కనఁ జూచుచుఁ ద్రోచిన లేచి విదలించుకొనుచు గుహ వెడలి జడముడివిడివడ ముడిచిననొస లడల నడుగులు తడబడ వెడవెడ కదువడినడచి యుడుగనితమకంబునం దొడరిపట్టె. కడంక తొడంగి నిదురచేతుల నప్పడంతి వెడంద గుబ్బ లుబ్బున నబ్బురంబుగా నొత్తి హత్తి క్రమ్మఱ గుచ్చెత్తిన మెత్తదనంబెఱింగికొని చిత్తం బీక వేఁ కడఁక నాకలకంఠకంఠి యిట్లనియె. 119

చ. ఎఱుఁగక నిన్ను నిక్కమ మునీంద్రుఁడ వంచును భూజనంబులం
దఱు కొనియాడఁగా విని వృథామతినై యిటువచ్చియున్న నా
తెఱఁగుఁ దలంపవైతివి పతివ్రత నుత్తమురాల నివ్విధిం
బఱతురె మోసపోయితిఁ గృపాపరులెవ్వరు లేరు మాన్పఁగన్. 120

గీ. అనుచుఁ గన్నీరు దెచ్చిన నమ్మునీంద్రుఁ
డబల! నిర్దయురాలవై యకట నన్నుఁ
ద్రోచిపోయెదె నీవు కంతునకు నొచ్చి
ప్రాణములు నిల్పనోప నీ పాదమాన. 121

క. నీవెద్ది చెప్పి పనిచిన
సేవామతి తోడ నదియెసేయుదు నన్నుం
గావుము నళినీలోచన!
నావుడు నచ్చెలువ గాధినందనుఁ బలికెన్. 122

గీ. ఏమి చెప్పినఁ జేయుచు నెపుడువిడువ
నెవ్విధంబున రమ్మన్న నేఁగుదెంచు
వాఁడనని బాససేతువె వరమునీంద్ర!
యనిన హర్షించి యాయింతి యడిగినట్లు. 123

వ. ధర్మంబున గృష్ణవేణియు సాక్షిగా బాసయిచ్చిన నయ్యళివేణియు సమ్మ
తించిన 124

క. క్రిక్కిరిసిన గుబ్బలు యెద
నొక్కుచు కటితలము తొడలు నునుఁజెక్కులు చ
న్మొక్కులు నంటుచు ముద్దులఁ
జొక్కుచుఁ గ్రొమ్మోవి యానుచున్ రతిసల్పెన్. 125

క. ఆచందంబున నమ్మృగ
లోచనతో గాధిసుతుఁడు లోలత సుమనా
రాచవిరాజితకేళీ
వైచిత్రిందేలి మోహవశుఁడై యుండెన్. 126

వ. ఇట్లు పదివేలే ళ్ళమ్ముద్దియతో నిష్టసుఖంబు లనుభవింపుచున్న నొక్కనాఁ
డక్కమలలోచన విశ్వామిత్రునితో నిట్లనియె. 127

ఆ.వె. మౌనిచంద్ర! వినుము మామేనమామ కు
మారుఁడొకరుఁ డల్ల యూరనున్న
వాఁడు పోయి(చూచి) వచ్చెద ననుటయు
సంయమీంద్రుఁ డులికి సఖియఁ జూచి. 128

క. విరహాతురుఁడై యిట్లను
సరసీరుహనేత్రి! వెంటఁ జనుదెంచెద నీ
వరయ ననుఁ బాయదగునే
పరికింపుమనిన లతాంగి పలికె నతనితో. 129

సీ. నినుఁ దోడుకొనుచుఁ బోయిన గుట్టు బయలౌను
దూషింతు రఖిలబంధువ్రజములు
శ్వానరూపున వచ్చితేని యెఱుంగ ర
ట్లగుమన్న మౌని మోహమునఁ జేసి
కుక్కురతనువు గ్రక్కునఁ దాల్చి యూర్వశి
వెంటనేతేర నవ్వేలఁది దివిజ
పురికి నేతెంచె నప్పుడు వసిష్ఠాదిస
న్మునులు దిగీశులుం దనరి కొలువ
గీ. నెలమిఁ బేరోలగంబున్న యింద్రుఁ డూర్వ
శీ సరోజాయతాక్షినీక్షించి సార
మేయమిది యెవ్వరనిన భామినియు గాధి
నందనుండని పల్కె మానసము లలర. 130

వ. ఇట్లు సభాసదులందఱు వసిష్ఠుండును విని హాసంబుచేసిన విశ్వామిత్రుండు లజ్జించి యూర్వశి వర్జించి తపోవనంబునకు వచ్చి తద్దోషంబు పరిహారంబుగా మాఘస్నానంబును మాధవపూజయు గీతా పఠనంబును నొనర్చి తేజోవంతుండై కృతార్థత్వంబు వహించి పరమ మునీంద్రుఁడై విలసిల్లె నిట్టి మాఘస్నానప్రభావంబేమని వర్ణింతునని

గాలవుండు వెండియుఁ గుటీరస్థులతో నిట్లను నట్లూర్వశి తన మనో
రథంబు సమకూర్చుటకు హర్షించి యింద్రుం డయ్యింతిం గనుంగొని
కౌశికుండెవ్విధంబున నీతోఁ బ్రతినవల్కెనని యడుగుటయు నూర్వశి
యిట్లను భూలోకంబునకు బోయి నేను 131

మహాస్రగ్ధర :

కనుగొంటిం గృష్ణవేణిం గలుషనికరపంకవ్రజక్షాళనోద్య
ద్ఘనపాదఃపూరజాలన్ గమఠమకరముఖ్యాస్పదజ్జంతుసంతా
న నితాంతభ్రాజమానన్ నవపులినవిశీర్ణప్రభాశోభిడిండీ
రనికాయోదారతీరన్ బ్రబలఘుమఘుమారావరంగత్తరంగన్. 132

వ. కని తదవగాహంబునం గృతకృత్యనై నానేర్చువిలాసవిభ్రమంబుల
నమ్మౌనిం జొక్కించి యిటకుందెచ్చితి. కృష్ణవేణీభజనంబునం గార్యసిద్ధి
యగుట సందియంబె యనినఁ బురందరుండు పరమానందంబునఁ
గృష్ణవేణి నుద్దేశించి 133

ఉ. విష్ణుశరీరసంభవ! పవిత్రతరోజ్జ్వలవారిపూర వ
ర్ధిష్ణు! సమస్తజంతుభయ ధీజనతాఘనతాపహారి రో
చిష్ణు ఘనాఘనోత్కటరుచిస్ఫుటరూపన! పావనక్రియో
త్కృష్ణ నిరుష్ణ కృష్ణ ప్రణుతించి భజింతు నభీష్టసిద్ధికిన్. 134

వ. అని కృష్ణవేణిం బ్రస్తుతించి యింద్రుం డిష్టమనోరథకలితుండయ్యె నని
మఱియు గాలవుం డిట్లనియె. 135

**తార చంద్రుని ఆశ్రయించినందుకు గురుడు దుఃఖించుట**

క. తారావధూశిరోమణి
తారాపతి (నాశ్రయించి) దర్పకకేళిన్
వారనిసౌఖ్యోన్నతి నను
వారంబు సుఖింపుచుండె వైభవమెసఁగన్. 136

క. అంతట తన సతి చంద్రుని
యంతఃపురమునవసించి యలరుచునున్నన్
జింతించి గురుఁడు రజనీ
కాంతునితో నిట్టులనియె ఘనతరబుద్ధిన్. 137

చ. మనసునకొంక కిట్టు లభిమానముతోడను విప్రభామినిన్
దనరగ బాహుజుండు మమతన్ రమియించిన నాయువున్ ధనం
బును సిరియున్యశంబును బ్రభుత్వమునున్ జెడిపోయి ఘోరయా
తనముల పాలుగాక ప్రమదంబున భోగనియుక్తిఁ జెందునే. 138

సీ. బలపరాక్రమములు గలవని చతురంగ
వాహినీయుక్తిచే వరసువర్ణ
మణిధాన్యవితతుల మహిమోన్నతివహించి
యున్కిభావించ ననూనమంత్ర
విదులము కోదండవిద్యాప్రవీణుల
మమితతేజోధికులము సమస్త
ధర్మవర్తనులము ధార్మికులమగుట
నెఱుఁగవే దుర్దోషమేలనీకు
గీ. నవని దేవుండు నిక్కమ యలిగెనేని
నిఖిలజగములఁ బృథుశక్తి నిగ్రహింపఁ
జాలుఁ గావున పరసతీసంగమంబు
నరకహేతువు ఇటుసేయ న్యాయమగునె. 139

వ. మఱియు క్షత్రియుండు బ్రాహ్మణ గోరక్షా నిమిత్తంబున నాపత్సమయంబున భూసురునితోడ సంగమంబు సేయ నుచితంబు వేదాధ్యయన సంపన్నకులీనుండైనవిప్రుండు తేజోశాసనంబు ప్రాపించుటకు శాస్త్రధారి యగు బ్రాహ్మణుండు శస్త్రధారియయ్యేనేని యతఁడిరువది యొక్క కులంబులవారితో నరకంబున నుండు. పూర్ణకాముండయ్యును కులీనుండయ్యేనేని బ్రాహ్మణుండు నిష్ఠాతుండయ్యేనేని కాలాంతంబున బ్రహ్మతేజం బడంగిన తెఱంగున నుండు బ్రాహ్మణునకు క్షత్రియవృత్తి హింసారూపంబు కావున క్షత్రధర్మంబున బ్రవర్తించుట హితంబుకాదు. 140

క. ఎనయ నయజ్ఞికుఁడై గృహ
మున సంవత్సరము మాత్రము వృథామతి నుం
డిన విప్రునిఁ జండాలుం
డని యెంతురు నిశ్చయించి యాగమవేత్తల్. 141

గీ. అవని విద్వాంసుఁడై యుండి యన్యవనిత
నభిలషించుచు మించెడు నతనిఁ బాప
కర్ముఁడందురు నిఖిలలోకములయందు
దొరయ భూసురతనువతి దుర్లభంబు. 142

సీ. ఇలలోనఁ గోటిశూద్రులవధ సేయుపా
పం బొకస్త్రీహత్యపాటి యగును
వనితాజనము కోటివధఁ జెందు నఘమొక
ధేనుసంహనన సమానమండ్రు
ధేనుకోటివధప్రదానదుష్కృత మొక
యవనీసురవధాభమై తనర్చు
నవనిసురులకోటి నణఁచు దోషంబొక
మనుజేంద్రుహత్యసామ్యతఁ జెలంగు

గీ. నట్లనిన దుష్ట(జన)నిగ్రహంబు శిష్ట
పాలనమొనర్చుకతన భూపాలుఁడధికుఁ
డట్టి భూపతిగురుపత్ని నభిలషించి
హీనబుద్ధులు చెడిపోవ కేల బ్రతుకు. 143

వ. మానవుండు సకల యోనుల జన్మించి క్రమక్రమంబున గోబ్రాహ్మణ కులంబునంబుట్టి యధికుండై ప్రవర్తిల్లు. బ్రాహ్మణుండు లోకపూజ్యుండు నీవు విప్రస్త్రీని పరిగ్రహించుట నీతి కాదని యెఱింగించి వెండియు వానితో నిట్లనియె. 144

సీ. వెలయ లోకోత్పత్తి విష్ణుఁడొనర్చి సా
  మ్రాజ్యపట్టము గట్టె బ్రహ్మఁ దొల్లి
పవనుఁ గట్టడిచేసి యువరాజుగాఁ బరి
  పాలించ నభవుని పాలఁ బెట్టె
బలవైరి సచివుగానిలిపె విఖ్యాతి సం
  భృతకుఁ దగఁ బ్రజాపతుల నునిచెఁ
బ్రకట ధర్మముల ఋషికులమ్ముఁ జాలించె
  స్తుతగూఢచరత వసువులకిచ్చెఁ
గీ. జంద్రసూర్యులఁ బాటించె జగము నడుప
శమనుఁ గారాగృహాధికారమునఁ బూన్చె
మహిమ సదసద్వివేక కర్మములకును న
వగ్రహములను నియమించె వరుసతోడ. 145

క. నలుబదితొమ్మండ్రనఁగాఁ
గలుగు మరుద్గణము లైరి కంచుకులు మహో
జ్జ్వల గంధర్వులు నచ్చర
నెలఁతలునై రతుల గీతనృత్యంబులకున్. 146

క. సురుచిర కిన్నరసంతతి
సరసస్తుతిపాఠకవ్రజంబులు విద్యా
ధరులెన్న వందిబృందము
లిరవొందగనైరి పంకజేక్షణ కరుణన్. 147

వ. మఱియు గ్రామాధికారులను రాజులను లోకంబులకు లోకపతులను నిషాదరక్షోగణంబులను దేవతలను పరివారంబుగా సార్వభౌముండైన విష్ణుండు నియమించె ధర్మసంస్థాపనార్థంబు మిమ్ము గల్పించుటంజేసి మీరలు ఋషులను ప్రసిద్ధికెక్కితిరి గావున మీరలు చంద్రుపాలికింబోయి బోధింపుండని గురుండు పనిచిన వారలు చంద్రునికడకుం జని యిట్లనిరి. 148

చ. సరసిజవైరి! నీతిగుణశాలివినీవు మహీసురుండు స
ద్గురుఁడు సమస్తవర్ణములకున్ బ్రభు వట్లునుగాక దేవతా
గురుఁడు మహాత్ముఁ డాధిషణుకోమలి నీకును దల్లి లోకసుం
దరి నవినీతిమైఁ గదిసి దర్పకకేళి సుఖించఁ బాడియే! 149

క. ఈకర్మ దురితచయములు
నీకెందును బాయునే ధిషణు నెలఁత విడువు సు
శ్లోకనిధి! యనుచుఁ బలుక ని
శాకరుఁడు నిరాకరించె సంయమివరులన్. 150

చ. అటులు నిరాకరించబడి యాఋషిసంఘము దేవతాగురున్
స్ఫుటమతిఁ గాంచి తా రెలమిఁ బోయి శశాంకునిఁ జూచి బోధసే
యుటయును దారఁ జిత్తముననుంచి మదంబునఁ దన్ నిరాకరిం
చుటయును జెప్పి యింక బలసూదను పాలికిఁ బోవ మేలగున్.

ఆ.వె. అనుచు గురుఁడుఁ దాము నమరేంద్రు కడకేఁగి
హిమకరుండు గురున కెగ్గుసేయు
విధముఁ దెలుప హరియు విస్మయచిత్తుఁడై
యెల్లసురలు వినఁగనిట్టు లనియె. 152

క. సురకిన్నరప్రజాపతి
గరుడ వసుఫణీంద్రరుద్ర గంధర్వదివా
కరమునులారా! వింటిరె
హరిణాంకుఁడు చేసినట్టి యపకారంబున్. 153

క. మతిఁ గొంకక యాచార్యుని
సతిఁ గైకొందురె మదాతిశయభావమునన్
సితకరుఁడు రుద్రవరగ
ర్వితుఁడై సత్కర్మమనుచరింపఁడు కంటే! 154

వ. ఈశ్వరుండు సముద్రమథనంబునాడు లోకకంటకంబైన విషంబు ధరియించి తదీయతాపనివృత్త్యర్థంబు చంద్రకళాధారణంబుసేసి యతనికి రాజత్వంబిచ్చి రాజగంధర్వయక్షరాక్షసుల కవధ్యుండవు గమ్మని వరంబు దయచేసెంగావున శశి మన శిక్షంబొందండు సామ్రాజ్యంబు వహించి గర్వించియున్నవాఁడని సదాశివుండైన నమ్మదాంధుని భేదింపంజాలఁడనిన గురుండు కడుదుఃఖించి యింద్రాదిదేవతలతో నలుకవొడమి యిట్లనియె. 155

సీ. లోకధర్మంబులాలోకించ హరి మిమ్ముఁ
గల్పించె మీరధికారులగుచు
నున్నవారలు ధర్మమొకరీతిగాదని
యలుకమై వలదనవలయుఁగాక
వెనుకకు వత్తురే యనిమిషులకుఁ బురో
హితుఁడ నే నిట్లైన హితమె మీకు
శిష్యులు గనుక విశేషించి యీదోష
మన్యులకగునె మీయదియెకాక

గీ. రాష్ట్రదుష్కృతమెల్లను రాజుఁ జెందు
క్షితివిభుని దురితము పురోహితుని కంటు
భార్య చేసిన దోషంబు భర్త కొదవు
శిష్యపాపంబు గురునకుఁ జెందునండ్రు. 156

క. అది గావున దోషము మీ
కొదవుట నిశ్చయము దుర్ణయుని నెట్లైనన్
మదమణఁగించుట ధర్మం
బిదియదియని యెన్నుకొనుట యేటికి మీకున్. 157

వ. అని యనేకవిధంబులం జెప్పిన బృహస్పతి నూరార్చి యప్పుడు

చ. హరిశిఖివాయుపాశధరు లంతకకీలి శచీశ్వరాసురుల్
సురవిభు దండికీలిదితిజుల్ కలిపాశి నృగార్కజౌర్వ ని
ర్జరపతివాయులొప్ప దనుజ శ్వసనాగ్ని శచీపతుల్ సురే
శ్వర ధనదాశుగాబ్ధిప నిశాగయమజ్వలనాంగమున్ భవున్. 159

క. కలసికొని ఋషులు రుద్రులు
బలసికొలువఁ బద్మగర్భుపాలికిఁ జని ని
శ్చలభక్తి మ్రొక్కి నిలిచిన
జలజభవుం డాదరించి సత్కృపతోడన్. 160

క అనిమిషులు ఋషులు వచ్చిన
పనియేమన (మ్రొక్కి) వారు పద్మారియొన
ర్చిన దౌర్జన్యంబంతయు
వినిపించిన నబ్జభవుఁడు విబుధుల కనియెన్. 161

క. శత్రుఁడు మిత్రుఁడుఁ బోరఁగ
మిత్రుని గెలిపించుటెల్ల మేలండ్రు బుధుల్
మిత్రులు మిత్రులుఁ గినిసిన
మైత్రిఁ దదీయాగ్రహములు మాన్పఁగవలయున్. 162

వ. ఎట్లనిన చంద్రుండు దేవతలకు మిత్రుండు గురుండు మహాత్ముండు గావున జంద్రుదుర్ణయంబు మాన్పుటకును మీరును మేమునుంగూడి యతనిపాలికింబోదుముగాక యనిపోయిన తుహినకరుండును సిగ్గును వినయంబును సంభ్రమంబునునెఱయ నందఱకుందగు పూజా విధానంబు లాచరించిన యనంతరంబ నిలింపప్రకరంబులు విను చుండ బ్రహ్మ శశాంకునితో నిట్లనియె. 163

క. గురుపత్ని తల్లికంటెను
కరమెక్కుడు ధార్మికులకుఁ గావున ధరణీ
పరిపాలన కర్తవు సుర
గురుపత్ని వరింపఁదగునె గుణరత్ననిధీ! 164

క. హరిసర్వాత్మకుఁ డవ్యయుఁ
డరయంగా ధర్మహానియగు చోటుల బం
ధురలీలఁ బుట్టి ధర్మము
స్థిరముగ సంస్థాపనంబు సేయుచునుండున్. 165

గీ. కావునను గురుసతిని శీఘ్రంబు విడువు
మనుటయును సమ్మతించి తారాధిపతియు
నంతిపురముననున్న యేణాంకబింబ
వదనఁ దారను దోడ్కొని వచ్చి యపుడు. 166

క. గురునకు నర్పించిన శశి
ధరునింగని ధిషణుఁడనియెఁ దనయు బుధును మ
ద్వరవీర్యసంభవుని భా
స్కరతేజునిఁ దోడితెమ్ము గ్రక్కున నిటకున్. 167

వ. అనిన చంద్రుండు మీకు సంభవించినవాఁడుగా దైదేండ్లయ్యె నస్మ
త్తనయుండనినఁ గ్రమ్మఱనిరువురకు వాదంబయ్యె నప్పుడు విరించి
యీధర్మంబేర్పరింపుమని బ్రహ్మవేత్తల నియమించిన వార లిట్లనిరి

క. పతియనుమతిఁ గొని నియతిన్
సతి యన్యుని వలన గనిన సత్పుత్రుం డు
న్నతమతి క్షేత్రజ్ఞుండనఁ
దతమతి నర్హుండు తల్లిదండ్రుల కెలమిన్. 169

ఆ.వె. ప్రథమపక్షమునను బలిమి నన్యుండింతిఁ
బట్టెనేని యఘము పడతి కొదవ
దపరపక్షమునను వ్యభిచరించిన కాంత
తాన చెందు దుష్కృతముల నెపుడు. 170

క. అనిమును లాడిన వనజా
సనుఁడును నిర్జరులు చంద్రు సదనమున వసిం
చిన బుధునిఁ బిల్చి తగనా
తనితో నిట్లనిరి సమ్మదం బలరారన్. 171

సీ. తనయుని జన్మంబు తల్లి యెఱుంగు నీ
వనఘ! తారాదేవి నడిగిరమ్ము
పొమ్మని పంచిన బుధుఁడును బోయి ని
శ్చలబుద్ధినంతయుఁ దెలిసివచ్చి
దేవబృందమునకుఁ దెలివితో నిట్లనె
జారరూపంబున జనని నన్ను
వనజారికిని గంటి ననియె నావుడు సుర
సంఘంబు లెల్ల నాచార్యుఁ జూచి
గీ. నీకుఁ బనిలేదు చంద్రునన్నెలఁత కోరి
కనినయది శశియును బలాత్కారి కాఁడు
ఋతము గాన్పించె ననిన నమృతకరునకు
నక్కుమారుని నొసఁగిన నాతఁ డలరి. 172

వ. తన రాజ్యంబు బుధునకిచ్చి ప్రజలంజూచి యితండు మీకురా జితని యాజ్ఞలలో నడువుండనిన వారందరు చంద్రునితో నిట్లనిరయ్యా! యితండు కుండుండు రాజ్యంబున కనర్హుం డేల గైకొందుమని యంగీక రించకయుండి రంత దేవగురుండు నిజభార్యయైన తారం జూచి కోపించి యిట్లనియె. 173

గీ. నీవు చేసిన పనులకు నిన్ను కుడ్య
మధ్యమమునుంచి జీవనమాత్ర మశన
మిడఁగ దగు నొకవర్షంబు కడఁక తోడ
ననిన నాపల్కువిని బుధుఁ డాత్మఁ గలఁగి. 174

క. అమరుల మునులంగని ప
లెక్క మహామతులార! తల్లికిని నాకుఁ గళం
కముఁ బాయఁగఁ బ్రాయశ్చి
త్తము గల్గినఁ దెలుపరయ్య తాత్పర్యమునన్. 175

క. అని వేఁడుకొనిన సభవా
రెనయఁగ లోకేశుహృదయమెఱిఁగి తదీయో
గ్రనిబిడ ఘనదుష్కృతనా
శనమగు తెఱఁ గాత్మఁ దలఁచి చతురతఁ దమలోన్. 176

క. జనకుఁడు గల్గియు నొరులకుఁ
గొనకొని జన్మించు నతఁడు కుండుండయ్యెన్
బెనిమిటికి వీతతంతువు
కును బుట్టిన పుత్రకుండు గోళకుఁడయ్యెన్. 177

క. నాయకుఁడుండిన గతమై
పోయిన నాయింతి యన్యపురుషుఁ గదిసి తా
నేయెడఁ జండాలియనఁగ
నాయతసత్కర్మదూరయై వర్తిల్లున్. 178

గీ. అట్టి కామినితోడ మోహముననైన
దాస్యముననైన సురతతంత్రములు సల్పు
చుండు నాతండు పితృగణయుక్తుఁడగుచుఁ
గల్పపర్యంతమును నరకమున నుండు. 179

మాఘస్నానాదుల వలన చంద్రాదులు విగతదోషులగుట

వ. మఱి యా స్త్రీపురుషులకుఁ బుట్టినవారలు కర్మచండాలులును కుండ గోళకులును సంకరులును నగుదురు. ఇట్లని ధర్మనిర్ణయంబునం బలుకంబడినయది యని దేవగణంబులకు విన్నవించి వెండియు హిరణ్యగర్భుంజూచి యయ్యా! మాకు వృథాప్రయాసంబయ్యె పూర్వం

బున విష్ణుదేవుచేతఁ బ్రాయశ్చిత్త విధానంబు తెఱం గెఱింగితిమి మహాపాతకకోట్లైనను విలీనంబగు లక్షవర్త్రివ్రత మాఘస్నాన ఫలంబున మఱియు మాఘంబున నశ్వదానంబుచేసిన గురుతల్పగ దోషనాశనం బగు నదిగావున నీ ముప్వురచేతను నీవ్రతత్రయంబు సేయించిన శుద్ధులై పూజ్యులయ్యెదరని బ్రహ్మయనుజ్ఞను లక్షవర్తి వ్రతంబు తారా దేవిని మాఘస్నానంబు బుధునిని సదక్షిణాశ్వ దానంబు చంద్రునునిం జేయించిన. 180

మ. తతశక్తిందగు దేవతానుమతిచేతన్ లక్షవర్తిస్ఫుట
వ్రతమత్యున్నతిఁజేసి తన్మహిమ నిర్వ్యాజప్రదీప్తిన్ బతి
వ్రతలం దుత్తమసాధ్వినాఁ బరగి తారాదేవియొప్పెన్ బృహ
స్పతియున్ బ్రహ్మయనుగ్రహంబునను జేపట్టెన్వధూరత్నమున్.

గీ. బుధుఁడు మాఘావగాహనంబున విశుద్ధ
భద్రమూర్తి వహించినఁ బ్రజలు నిఖిల
రాజ్యపట్ట(భద్రా)ర్హసంపూజ్యుఁ జేసి
రశ్వదానంబున శశాంకుఁ డనఘుఁడయ్యె. 182

క. ఈరీతిన్ గురువాక్యము
వారిజభవముఖ్యదేవవర్గము సుమన
స్సారమతిఁ జక్కఁజేసి యు
దారత మాఘాతిశయమహామహిమంబుల్. 183

వ. బహువిధంబులం బ్రశంసయొనర్పుచు నిజస్థానంబులకుం జనిరని గాలవుండు కుటీరస్థులతో నిట్లనియె. 184

చ. హిమవిమలాంబు శీకరము లెన్నికసేయను దివ్యవాహినీ
సముచితజీవనాంతరితసైకతరేణుతతుల్గణింప బు
క్షములగముల్ వినిర్ణయవశంబున లెక్కిడవచ్చుఁగాని మా
ఘమహిమ నెన్నఁగావశమె గారడలేక నిజంబెపల్కితిన్. 185

క. మంచిది మాఘమువంటి స
మంచితధర్మంబులేదు మానవుఁడుండున్
గించితుధర్మమొనర్చిన
నెంచఁగ నక్షయఫలము రమేశ్వరుఁడొసఁగున్. 186

క. ఏ నరుఁడైనను మాఘ
స్నానఫలం బధికమని నిజంబుగ మదిలోఁ
దా నెఱుఁగఁడేని శమన
స్థానంబున నరకబాధసంగతిఁ జెందున్. 187

క. ఎన్నఁగ నీయితిహాసము
విన్నను విన్పించినను సవిస్తారముగా
సన్నుతిసేసినఁ జదివిన
నన్నరులకు శుభములొదవు హరిపురిగల్గున్. 188

శుచివ్రత వృత్తాంతము

క. అని మఱియుఁ గుటీరస్థులఁ
గనుగొని దయఁబల్కెఁ దొల్లి కౌశికదేశం
బున నంగరమను పురమున
వనజాక్షుని భక్తుఁడొకఁడు వైశ్యుఁడు వెలయున్. 189

గీ. అతని నామంబు ధర్మరాజనఁగఁ దగును
చెలఁగి యాధన్యపుత్రి శుచివ్రతయన
ననఘమతి యగు దాని విహ్వాలుఁడనంగ
నమరు నొకవైశ్యపుత్రున కర్థి నొసఁగె. 190

వ. అంత నాకాంతాతిలకంబు భూసురస్త్రీసమాగమంబున లక్షవర్తివ్రతం బొనరించె విహ్వాలుండును వేశ్యాకాముండైధర్మరహితుండై ప్రవర్తింపుచు కొన్నివర్షంబులకుఁ దనువుదొఱంగి తదీయదేశంబునఁజిత్రవర్మాభి

ధానంబున జనియించె శుచివ్రతయు ఋణానుబంధరూపంబున పున ర్జన్మంబునొంది సత్యవ్రతయనుపేరఁ జిత్రవర్మకు భార్యయయ్యె నిట్లిరు వురు నధిక సంపదల విలసిల్లుచున్నఁ బూర్వకృతంబునఁ జిత్రవర్మ జారుండైన యాసాధ్వి లక్షవర్తివ్రత ప్రభావంబునఁ బాతివ్రత్యంబు ధరియించి పతి శుశ్రూష సేయుచు 191

సీ. ప్రాణేశుఁడన్యకాంతాసక్తుఁడైనను
డెందంబు లోపలఁ గుందుకొనదు
కాంతుండు నిజధనం బెంతవెచ్చించిన
ననుకూల యగుఁగాని యడలుకొనదు
పతి సేయఁగారాని పనియేమిచేసిన
నావగింజంతైన నేవపడదు
నిజనాయకుండవినీతిమైఁ దిట్టినఁ
జింతాపరిభ్రాంతిఁ జెలఁగలేదు
గీ. భోజనాభ్యంగనాదులఁ బ్రోదిసేయు
గంధతాంబూలకుసుమసౌఖ్యములఁ దనుపు
గురుఁడు బంధుఁడు దైవంబు పరమసఖుఁడు
విభుఁడ యని యనిశంబు సద్వృత్తిఁ జూచు. 192

క. నిరతంబు నింటిలోపల
వరమతి భుజియించి వారవనితామణిమం
దిరమునకు నేఁగు వల్లభు
నిరవొందఁగ ననిపివచ్చు నెవ్వగలేకన్. 193

క. పతితోడుత యనుగమనము
మతిఁగోరుచు నుండు నిండుమనసున నంతన్
కతిపయవర్షంబుల కు
న్నతమతియగు తద్విభుఁడు వ్రణస్థుండయ్యెన్. 194

వ. ఇట్లు వ్యాధిపూరితుండై పిచ్చుకకుంటై కదలమెదలలేక పుణ్యపాపంబు
లిహంబున ననుభవింపుచు జారత్వంబుమానక కామాకులచిత్తంబునం
గుందు నిజనాథుంజేరి యా లలన యొక్కనాఁ డిట్లనియె. 195

క. వల్లభ! యఱసేయక నీ
యుల్లంబున నెద్ది కోరుచుండుదు వది రం
జిల్లఁగఁ గావించెద ధర
నెల్లగ పతిహితమొనర్చు టింతి గుణంబుల్. 196

సీ. అనిన సంతోషించి యా వధూరత్నంబు
తోడ నిట్లను నీవు తోయజాక్షి!
నాదు చిత్తము వారనారీశిరోమణి
పైఁగాని పెఱచోటఁ బాదుకొనదు
వేశ్య భుజించిన వెన్న నే భుజియించి
తనుయాత్ర నడుపుదు దానితోడ
వ్యాధిచింతకొకింత వగవను విరహాగ్ని
మిగుల వేధింప శమింపరాదు
గీ. రమణిరో! నన్ను నీదు భుజముల మీఁద
నసువు మీఱంగ నెక్కించుకొని తదీయ
మందిరమునకుఁ గొని గరిమమునఁ జనిన
వేడ్క సుఖనిద్రఁ జెందుదు వేయునేల. 197

క. అని పతి పల్కిన కాని
మ్మని యాసతి యర్ధరాత్రమప్పుడు విభునిం
దనభుజములపై నిడుకొని
యనువుగఁ బురిబాహ్యభూమి నరుగుచు నుండెన్. 198

వ. అట్లు భాద్రపద బహుళాష్టమినాఁడు నల్గడల వలాహకంబులు గప్పి
చినుకం దొణంగిన కతన దృఢవ్రతంబే సహాయంబుగాఁ జనుసమ
యంబునఁ దొలునాఁటి నిశియందుఁ దత్పురరాజగేహంబు చోరులు

చొచ్చి వస్తువ్రాతంబులుం గొనిపోవునెడ రాజభటులు వెనుదవిలిన వారు మాండవ్యుండు జపంబొనర్చు నచ్చటికి జాడ చూచి క్రమ్మఱి యడవింబడి తొలంగినఁ దలార్లు జాడవెంబడివచ్చి జప సమాధానం బున నున్న మాండవ్యుంగని యతండు చోరుండని నృపతికి విన్నవించి తదీయానుమతంబున నమ్మునిని శూలంబుపై వైచిపోయినఁ బరమ ధ్యానారూఢుఁడై యెద్దియుం బరికింపకుండిన నప్పు డప్పతివ్రత చీకటి చేత నాశూలంబు దాఁకి పడిలేచి మ్రొక్కిన మునిపతి యిట్లు వ్యథచేసిన వా రెవ్వరనిన నా సాధ్వీతిలకంబిట్లనియె. 199

క. మునిచంద్ర! యేఁ బతివ్రత
ననుమతి మద్విభునకుం బ్రియంబుగ వేశ్యా
వనితాగృహంబునకుఁ జే
కొనిపోవఁగ వానజల్లు గురియఁ దమమునన్. 200

క. కానక శూలముఁ దాఁకితి
మౌనీంద్ర! శమింపుమనిన మాటలు విని ధా
త్రీనాథు భటులు (డగ్గఱి)
పైనున్న తపస్విఁజూచి పరహితబుద్ధిన్. 201

క. శూలంబు డించిపోయినఁ
దాళక యాసాధ్విఁజూచి తాపసియలుకన్
లోలాక్షి! భాస్కరోదయ
వేళకు మృతిఁ బొందు నీదు విభుఁడని పల్కెన్. 202

లక్షవర్తి వ్రతముచే శుచివ్రత సూర్యోదయమును నిలుపుట

క. ఆరీతి శాపమిచ్చిన
వారిజదళనేత్రియును దివాకరుఁ డుదయం
బై రాకయుండుననినన్
సారధృతిన్ లక్షవర్తిసద్వ్రతమహిమన్. 203

వ. లక్షవర్తివ్రతంబు చేయువారికి వైధవ్యంబు లేదని హరి నిర్ణయించిన వాఁడు గావున పూర్వజన్మంబున నాపతివ్రత యది యొనరించుటంజేసి సూర్యోదయంబు గాకుండె హరియును దద్వచనంబు పాటించిన హేతువుచే భానుండు పూర్వశిఖరికి రాకుండునట్లు గావించె దినకరుండును కాలాత్మకుండయ్యును హరి యాజ్ఞఁ జేసి యుదయింపండయ్యె నిట్లొక్క సంవత్సరంబు సర్వక్రియాలోపంబైన జంద్రాదిగ్రహంబులును బ్రహ్మ పాలికిం బోయి యిట్లనిరి. 204

సీ. సరసిజగర్భ! భాస్కరబింబ మి ట్లుద
యింపకుండిన లోకమెట్లునడచు
నొకసాధ్వి పెనిమిటి నకలంకగతి వార
వనితయింటికిఁ దోడుకొనుచుఁ బోవు
చుండ మాండవ్యుఁ గొఱ్ఱొరసి తాఁకిన ముని
శపియింప సతియును జలజమిత్రుఁ
డుదయంబు గాకుండ నొనరించెఁ గావున
నంధకారము నిండె నఖిలదిశలఁ

గీ. జోరజన బాధ మిగుల విశ్రుతము చెందె
యజ్ఞములు సాగకుండె వజ్రాయుధాది
శస్త్రచయములకుఁ బ్రయోగసరణి లుడిగెఁ
గరుణతోడుత రక్షించి కావుమయ్య. 205

క. ఉక్కటి జన్నము లుడిగినఁ
జిక్కరె గీర్వాణు లశనచింతాపరులై
యక్కట! కావందగవే
దిక్కెవ్వరు నీవెకాక దేవస్తుత్యా! 206

వ. అనిన వారికిఁ గమలగర్భుం డిట్లనియె. 207

క. చతురమగు లక్షవర్తి
వ్రతమహిమను భాను పొడుపు(రహి) నిల్పెఁ బతి
వ్రత తత్కృత నిశ్చయులను
శతపత్రాక్షుండు ప్రోచు సముచితభంగిన్. 208

వ. కావున నమ్మదిరాక్షి నెన్నంబనిలే దందఱ మచ్చోటికిం బోదమని హిరణ్య గర్భుండు దేవమునిగణంబులతో భూలోకంబునకుం బోయి పతివ్రత యున్న గృహంబునకు వచ్చిన నప్పుడప్పరమసాధ్వి నిజనాథుని వేశ్యా గృహంబున నుంచి క్రమ్మఱి వచ్చుటంజేసి విరించి ప్రముఖ దేవగణం బులం గని నమస్కరించి వినయంబున నిల్చిన బ్రహ్మసాంత్వన వచనం బుల నమ్మగువ కిట్లనియె. 209

సీ. వనజాక్షి! మాండవ్యముని శాపమిచ్చిన
కతన రవ్యుదయంబు గాకయుండఁ
జేసితి వది విమర్శింపఁ బతివ్రత
లకు నుచితంబగుఁ బ్రకటబుద్ధి
నేమును దివిజులు నిటకు వచ్చితిమి క
ళ్యాణంబునీకని యతివతోడ
లక్షవర్తివ్రత లక్షణంబునఁ బతిఁ
బాయునె యెటువంటి భామయైన
గీ. దివ్యమగు మాఘఫలము మాండవ్యుచేత
ధవున కీఁ దగు నతఁడు మృత్యువు జయించుఁ
జువ్వె రోగంబులను బాసి శుద్ధమగు శ
రీరము ధరించు నింక విచారమేల? 210

వ. మదీయ శాసనంబున నీ భర్తకు శాపమోచనంబగు మాండవ్యునికి బాధ లేకుండఁ జేసెదమని లక్షవర్తివ్రత ఫలంబులో లేశంబు మాండ వ్యున కిప్పించి యాయన మాఘస్నానఫలంబు పతివ్రతాధిపతికిప్పిం

చిన దన్మహిమను వ్యాధినిర్ముక్తుండై కుంటు మాని పూర్ణాయురోపేతుండై స్వస్త్రీవ్యసనమనస్కుండయ్యె. పతివ్రతయు భానుబింబం బుదయింపం జేసిన లోకంబులు ప్రకాశంబునొందె నప్పుడు దేవతలచే నభీష్టవరంబు లిప్పించి విరించి నిజస్థానంబున కరిగిన. 211

సీ. ఖచరబృందములు మాఘస్నానమహిమయు
లక్షవర్తివ్రతలక్షణములు
పరమపతివ్రతా భక్తియు తద్గుణా
ధిక్యతలెన్నుచు దివికిజనిరి
మాండవ్యమునియు సమంచిత సంతుష్ట
హృదయంబుతోడ యథేచ్ఛఁ జనియె
నాసాధ్వి భర్తతో నమితవర్షము లిష్ట
భోగవిఖ్యాతి విస్ఫూర్తిఁ దనరె
గీ. భర్త మును సతిఁ బఱచిన పనులకాత్మఁ
గుందుచుండియు సతితోడఁ గూడి మకర
మాఘసుస్నానము లొనర్చి మహితశక్తి
లక్షవర్తివ్రతంబుచే దీక్షమెఱయ. 212

ఉ. ఆ మహిమంబుచే దశసహస్రమహాయనముల్ సమస్తభో
గామిత రాజ్యలక్ష్మి తగి యంచితవైభవలీలమీఱఁగా
భూమిఁ బ్రసిద్ధిగాంచి తగఁ బుత్రులు పౌత్రులు గల్గి శార్ఙ్గ భృ
ద్ధామమున న్వసించి రమితస్థితి నంతమునన్ శుభోన్నతిన్. 213

వ. కావున మాఘస్నానంబునకంటె నితర కర్మంబులు లేవని యెఱింగించిన గాలవునకుఁ గుటీరవాసులిట్లనిరి. 214

క. మునుపు వసిష్ఠుని కొఱకే
మనుజాశనుఁ డొసఁగె మర్త్యమాంసము వాఁడే
యనువున మెలఁగెను దత్కథ
వినవేడుక యయ్యెఁ దెలుపవే మునినాథా! 215

క. అనుచుఁ గుటీరవాసులు
తను నడిగిన గాలవుండు తద్విధమెల్లన్
వినిపించెద నత్యుత్సవ
మునను వినుఁడటంచు మౌని ముఖ్యుఁడు పల్కెన్. 216

సహస్రబాహుని కథ

గీ. కాలమృత్యుభయంబుచేఁ గలఁగు నతి కృ
తాగసుని దుష్టరాక్షసు వేగ నిటకు
పట్టితెండన శమనుని భటులువచ్చి
కదిసి ననుఁజూచి భయముచేఁ జెదరి పఱచి. 217

శా. లీలావిగ్రహమూర్తులౌ ప్రమథులోలింగొల్వ బ్రహ్మాది ది
క్పాలశ్రేణిభజింప యోగినిచయోపాస్యుండు చిత్పూర్ణశో
భాలంకారశివాయుతుండు శివుఁడానందంబుతోఁబొల్చు నా
కైలాసంబునకా నిశాటుఁడు భయోత్కంపంబుతో నేఁగినన్. 218

క. భక్తార్తిహరుఁడు శరణా
సక్తమనస్కుండు యోగసాధ్యుఁడు నిరతా
వ్యక్తప్రకాశకుం డను
రక్తిన్ దానవునిఁ జేరరమ్మని కరుణన్. 219

క. భీతిగదురంగ నీవి
ట్లేతేరగఁ గారణంబదేమియనుడు సం
జాతభయభక్తి (యుక్తి) న్
దైతేయవరుండు మదనదమనున కర్థిన్. 220

వ. సాష్టాంగదండప్రణామం బాచరించి ముకుళిత కరకమలుండై
యిట్లనియె. 221

క. శివశంకర సర్వాత్మక
భవ మృడ సర్వజ్ఞ భూతభావన గౌరీ
ధవ బంధవిమోచన దుః
ఖవిదారణ నన్నుఁ బ్రోవఁగదవె మహేశా! 222

క. హర మృత్యుసంహరుండవు
సరసతను త్రియంబకమ్యజామహె యను సు
స్థిరవేదమార్గ విధమునఁ
బరికింపుము శమను భయము బాపుము దయతో. 223

గీ. తల్లియ విషంబు పెట్టిన తండ్రి సుతని
విక్రయించిన కినిసి పృథ్వీవిభుండు
సిరులు సర్వంబు నపహరించినను నిందు
కేల పరివేదనముఁ జెంద హృదయమునను. 224

సీ. అనవుడు శంకరుండనియెఁ గృపాలోక
నమున మున్ బ్రార్థించినాఁడ వీవు
కపటివై మోక్షము గావలె నని పల్కి
తది సులభంబు చేనగునె తలఁప
సూచింప శీతోష్ణసుఖదుఃఖమానావ
మానముల్ దుల్యముగా నొనర్చి
నిర్ద్వందమగుమతి నిర్మమనిరహంక్రి
యాభుక్తినిష్కాములై దృఢముగ
గీ. వింధ్యనగమునఁ దపము గావించితేని
హరిదయామతి మెచ్చి నీ యాత్మఁ గోరి
నట్టి శుభములు దయసేయు నంత నీవు
తత్ప్రభావంబువలనఁ జిత్రంబుగాఁగ. 225

గీ. బలి యనాఁ దగు దానవప్రభుఁడు గలఁడు
విష్ణుభక్తుండు కీర్తివర్ధిష్ణుఁ డతఁడు
వాని పుత్రుండవగుచు నవార్యశౌర్య
మహిమఁ బరగెద వీవు భూమండలమున. 226

మ. విజయస్ఫూర్తి సహస్రబాహుఁడనఁగా విఖ్యాతిఁ జెన్నొంది భూ
ప్రజలన్ బాలనసేయుచుండెదవు శుంభద్వైభవోద్వృత్తి వా
రిజనాభుండు యదూద్వహుండగును శ్రీకృష్ణాభిధానంబునన్
నిజయుద్ధంబగు నీకు శౌరికి భయోన్నిద్రప్రభావోద్ధతిన్. 227

క టంకారంబులు భేరీ
భాంకారంబులును వీరభటరవ కరటీ
ఘీంకారంబులు చెలఁగన్
హంకారంబులను గడు మహాహవమొదవున్. 228

క. గరుడోరగవిద్యాధర
సురఖేచరు లద్భుతముగఁ జూచుచునుండన్
దురమొనరించెడు నత్తరి
సరసిజనయనుండు శౌర్యసంరంభమునన్. 229

క. ఊహాపోహ లెఱుంగక
సాహసమున నీవుపోరు సమయంబున నీ
బాహుచ్ఛేదమొనర్చు మ
హాహవమున నంత నే దయామతినగుచున్. 230

గీ. పరమ సంప్రీతి వీఁడు నా భక్తుఁడనుచు
హరికి వినిపించి నీకునే నభయమిచ్చి
పిదప రాజ్యంబునందు సంప్రీతి నుంచి
క్రమముననను మోక్షమిత్తు విఖ్యాతిగాఁగ. 231

వ. నీవు మున్ను శైశవంబాదిగా నీ పర్యంతంబు పాపంబార్జించితి వది నీ దేహంబుతో నేకవింశతి నరకంబు లనుభవించిన యనంతరంబ బలి పుత్రుండ వయ్యెదు నీతోడ సఖ్యంబు సేసెద భవదీయ ద్వారంబున వసియింతు నంత కృష్ణప్రయుక్త సమరావసానంబున పుత్రపౌత్ర సమన్వితుండవై బహుభోగంబు లనుభవించి మదీయారాధన విశేషంబున మోక్షంబు నొందెదవని నిర్దేశించిన నప్పలుకులాకర్ణించి యమదూతలు మదంబు విడిచి నిజస్వామి కెఱింగించి రంత రాక్షసుండును పరమేశ్వ రాజ్ఞచే వింధ్యాద్రియందు తపంబాచరించి విష్ణుని వలన లబ్ధమనో రథుండై యాయాకాలంబునఁ దత్తత్కర్మలనుభవించి దేహావసానంబున బలిపుత్రత్వంబుజెంది యనేకభోగంబు లనుభవించి క్రమక్రమంబున మోక్షంబు నొందెనని యెఱింగించి వెండియు గాలవుం డిట్లనియె. 232

కల్మాషపాదునకు మునికాంత శాపమిచ్చుట

క. ధరణిని రాజర్షియనం
బరగిన కల్మాషపాదపార్థివుఁడు మహ
ద్గురుశాపంబున నక్తం
చరుఁడై కాననములందుఁ జరియింపంగన్. 233

సీ. తరుణవయస్కులెంతయు మునిదంపతుల్
మమతరెట్టింప సమ్మదముతోడ
నతులితశృంగారహావభావవిలాస
గతులఁ జిత్రప్రసంగతతులఁ దనరి
స్మరసంగరక్రీడ సల్పువారలఁ జూచి
తలఁకక భూపుఁ డాకలితచిత్తుఁ
డగుచు మనుష్యమాంసాహారభక్షణ
బుద్ధిచే నమ్మౌనిపుత్రుఁ బట్టె
గీ. నంగములు సంచలింప మహార్తి కడలు
కొనఁగ విరహావ్యవస్థ యెక్కుడుగ మోహ
మగ్గలంబుగ నధిక వ్యధాత్మ యగుచు
నతనికామిని ధారుణీపతికి ననియె. 234

మ. నరనాథోత్తమ! సూర్యవంశమున నెన్నంగల్గు నిక్ష్వాకుభూ
వరపౌత్రుండవు శౌర్యధైర్యబలశశ్వద్వైభవోత్కృష్ట సు
స్థిరవిఖ్యాతుఁడ వార్యగణ్యమదయంతీ ప్రాణనాథుండ వీ
వరయన్ రాక్షసకృత్యమర్హమె మహీశా! బుద్ధినూహింపుమా! 235

మ. స్థిరపుణ్యుండవు పార్థివోత్తములు సంసేవింప సత్కీర్తి న
ధ్వరముల్ సేసినయట్టి మాన్యుఁడవు నిత్యప్రీతిగా ధారుణీ
సురసంరక్షణ సేయుధన్యమతి వక్షుద్రప్రభుత్వంబుచే
ధర పాలించిన రాజచంద్రుఁడవు తథ్యంబింతయున్ భూవరా!

ఆ.వె. హీనవృత్తితోడ నిప్పుడు మత్ప్రాణ
విభు ననంతవేదవేత్త ననఘు
బాలు విప్రతనయుఁ బట్టి చంపఁగ నేల
వలవ దుడుగు మయ్య చలము గొనక. 237

క. అని ప్రార్థింప నిశాటుఁడు
తన మది నొక్కింత శంకదలఁపక మునినం
దనుఁ ద్రుంచిమ్రింగ నాతని
వనిత యడలు గదురఁ జింతవంతయు నుడుగన్. 238

వ. బహువిధంబులం బ్రలాపంబు చేసి కోపదందహ్యమానమానసయై యతని నిరీక్షించి ఓరి!దుష్టాత్మా! నేఁడాదిగాఁ గాంతాసంగమం బెప్పుడు నీకు ప్రాప్తంబగు నప్పుడ పంచత్వంబుఁ బొందుమని శాపంబిచ్చి తత్స మీపకాష్టంబులఁ జితిపేర్చి యందనల సంధానంబు చేసి నిజనాథు శల్యచర్మంబు లందారోపించి తదీయధ్యానారూఢమానసయై యతని తోడంగూడ నూర్ధ్వలోకప్రాప్తింజెందె నంతఁ గల్మాషపాదుం డసురవృత్తిచే పతివ్రతోక్తశాపసంప్రాప్తుండై చరియించుచుండునంత 239

క. ధాత్రీరమణుని విశ్వా
మిత్రుఁడు బోధింప మదము మిగిలి వసిష్ఠ
చ్ఛాత్రాంతరమున శక్తిక
ళత్రధ్వంసనము సేయులా గూహింపన్. 240

సీ. సంతతంబచటికిఁ జనుదెంచి మాధవ
స్తవరాజపఠనచే దగ్ధుఁ డగుచుఁ
దిరిగి వనము చేరు తీరును గనుఁగొని
శక్తి భార్య వసిష్ఠసంయమీంద్రు
నొక్కనాఁడిట్లను నుడుగక నిరతంబు
కల్మాషపాదుఁ డిక్కడికి వచ్చి
హరిమంత్ర వహ్నిచే నతఁడు కార్శ్యముఁ బొంది
మగుడి పోయెడును సన్మౌనివర్య
గీ. సూనుఁ డెట్లట్ల తలఁప శిష్యుండు నీకు
నాతని నిమిత్తముగఁ గను నాత్మజులను
విధి వధింపఁగఁ జేసె వివేకబుద్ధి
దలఁచి కరుణింపగదవయ్య ధరణిపతిని. 241

క. అని కోడలు వినిపించిన
మునివర్యుండపుడు శాపమోక్షము సేయన్
తనమదిఁ దలంచి పాత్రం
బున నించిన జలముచేత భూమీనాథున్. 242

గీ. స్నానమొనరించి మాఘమాసప్రయుక్త
మజ్జనఫలంబు రాజసమర్పణంబు
సేయఁ బరిపూర్ణుఁడయ్యె నా క్షితివిభుండు
నంత మునివర్య ననుమతి నాక్షణమున. 243

క. కరితురగరథికసుభటో
త్కరసంకుల మతులవిభవధామం బతిసుం
దరనారీసంభ్రమమగు
పురము ప్రవేశించి రాజపుంగవుఁ డెలమిన్. 244

గీ. వారనృపభృత్యసామంతబాంధవులును
దత్తదుచితార్హవిధుల ముదంబొనర్ప
పూజ్యవైభవసర్వసామ్రాజ్యమహిమ
నతిశయించెను ధరణి రాజర్షి యపుడు. 245

క. ఒకనాఁడు మన్మథోద్దీ
పకమగు హృదయమున నాత్మభార్యను సురతో
త్సుకతఁ బిలిపించి తగనా
శుకవాణింగూడి రతులఁ జొక్కిన పిదపన్. 246

క. మునికాంతా శాపవశం
బున రాజవరుండు మృతము బొందినఁ దద్వ
ర్తన మెఱిఁగి వసిష్ఠుఁడు చ
య్యన నచ్చటు కరుఁగు దెంచి హర్షంబెసఁగన్. 247

గీ. పార్థివవరుండు కల్మాషపాదుఁడమృత
పదవిఁ జెందంగ సత్కృపాపరత నొసఁగి
యార్యసమ్మతి మదయంతియం దపత్య
మెలమిఁగావించి యిక్ష్వాకు కులము నిలిపె. 248

వ. అని కుటీరవాసులకు గాలవుం డెఱింగించి వెండియు నిట్లనియె.

సీ. మహనీయమైన యిమ్మాఘమాహాత్మ్య మి
ట్లరసి వర్ణింప మా కలవియగునె
కడకతో సూచనగా నెఱింగించితి
మాఘావగాహన మాధవార్చ

నములు భక్తికి హేతుకములు గావున మీదు
మతి నొనర్పంగ రమావిభుండు
ప్రత్యక్షమై యిష్ట ఫలములు మీకిచ్చు
నొగి నని గాలవుం డూరకుండె

గీ. నంత వారలు భూషాంబరాదివస్తు
తతులఁ బూజించి చాలసన్నుతులు సేసి
యతనిచేత ననుజ్ఞాతులై నిజాశ్ర
మములకు ఁగుటీరజనులు సమ్మతిగఁ జనిరి. 250

ఈ పద్యము ఈ కృతికి ముగింపు పద్యమే. తాళపత్ర ప్రతిలో దీని తరువాత 'నిమియనురాజు...' ఇత్యాదిగా సాగే ఒక కంద పద్యమున్నది. ఆ తరువాత 'సర్వజిత్తు సం॥ చైత్ర శుద్ధ శుక్రవారంవర్కు కొడుకుళ్ళ వెంకటసోమయాజులు వ్రాసుకొనెను' అని ఉన్నది.

కృతికి ముగింపు వాక్యాలు గాని, కృతిపతి సంబోధనాత్మకమైన ఆశ్వాసాంత పద్యాలు గాని, కవి వ్రాసుకొనే ఆశ్వాసాంత గద్య కాని కన్పించవు. వ్రాయసకాడు వాటిని వ్రాయక విడిచిపెట్టినాడు. ఈ కృతికి మరొక తాళపత్ర ప్రతి గాని, వ్రాతప్రతి గాని లభించనందున ఈవిధంగానే ఈ గ్రంథాన్ని ముగించటమైనది.



## కొన్ని పదములు - అర్థములు

అంతము = సమీపము
అంబుజాతపరిపంథి = చంద్రుడు
అంభోవృత్తము = నీటిసుడి
అంహము = పాపము
అఘౌఘము = పాపసమూహము
అజస్రము = ఎల్లప్పుడు
అజినము = చర్మము
అదరు = విజృంభించు
అతసీపుష్పము = అవిసెపూవు
అనోహకము = చెట్టు
అపనయించు = తొలగించు
అపనుదము = తొలగించుట
అపూపము = పిండివంట
అమా = అమావాస్య
అమర్షణము = కోపము
అరాతులు = శత్రువులు
అర్కము = తెల్లజిల్లేడు
అర్జున = తెల్లమద్ది
అఱసేయక = అనుమానము లేక
అలకలు = ముంగురులు
అలవరించు = వహించు
అవఘళించు = అధిగమించు
అస్తోకము = అధికము
ఆఁగు = కాపాడు
ఆఢకములు = (కొలత) తూములు
ఆదట = ప్రేమము
ఆభీలము = భయంకరము
ఆమలకి = ఉసిరిక
ఆమోదము = వాసన
ఆరగ్వధము = రేలచెట్టు
ఆహ్వము, ఆహ్వయము = పేరు
ఇను = విను
ఇనుమారు = రెండుసార్లు
ఈహితములు = కోరబడినవి
ఉంకువ = కట్నము, కానుక
ఉక్కగొను = ఉష్ణముచెందు
ఉక్కఱి = స్థైర్యము నశించి
ఉక్కుగొంచు = పట్టుదలతో తీసుకొనుచు
ఉగ్రశ్రవసుడు = సూతుడు
ఉత్కర్షము = మేలు
ఉత్తరుడు = ఉత్తముడు
ఉన్నిద్రుడు = మేల్కొన్నవాడు
ఉపజీవి = ఒకరిననుసరించి జీవించువాడు
ఉపలము = రాయి
ఉరలు = దొర్లు, రాలు
ఉర్వారుకము = దోసచెట్టు
ఉల్బణము = అతిశయము
ఊర్ణనాభి = సాలెపురుగు
ఋక్షము = నక్షత్రము
ఎరుసు = ఈర్ష్య
ఎఱఁగి = నమస్కరించి
ఎల్లి = మరునాడు
ఏకకుడు = అసహాయుడు, ఒంటరి
ఏచు = అతిశయించు
ఏర్పరించి = తెలిపి
ఏలా = ఏలకులు
ఏవము = రోత
ఒడబడు = (ఈయ) నంగీకరించు
ఒడికము = తగినవిధము
ఒదవు = కలుగు
ఒలయు = వ్యాపించు
ఓరవోవు = ఒరిగిపోవు
ఓర్చు = ఓడించు, అణగజేయు
ఔదల = నడినెత్తి

కందువ = సామర్థ్యము
కంబు = నీరు
కంసకము = కంచుగంట
కటాహము = (కాచే) కాగు, బిందె
కటుత్వము = కటుకరోహిణి
కట్ఫలము = టేకుచెట్టు
కడతురు = దాటుదురు
కదుపు = గుంపు
కనకనేత్రుడు = హిరణ్యకశిపుడు
కనలూని = కోపగించి
కపిత్థము = వెలగ
కమఠము = తాబేలు
కరటి = ఏనుగు
కరవీరము = గన్నేరు
కర్కటము = ఎండ్రకాయ
కర్దమము = బురద
కర్బురాచలము = మేరుపర్వతము
కలాపము = భూషణము
కల్యము = ప్రాతఃకాలము
కాంచికాదామము = మొలనూలిహారము
కాంతారము = అడవి, ఒక చెరకు
కారవేల్లము = కాకర
కాలరులు = దూతలు
కాలాగురు = నల్ల అగురువు
కింగిరి = అల్పము
కిటి = పంది
కీలి = అగ్ని
కుందము = మొల్ల
కుటజము = కొడిసెచెట్టు
కుడుంగము = పొదరిల్లు, బోడతరపుచెట్టు
కురువిందము = తుంగ
కులకము = నల్లతుమ్మచెట్టు
కులీనుడు = మంచికులస్థుడు
కూటబుద్ధి = కపటబుద్ధి
కూయిడు = మొఱపెట్టు
కూష్మాండము = గుమ్మడి
కెరలు = విజృంభించు
కేతకి = మొగలి
కేరు = తిరస్కరించు
కైరవము = తెల్లకలువ
కొ = కొని
కొంచక = సంకోచించక
కొఱలి = ఉండి
ఖనది = ఆకాశగంగ
ఖరకరోదయము = సూర్యోదయము
గణిక = వేశ్య
గములు = గుంపులు
గాంగేయము = బంగారము
గారడ = మాయ
గిరికొను = చుట్టుకొను
గుల్మము = బోదెలేని చెట్టు
గ్రసించు = మ్రింగు
గ్రాహి = వెలగచెట్టు
ఘనవాహపఘనవాహము=ఇంద్రుని గుఱ్ఱం
ఘనాఘనము = మేఘము
ఘూకము = గుడ్లగూబ
ఘోటము = గుఱ్ఱము
చంద్రము = కర్పూరము
చక్రపుష్కరవితానము = చక్రవాక, బెగ్గురుపక్షుల గుంపు
చక్రేశ్వరుడు = శేషుడు
చయము = సమూహము
చలదళము = రావి
చాంపేయము = సంపెంగ
చాలించు = శక్తులుగాజేయు
చించాఫలము = చింతపండు
చీరు = పిలుచు
చీఱు = చీల్చు

చూఱ = అధికము
చెలఁగు = వికసించు
చేపడు = చిక్కు
చేలము = వస్త్రము
జంబీరము = నిమ్మ
జటి = జువ్విచెట్టు
జలజగ్రహము = చంద్రుడు
జలూకము = జలగ
జాలకము = సమూహము, పసరుమొగ్గ
జోక = ఉత్సాహము, గుంపు, బాగు, జత
డింగు = అణగు
డిండీరము = నురుగు
తండులము = బియ్యము, వాయువిడంగం
తపనీయము = బంగారము
తమాలపత్రము = బొట్టు, మకరికాపత్రము
తమిస్రము = చీకటి
తలఁకు = భయపడు
తలకొను = యత్నించు
తలఁగు = తొలగు
తాటంకము = చెవికమ్మ
తుంటవిల్లు = చెఱకువిల్లు
తూలు = నశించు
తొడరు = ప్రయత్నించు
తొఱగు = విడుచు
తౌర్యత్రికము = నృత్తగీతవాద్యాలు
త్రస్తరించు = పరిహాసమాడు
దంభము = కపటము,తప్పు
దంభోళి = వజ్రాయుధము
దబ్బరలు = మోసగాళ్ళు
దరము = శంఖము
దరికొను =మండు
దాపు = సమీపము
దామకము = హారము
దార = భార్య
దారితకల్మషము = పోగొట్టబడిన పాపము
దురితము = పాపము
దుర్మనువులు = చెడ్డ మంత్రములు
దేవఖాతము = దేవతలచే త్రవ్వబడినది
దేవళ్ళ = దేవాలయముల
దైవస్వము = దేవధనము
ద్యుమణి = సూర్యుడు
ధాత్రీఫలము = ఉసిరికాయ
ధాత్రీధరచరము = కోతి
ధారాధరము = మేఘము
ధ్వాంతము = చీకటి
నక్రయుక్తుడు = మకరరాశి స్థితుడు
నట = దుండిగపు చెట్టు
నటి = ఒక సుగంధవృక్షము
ననవిల్లు = పుష్పధనుస్సు
ననుపు = ప్రేమ, అతిశయము
ననుబోటికి = నావంటివానికి
నలుపు = సుందరము
నలువుగ = చక్కగ
నారదము = మేఘము
నించు = నిండునట్లు చేయు
నిగుడుకొను = అధికమగు
నిచయము = సమూహము
నిర్భిన్నము = చక్కగా భేదింపబడినది
నెగడు = వర్ధిల్లు
నెరుసు = తప్పు
పంచనఖము = పులి
పంచాస్యము = సింహము
పంపు = ఆజ్ఞ
పంబి = అతిశయించి
పజ్జ = సమీపము
పటీరము = చందనపుచెట్టు
పడు = చొచ్చు
పతంగుడు = సూర్యుడు

పరగు = ఉండు
పరిధానము = ధోవతి
పఱచు = పడజేయు
పవనభుగినుడు = శేషుడు
పసదనము = పారితోషికము
పసి = గోగణము
పాటలము = కలిగొట్టుచెట్టు
పాటలి = మొక్కపుచెట్టు
పాటించు = ఆదరించు
పాని = తాగుబోతు
పారదము = పాదరసము
పీయము = పీనుగు
పుష్కలము = శ్రేష్ఠము
పొరయు = కలుగు, పొందు
పొలయు = వ్యాపించు, సంచరించు
పొలియు = నశించు
పొసగు = అనుకూలించు
పోతరము = మదము
పోత్రి = పంది
ప్రమీతులు = చంపబడినవారు
బంభరము = తుమ్మెద
బదరి = రేగుచెట్టు
బల = ముత్తవ పులగము
బలారికుజము = కల్పవృక్షము
బానసుడు = వంటవాడు
బిల్వము = మారేడు
బెగ్గడిలు = భయపడు
భయవలితులు = భయంతో చుట్టబడినవారు
భర్మధరము = మేరుపర్వతము
భర్మమేఖల = బంగారు వడ్డాణము
భాగినేయుడు = మేనల్లుడు
భారకుడు = బరువు మోసేవాడు
భాల్లక్ష్మాకారుడు = ప్రకాశించే లక్షణాలు గల రూపం గలవాడు
భృశము = అధికము
మందరము = బహుళము, ఒక పర్వతము
మందారము = కల్పవృక్షము
మకరీపత్రము = స్త్రీల చెక్కిళ్ళపై మొసలి ఆకారంలో వ్రాసే డిజైన్
మఖము = యజ్ఞము
మదనము = ఉమ్మెత్త
మరీచము = మిరియము
మరుత్కరి = ఐరావతము
మరుద్వరశిల = ఇంద్రనీలపురాయి
మలఁచు = మరలజేయు
మల్లాడు = పెనుగులాడు
మాకందము = మామిడి
మాతులుంగము = మాదీఫలము
మాతృస్వసేయుడు = పినతల్లి లేదా పెదతల్లి కుమారుడు
మాధవుడు = వసంతుడు, విష్ణువు
మిత్తి = మృత్యువు
మిహిరుడు = సూర్యుడు
మురఘస్మరుడు = విష్ణువు
మెలపు = జాగరూకత
యమి = ముని
యాజకుడు = యజ్ఞకర్త
రథ్య = రాజమార్గము
రాజవిద్వరము = రాజకలహము
రాజు = ప్రభువు, యక్షుడు
రామఠము = ఇంగువ
రుంద్రము = విరివియైనది
రుక్ = కాంతి
రుచితము = ఒప్పిదము
రేవా = నర్మదానది
ఱేపు = ప్రాతఃకాలము
లక్కాకు = లక్క పూసిన తాటాకు చెవికమ్మ
లతిక = తీగ

లవిత్రము = కొడవలి
లశునము = వెల్లుల్లి
లావు = ఆధిక్యము
లికుచము = గజనిమ్మ
లులాయము = దున్న
లూనము = కోయబడినది
లేములు = దరిద్రములు
వంజులము = అశోకము, ప్రబ్బలి
వడుగు = బ్రహ్మచారి
వడుగుపడు = కృశించు
వనరను = శోకించగా
వనీపుడు = యాచకుడు
వలాహకము = మేఘము
వాతాయనము = కిటికి
వామదేవుడు = శివుడు
వాస్తవ్యుడు = గృహస్థుడు
విటంకము = పక్షిగూడు
వినాథుడు = గరుత్మంతుడు
విరసము = విరుద్ధరసాలుగలది
విరియు = తొలగు
విరోచిక = ప్రకాశము
విశంకటము = విరివి గలది
విశ్రావణులు = త్యాగులు
విసరము = సమూహము
వీఁక = ఉత్సాహము, పరాక్రమము,
విజృంభణము
వృకము = తోడేలు
వృజినము = పాపము
వృద్ధి = వడ్డి
వెరవొందగ = జీవనోపాయముగా
వే = వేగముగా
వేగించు = జాగారము చేయు
వైజననము = ప్రొద్దులనెల
వ్యతీపాతయోగము = అత్యుత్పాతము
వ్యాకీర్ణము = చెదరినది
వ్రాతము = సమూహము
శంబరధరము = మేఘము
శంబరరిపుడు = మన్మథుడు
శరము = ఔల్లు
శలాటువు = పచ్చికాయ
శాఖాలంకారుడు = వేదాలంకారుడు
శాటి = దుప్పటి
శిఖండము = పిల్లజుట్టు
శిఖరిణి = అరటిపండు, పెరుగు,
పంచదారలతో చేసిన భక్ష్యము
శిగ్రువు = మునగచెట్టు
శూర్పము = చేట
శోషితము = ఎండబెట్టబడినది
శ్వపచుడు = చండాలుడు
సంతమసము = చీకటి
సంధిల్లు = చేరు
సరళము = తెల్లతెగడ
సర్గము = స్రవించుట
సర్షపము = ఆవగింజ
సహస్రకోటిభృత్ = చక్రాయుధము
సాదము = అన్నము
సాధ్వసము = భయము
సారసము = బెగ్గురుపక్షి
సాలము = ప్రాకారము
సురుగు = పరుగు
సూరుడు = సూర్యుడు
సైరికులు = రైతులు
స్తేయులు = దొంగలు
స్వమ్ = ధనము
హరి = సింహము, విష్ణువు
హరిదశ్వుడు = సూర్యుడు
హాయనము = సంవత్సరము
హృషీకము = ఇంద్రియము

## ఈ రచయిత ఇతర గ్రంథములపై ప్రముఖుల, పత్రికల అభిప్రాయములు

### కవిత వ్రాసిన కమ్మవారు

• ఇది ఉదాత్తమైన సాహితీ వ్యాససంపుటి.

*–సాహిత్యబ్రహ్మ డా. వి.వి.యల్. నరసింహారావు గారు, 7-3-2013*

• నావంటివాళ్లకు అజ్ఞాతములైన విషయాలతో, చక్కని పద్యాల సంకలనంతో ఈ గ్రంథాన్ని రచించి వెలువరించినందుకు మిమ్ము అభినందిస్తున్నాను.

*–మహామహోపాధ్యాయ డా. పుల్లెల శ్రీరామచంద్రుడు గారు, 25-3-2013*

• పుస్తకంలో మీ శ్రమ ప్రతి పుటలో కనబడుచున్నది. నిష్పాక్షికమైన అభిప్రాయాలు కవి జీవితచరిత్రకు పునాదులు. *–డా. ఇప్పగుంట సాయిబాబా గారు, 29-1-2013*

### జానకీరాఘవము

• ఈ పరిష్కృత గ్రంథ సంపాదకుడు శ్రీ సూర్యదేవర రవికుమార్ ఈ ముద్రిత ప్రబంధానికి 26 పుటల అమూల్య పీఠిక ప్రసాదించారు. ప్రస్తుత ప్రబంధ రచనాకాలపు చారిత్రక విశేషాలు పఠితృలోకానికి పరమానందం కలిగిస్తూ, కనువిప్పు కలిగించేటట్లు వివరించారు. ఈ ప్రబంధం కవిపండిత సహృదయ లోకాన్ని రసపారవశ్యంలో ముంచియెత్తుతుంది. *–సాహిత్యబ్రహ్మ డా. వి.వి.యల్. నరసింహారావు గారు, 20-7-2010*

• "మీరు ప్రారంభంలో వ్రాసిన పీఠిక మీకు ఉన్న సాహితీ మాధురీ నిరంతరాస్వాదాసక్తినే కాక ఇతిహాసిక వివిధ విషయ నిశ్చిత పరిజ్ఞానమును కూడ స్పష్టీకరించుచున్నది. దీనిలో అస్మాదృశులకు తెలియని ఎన్నియో విషయాలను పొందుపరచియున్నారు."

*–మహామహోపాధ్యాయ డా. పుల్లెల శ్రీరామచంద్రుడు గారు, 29-4-2010*

• కావ్య ప్రియులందరినీ ఈ కృతి ఎంతగానో అలరిస్తుందని గట్టిగా చెప్పవచ్చు.

*–సాహితీ కౌముది, జులై 2010*

• అముద్రిత కావ్యాలు ఈలాగున వెలుగులోకి వచ్చి తెలుగు సాహిత్యం పరిపుష్టం కావడానికి మీ పరిశోధన, పరిశ్రమ దోహదపడుతుంది. మీరు మరిన్ని కావ్యాలను వెలికితేవాలని ఆకాంక్షిస్తూ మనసారా అభినందిస్తున్నాను.

*–ఆచార్య ఎండ్లూరి సుధాకర్ గారు, 24-4-2010*

• కమ్మవారికి అంకితం ఇవ్వబడిన ఈ ప్రాచీన కృతిని గురించి ఎంతో పరిశోధన చేసి అనేక చారిత్రాత్మక సాహిత్య విశేషాలను సాధికారికంగా విశ్లేషించినది మీ సంపాదకీయ వ్యాఖ్య. *–శ్రీమతి చింతమనేని వేదవతి గారు, 9-5-2010*

## విఘ్నేశ్వర చరిత్రము

● గ్రంథం సంగతి ఎలా ఉన్నా, దీనికి పరిష్కర్త కూర్చిన విపులమైన పీఠిక ఎంతో విలువైనది. రవికుమార్ గారు ఎంతో పరిశ్రమచేసి, పెక్కు విషయాలను సేకరించి వినాయకుని గురించి వున్న గ్రంథాలను గురించీ, వినాయక క్షేత్రాలను గురించీ, కవిని గురించీ, అతని ఇతర కృతులను గురించీ, కవి వాడిన కొన్ని స్వతంత్ర ప్రయోగాలను గురించీ వివరించారు. ముఖ్యంగా చిత్తూరు జిల్లా కాణిపాకంలోని శ్రీ వరసిద్ధి వినాయక దేవాలయమును గూర్చీ, మణికంఠేశ్వర వరదరాజాలయాలను గురించి ఎన్నో విషయాలను అందజేశారు. *–భారతి, మార్చి–1973*

● పరిష్కర్త శ్రీ రవికుమార్ మద్రాసు, తిరుపతులలోని లైబ్రరీలలోని అముద్రిత ప్రతులను సంప్రతించి, సంస్కరించి దీన్ని ఆంధ్రులకు అందచేశారు. అంతేకాకుండా తమ పీఠికలో... అనేక విషయాలను తెలిపారు. వీరి పరిశోధన ప్రశంసింపదగినది.
*–ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక, 21–2–1973*

● శ్రీ సూర్యదేవర రవికుమార్ గారి విమర్శక దృష్టి, చారిత్రక దృష్టి ఈ పీఠికలో ద్యోతకమవుతూ ఉంటాయి. *–కృష్ణాపత్రిక, 28–4–1973*

● మీరీ గ్రంథమునకు వ్రాసిన 73 పుటల పీఠిక అమోఘముగా నున్నది....మీ సాహిత్య కృషి ఇంకను ఇతోధికముగా వర్ధిల్లు గాక అని ఆశీర్వదించుచున్నాను.
*–శ్రీ నిడదవోలు వేంకటరావు గారు, 16–10–1972*

● మీ కృషి, ఆసక్తి, దక్షతా మీ పీఠికలో ప్రతిఫలిస్తున్నాయి. ఇటువంటి విపుల పీఠికలే ఉత్తరోత్తరా విజ్ఞానసర్వస్వాలకు మళ్ళీ ఆకరాలు కావాలి.
*శ్రీ ఆరుద్ర గారు, 20–9–1972*

● నిజము చెప్పవలెనన్నచో ఈ చరిత్ర గూర్చి యింత విపులముగా ఈ రోజులలో ఎవ్వరు వ్రాయరు. వ్రాయలేరు కూడ. *–శ్రీ కొత్త సత్యనారాయణగారు, 26–10–1972*

## శ్రీ కాణిపాక వినాయక శతకము

● సరసమైన భావసంపదతో సరళమైన భాషలో రసజ్ఞ జనరంజకంగా మంచి శతకం వ్రాసి కృతార్థులయినారు మీరు. *–శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు*

## వ్యాససుధ

• మీ పరిశోధనలు దీక్షతో చేస్తున్నవని ఆ వ్యాసాలు చాటుతున్నాయి. దీక్ష రాటుతేలి పరిపక్వమైనపుడే దక్షత వస్తుంది. మీరు ఆ దిశలో ప్రయాణిస్తున్నట్లు కన్పడుతోంది.

*–శ్రీ ఆరుద్ర గారు, 29–4–1989*

• తీసుకొన్న విషయం ప్రాచీన సాహిత్యమైనా, పశువైద్యానికి సంబంధించిందైనా పొరలు విదిల్చి పరిశీలించటం మీ పరిశోధక ప్రవృత్తికి నిదర్శనం.

*–డా॥ సి. నారాయణరెడ్డి గారు, 19–6–1989*

• మీ వ్యాససుధ చదివాను. అన్నీ గొప్ప పరిశ్రమ ఫలితంగా రూపొందిన రచనలు. మంచి శైలి. విభిన్న విషయాలను గురించి ప్రామాణికంగా వ్రాశారు.

*–ఆచార్య రామచంద్రచౌదరి గారు, 7–7–1990*

• శ్రీ సూర్యదేవర రవికుమార్ గారి వృత్తి వేరైనా సాహిత్యంలో లోతుగా ప్రవేశం గలవారు. అధ్యయనం, పరిశీలన, సత్యాన్వేషణ – రవికుమార్‌గారి ప్రత్యేకతలు.

*–ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 28–9–1989*

• రచయితలోని ప్రతిభా వైవిధ్యానికి రచనా వైచిత్ర్యానికి ఈ వ్యాససుధ నిజంగా ఒక ఉత్తమ, ఉన్నత సాహితీసుధ. *–శ్రీ సంజీవదేవ్ గారు, తుమ్మపూడి*

• పూర్వ పరిశోధకుల కృషిని తైపారు వేయటంలోను, అందలి నిజానిజాలను బేరీజు వేసి నిష్కర్షించటంలోనూ, సొంత అభిప్రాయాలను వ్యక్తీకరించటంలోనూ రచయితకు గల సంయమనమూ సత్యప్రీతీ, సరసవచోవిలాసమూ ఈ సంపుటిలో అడుగడుగునా సాక్షాత్కరిస్తాయి. *–ఆచార్య తూమాటి దొణప్ప గారు, హైదరాబాద్*

## ఆరు నెలల తెలుగు కవితలు – ఒక పరిశీలన

• వృత్తిరీత్యా వెటర్నరీ వైద్యుడైన రచయిత ఈ సమీక్షలో చక్కగా తెలుగు కవితలను డిసెక్ట్ చేయటం విశేషం. *–వనిత, అక్టోబరు, 1993*

• ఇలాంటి పరిశోధన ఈమధ్య రాలేదు తెలుగులో.

*–శ్రీ పాపినేని శివశంకర్ గారు, గుంటూరు*

• ఈ ఆరు నెలలు ఎప్పటివైనా చదువరికి విషయమూ వివరణ కొత్తగాబట్టి – కొత్త రుచిగానే ఉంటాయి. *–శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారు, హైదరాబాద్*

• పరిశీలనలో భావస్పష్టత, విశ్లేషణలో సాత్విక ధోరణి నన్ను బాగా ఆకట్టుకొన్నాయి. ఇది పరిశోధకులకు ఒక రిఫరెన్సులా ఉపయోగపడ్తుందని నా విశ్వాసం.

*-శ్రీ రాధేయ గారు, తాడిపత్రి*

• వృత్తితో ప్రమేయం లేకుండా నిరంతరం సాహితీ వ్యాసంగం కొనసాగిస్తున్న మీ రసహృదయం ఆదర్శప్రాయమైనదని మా భావన.

*-శ్రీ ఆచార్య భావన్ గారు, విజయనగరం*

• మీరింత సునిశిత పరిశోధన చేయగలగటం నాకు పరమానందమైనది.

*-శ్రీ ఊట్ల కొండయ్య గారు, హైదరాబాద్*

• మీ పుస్తకం గురించి అందరి అభిప్రాయాలు చదివాను, ఆనందం పట్టలేకపోయాను.

*-డా. వి.బి.జి.తిలక్ గారు, విజయవాడ*

• కవిగా, పరిశోధకునిగా, విమర్శకునిగా మీలో కనిపించే త్రిముఖీన ప్రజ్ఞ ఆశ్చర్యకరమైనది. అందులోనూ, వేరు వృత్తిలో నిమగ్నులై ఉంటూ, ఇంతటి సాహిత్య వ్యాసంగాన్ని సాగించటం మరింత ఆశ్చర్యకరం. మీరు చేసిన "ఆరు నెలల తెలుగు కవితలపై పరిశీలన"కు కొండంత ఓపిక కావాలి. ఏమైనా, మీరెన్నుకున్న మార్గం చాలా గొప్పది. ఆ మార్గాన పయనించటానికి కావలసిన శక్తీ, సామగ్రీ మీయొద్ద దండిగా ఉన్నది. ముందుకు సాగండి. మీకు జయమగు గాక. *-శ్రీ కొంగర జగ్గయ్య గారు, 10-1-2003*

## స్నేహగీతం

• మీ 'స్నేహగీతం' నాకొక కమ్మని అనుభూతిని కలిగించింది. '...శ్రావ్యమైన శబ్దం ద్వారా, రమ్యమైన అర్థాన్ని , హృద్యమైన అనుభూతిగా పరిణమింపజేసేది కవిత్వం' అన్న నిర్వచనానికి సజీవ నిదర్శనం మీ కవితా సంకలనం.

*-శ్రీ కొంగర జగ్గయ్య గారు, 10-1-2003*

## కవిత వ్రాసిన కమ్మవారు

• తెలుగు సాహితీ మకుటంలో మణుల వలె విరాజిల్లిన ప్రముఖుల గురించి మీరు విరచించిన విధానం ప్రశంసాపాత్రం. మీ రచనా వైదుష్యానికి నా ప్రగాఢాభినందనలు.

*-డా॥ సి. నారాయణరెడ్డి గారు, 20-7-2016*

• ఏ సిద్ధాంత గ్రంథం కోసమో పరిశోధకులు చేయవలసిన పనిని మీరు ఇష్టంగా తలకెత్తుకొన్నారు. ఎంతోమంది అజ్ఞాతంగా నిలిచిపోయిన కవులను, కవయిత్రులను పరిచయం చేశారు. జగ్గయ్య గారిని సినీనటులుగానే ఎక్కువమంది గుర్తుపెట్టుకొంటారు. కవిగా, గొప్ప సాహిత్యపరునిగా ఆయన ప్రతిభామూర్తిని మీరు ఆవిష్కరించినందుకు ఎంతో సంతోషం కలిగింది. *-శ్రీమతి చింతమనేని వేదవతి గారు, 6-9-2016*

# ప్రాచీన భారతీయ పశు విజ్ఞానము

● నాకు తెలిసినంతలో ప్రాచీన భారతీయ పశు విజ్ఞానాన్ని గురించి మరెవరూ ఈవిధమైన రచన చేయలేరు. ఒకప్పుడు రచించిన వ్యాసాల సంకలనమే కావచ్చును గాని, మీరు చేసిన వ్యాసాల కూర్పు ఒక అద్భుత సమాచార పరంపర. మన పూర్వీకులకు పశువులను గురించి ఇంత జ్ఞానం ఉన్నదా అని ఆశ్చర్యం కలుగుతుంది. ఆనందంగానూ ఉంది. మీ శైలిని గమనించినప్పుడు ఆధునిక విజ్ఞానశాస్త్రాలను మన తెలుగులో బోధించటానికీ, గ్రంథాలుగా వెలువరించటానికీ మన భాష యోగ్యమైనదనే విశ్వాసం కలుగుతుంది. *–డా॥ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు, 9-7-2016*

● మీరు నిరంతర సాహిత్య రచన గావిస్తూ అమూల్యమైన రచనలను అందిస్తున్నారు.
*–డా॥ టి. శ్రీరంగస్వామి గారు, 15-7-2016*

● ఇందులో అనేక సాహిత్యాంశాలు చోటుచేసుకోవటం నాకు ఆశ్చర్యానందాలను కలిగించింది. మీరు శాస్త్రీయ విజ్ఞానానికి సాహిత్య పరిమళం జోడించారు.
*–శ్రీమతి చింతమనేని వేదవతి గారు, 6-9-2016*

● మీ గ్రంథం నన్ను అమితంగా ఆకర్షించింది. మీ పరిశోధన, విషయ పరిజ్ఞానం, కృషి ప్రశంసనీయం.
*–డా॥ మక్కెన శ్రీను గారు, పశువైద్య కళాశాల, గన్నవరం, 13-7-2016*